రాధాస్వామీ దయాల్ కీ దయా
రాధాస్వామీ సహాయ్

# సారబచన్

## (వచనము)

పరమ్ పురుష్ పూరనధనీ హుజూర్ స్వామీజీ మహారాజ్
వారిచే రచింపబడినది.

రాధాస్వామీ సత్సంగసభవారి యనుజ్ఞచే తెనుగు భాషలోనికి
తర్జుమా చేయబడినది.



ప్రకాశకులు :
రాధాస్వామీ సత్సంగసభ
దయాల్బాగ్, ఆగ్రా

మొదటి కూర్పు ] 1970 [ 1000 ప్రతులు

# తొ లి ప లు కు



సారబచన్ (వచనము) అనెడి యీ గ్రంథములో రాధాస్వామీ మతముయొక్క పరమపూజ్య స్థాపకులైన పరమగురు హుజూర్ స్వామీజీమహరాజ్ వారు తమ గృహములో సత్సంగము జరిగించిన కాలములో సెలవిచ్చిన మహోపదేశములు కొన్ని సంగ్రహము చేసి వ్రాయబడినవి. పరమగురు హుజూర్ మహరాజ్ వారీ మహోపదేశములను స్వయముగ జతపర్చి సంస్కరించినపిమ్మట, తమయొక్కయు, పరమగురు హుజూర్ స్వామీజీమహరాజ్ వారి కనిష్ఠసోదరులైన సేఠ్ ప్రతాపసింగ్ సాహెబ్ గారి యొక్కయు యాజమాన్యమున క్రీ.శ. 1884వ సం॥రములో మొట్టమొదట గ్రంథరూపమున ప్రకటించిరి.

ఆ ప్రకటనసమయమున పరమగురు హుజూర్ మహరాజ్ వారు ఒక వ్యాసమును ఉపోద్ఘాతరూపముగా వ్రాసి దాని నీగ్రంథము యొక్క ప్రథమభాగముగా అచ్చొత్తించిరి. ఇప్పుడుకూడ నీగ్రంథము అవ్విధముననే యున్నది. రాధాస్వామీ మతబోధలయొక్కయు, ఈమతముయొక్క పరమపూజ్యస్థాపకుని మహోపదేశములయొక్కయు, సారమంతయు నీవ్యాసములో నిమిడియున్నది.

ఈ మహోపదేశములు, యేవో కొద్దిమాత్రము తప్ప మిగిలిన వన్నియు హిందీభాషలో నతిసంక్షిప్తరూపమున బహు ధారాళమైన సులభశైలిలో వ్రాయుచ్చబడినవి. పరమగురు హుజూర్ స్వామీజీ మహరాజ్ వారి మహావచనములు గంభీరోదారభావగర్భితములై సూత్రములవలె మహాసంక్షిప్తములై యద్భుతమైన అర్థగాంభీర్యము

గల్గియున్నవని ప్రేమసమాచార్ పత్రికలో పరమగురు సర్కార్ సాహబ్ వారు సెలవిచ్చియున్నారు.

సంతుమతమునకును రాధాస్వామీమతమునకునుగూడ ప్రాణాధారభూతమైన మహోత్కృష్టసిద్ధాంతము, అనగా, సద్గురువు మానవ రూపములోనున్న సాక్షాద్భగవంతుడనియు, కావుననే రాధాస్వామీ మతములోని భక్తుడు సాక్షాద్భగవంతునియెడల నెట్టి భక్తివిశ్వాసములు గలిగియుండునో సద్గురువునందుగూడ నట్టి భక్తివిశ్వాసములను గలిగి యుండవలెననియు ఈ వచనములలో ననేకస్థలములలో ననేక విధములుగ నొక్కి బోధపర్చబడినది.

హిందీ ఆంగ్లభాషలు రెండును తెలియని ఆంధ్రసోదరీసోదరులకు రాధాస్వామీ మతముయొక్క పరమపూజ్యస్థాపకాచార్యులవారి మహోపదేశములను బోధపర్చుకొనుటలో నీయాంధ్రానువాదము వలన సహాయము చేకూరగలదు. రాధాస్వామీ సత్సంగసభవారీ యాంధ్రానువాదమును ప్రచురింపబూనుటలో ప్రధానోద్దేశ్యమిదియే.

హిందీ మూలగ్రంధములోని శైలియొక్క సరళత్వగాంభీర్యము లీ యాంధ్రానువాదములో నుండనేరవనుట నిస్సందేహమే. అయిన నీయనువాదము నందఱకు సులభముగ బోధపడునట్లు చేయుటకై సాధ్యమైనంతవఱకు ప్రయత్నించబడినది.

సభవారు అధ్యక్షులైన శ్రీ పుప్పాలవారి సత్యనారాయణగారికి ఈ తెలుగు తర్జుమాచేసినందుకు కృతజ్ఞత తెల్పుచున్నారు.

దయాల్బాగు, ఆగ్రా
21–9–'70

ప్రకాశకులు.

రాధాస్వామీ దయాల్ కీ దయా
రాధాస్వామీ సహాయ్.

# సారబచన్

పరమగురు హుజూర్ రాధాస్వామీ సాహబ్ [1] వారి
మహోపదేశముల సారాంశము.

వచనము :- ఈ ప్రపంచము నాశమానము. ఇందలి వస్తువులన్నియుగూడ నాశమానములు.

ఏ మానవుడీ ప్రాపంచిక వ్యవహారమును చక్కగ పరిశీలించి ఇదంతయు కల్పితము, అసత్యము, నాశమానము నైనట్లు తెలిసికొని పరమపురుషుని భజన, స్మరణలుచేసి, శరీరమును సఫలముచేసికొనునో, మఱియు నెవరు, ఆ సృష్టికర్త మహాదయతో ప్రసాదించినట్టి, ఈ నరశరీరములోని యుత్తమ వరదానములను ఉపయోగించుకొని అమూల్య తత్త్వవస్తువైన సురత్ [2] లేక జీవాత్మ [3] ను దాని నిజస్థానమునకు జేర్పించునో అట్టివానినే బుద్ధిశాలియు, నేర్పరియు నని పేర్కొనదగును.

1. సురత్ లేక జీవాత్మను "రూహ్" లేక ఆత్మ అని యందురు. ఇది అన్నిటికన్న నుచ్చతమమైన సత్యనామస్థానము అనెడి రాధాస్వామీధామము నుండి దిగివచ్చి యీ శరీరములోపడి త్రిగుణములు, పంచతత్త్వములు, దశేంద్రియములు, మనస్సు మున్నగువానిచే బంధింపబడిపోయినది. శరీరముతోను, శరీరమునకు సంబంధించిన యితరవిషయములతోను ఆత్మ కేర్పడిన బంధనములను ఆత్మ తనకుతానే వదల్చుకొనుటకు శక్యముకానంతయెక్కువగా అవి

1. ఈ ప్రథమభాగము రాధాస్వామీ మతముయొక్క పరమపూజనీయ ద్వితీయాచార్యులైన పరమగురు హుజూర్ మహారాజువారిచే రచింపబడినది. ఈ గ్రంథములో నంతటను వారు స్వామీజీ మహారాజువారిని "హుజూర్ రాధాస్వామీ సాహబ్" అను నామముచే పేర్కొనిరి.

2. సురత్ అను హిందీపదము "స్వరత" అను సంస్కృతపదముయొక్క రూపాంతరము. ఆత్మ ఎల్లపుడు తనయందే రతమై అనగా యేకాగ్రతచెంది యుండును గావున సురత్ అనగా సంతుల పరిభాషలో ఆత్మ యని అర్థము.

3. జీవాత్మయనగా, ఆత్మ జడముతో బద్ధమైయున్న చైతన్యావస్థకు పేరు. అందుచేత నీ పదము ఆత్మకు నామాంతరముగా ప్రయోగింపబడుచున్నది.

కఠినతరమైపోయినవి. ఈ బంధనములనుండి వదల్చుకొనుటయే మోక్షమని చెప్పుదురు. ఆత్మకు ఇంద్రియములతోను, తత్త్వములతోను, మనస్సుతోను అంతర్యబంధనములును, ప్రాపంచిక పదార్థములతోను, కుటుంబముతోను, బంధువులతోను బాహ్యబంధనములును ఏర్పడినవి. ఆత్మ, లేక జీవాత్మ యీరెండువిధములైన బంధనములలోపడి తన నిజస్థానమును పూర్తిగ మఱచి పోవునంత యధికముగా చిక్కుకొనిపోయి ఇపుడు పరిపూర్ణసద్గురువుయొక్క దయాకటాక్షములు లేనిదే దాని అసలుస్థానమును తిరిగి చేరుకొనలేనంతదూరమున తన స్వస్థానమునుండి వేఱుపడిపోయెను. ఇపుడు మానవుని కర్తవ్యమేమనగా తన ఆత్మను తన మూలస్థానమునకు అనగా భండారమైన సత్యనామపదము, లేక రాధాస్వామిధామమునకు చేర్చుటయే. ఆ పనిని నెఱవేర్చువఱకు ఆత్మకు ఈ లోకములోని సుఖదుఃఖములు, కష్టములనుండియు విముక్తి సాధ్యము కానేరదు.

2. ఈ ఆత్మను ఏవిధముగనైనను దాని నిజధామమునకు జేర్పించవలయుననియే సమస్తమతములయొక్క ముఖ్యోద్దేశ్యము, బోధయునైయున్నది. ప్రాచీనకాలపు మహాత్ములందఱును బోధించినమార్గముగూడ నిదియే. ఆధ్యాత్మికసాధనల నభ్యాసముచేసి, బాహ్యాభ్యంతరబంధనములను స్థూలసూక్ష్మకారణబంధనములను త్రెంచివేసి తనమనస్సు నీ ప్రపంచమునుండి సంబంధరహితముగ జేసికొని, తనఆత్మను దాని మూలస్థానమునకు జేర్పించిన మహాపురుషుడే పరిపూర్ణసిద్ధుడుగ పరిగణింపబడును. ఆ యున్నతోన్నతస్థానమును జేరుకొన్న మహాపురుషులనే పరిపూర్ణపురుషులనియు, సిద్ధపురుషులనియు, నిజభక్తులనియు, భగవత్ప్రేమాతురులనియు, పూర్ణజ్ఞానులనియు, పరిపూర్ణసాధువులనియు చెప్పవచ్చును. కాని స్వయముగ నా మూలస్థానమును పొందకుండగను, అందులకై యెట్టి అభ్యాసమును చేయకుండగను ఉండి, సిద్ధపురుషులమహిమాగానము చేయుచు వారిగ్రంథముల పఠనపాఠములుమాత్రమే జరిపించువారిని పండితులనియు, విద్వాంసులనియు మాత్రమే పేర్కొనవలయును.

3. సమస్తమతములలోని ఆచార్యులు, మహాత్ములు, అవతారపురుషులు, ప్రవక్తలును ఆధ్యాత్మికాభ్యాసముచేసి అంతర్యమున మూలస్థానమును జేరుకొనుటకు ప్రయత్నించినవారే కాని, అట్టివారందఱు నా మూలస్థానము వఱకు జేరుకొనలేదు. అందులో చాలమంది ప్రథమస్థానమువఱకుమాత్రమే జేరుకొనిరి. మఱికొందఱు ద్వితీయస్థానమును, అరుదుగ కొద్దిమంది సాధు

వులు, భక్తులునుమాత్రమే తృతీయస్థానమును పొందగలిగిరి. కేవలము సంతు మహాపురుషులుమాత్రమే పంచమస్థానమైన సత్యనామస్థానమును, మఱియు వారిలో నరుదుగ నేయొక్కరోమాత్రమే అష్టమస్థానమైన రాధాస్వామీ ధామమును పొందగలిగిరి. సృష్టికి ఆరంభమునందు ఈ ధామమునుండియే ఆత్మలు క్రిందికి దిగినవి. అట్లు ఒకొక్కలోకమునుండి దాని క్రిందిలోకమునకు దిగుచురాగా అవి సత్యలోకము మున్నగు మధ్యలోకములనుండియే దిగివచ్చినట్లుపభ్రమ గలిగెను. సత్యలోకమునకు క్రిందిలోకములవఱకు మాత్రమే సిద్ధి పొందినవారు తాము చేరుకొన్నలోకమునుండియే ఆత్మలు ఆదియందు దిగి వచ్చినవని తలంచుకొనుచుండిరి. అట్టివారికి పరిపూర్ణ గురువు లభ్యముకానందువలన వారు తాముపొందినలోకము నే ఆత్మల కాదిభండారముగను,ఆ లోకాధిపతినే దాని క్రిందిసృష్టికంతకును అధిపతిగను సృష్టికర్తగను నిర్ణయించుకొనుచుండిరి. అందుచే వారు ఇతరులకు ఆ లోకాధిపతికే పూజోపాసనలు చేయుడని బోధపఱచుచు, ఆ లోకాధిపతియందే పరమసర్వేశ్వరుడను భక్తిభావము గలుగజేయుచుండెడివారు.

4. రాధాస్వామీధామము ఈసృష్టికంతకు సర్వోన్నతధామమనియు రాధాస్వామీనామము నిజమైన భగవంతుడు, జగత్ప్రభువు నైన పరమపురుషుని నామమనియు నిపుడు తెలిసికొనవలసియున్నది. ఈ ధామమునుండి రెండు స్థానములుక్రిందుగా సత్యనామస్థాన మున్నది. దీనినే సంతుమహాత్ములు సత్యలోకమనియు, సత్యఖండమనియు, సారశబ్దమనియు, సత్యశబ్దమనియు, సత్యనామమనియు, సత్యపురుషుడనియు పేర్కొనుచుండిరి. దీనిబట్టి సత్యలోకము రాధాస్వామీధామము ననెడి ఈ రెండుస్థానములును యథార్థముగా సంతులకును, పరమసంతులకును విశ్రామస్థానములని తేటపడుచున్నది. కావుననే సంతులు మిగత సిద్ధపురుషులందరికన్న నుత్తమతరగతికి చెందినవారని చెప్ప వలసియున్నది. ఈ రెండుస్థానములలో మాయగాని, మనస్సుగాని లేవు. క్రింది సమస్తలోకములును సృష్టియంతయును ఈ రెండుస్థానములచే నావరింపబడి యున్నవి అనగా, యావత్తు సృష్టియు వీనిక్రిందుగను వీని యావరణలోను ఉన్నది. రాధాస్వామీపదము అపారము, అనంతము, అనాదియునై, మిగత లోకములన్నియు దీనినుండియే ప్రకటితమగుటచే నీ ధామమును 'అకహ' అనియు ( అనగా వర్ణింపశక్యముగానిది ) అనామి (నామరహితము, అనియు నందురు. దీనినే నిజమైన "లామకాన్" (అనగా అది యొకలోకమని చెప్పుటకు వీలులేని స్థానము) అని చెప్పుదురు.

5. సాధువులు, జ్ఞానులు, భక్తులు, అవతార పురుషులు, ప్రవక్తలును, ఇంక నితర మహాత్ములును, ఎవరెవరు మూలస్థానమువరకు చేరుకొనలేదో అట్టి వారందఱును సంతులపదవి కంటె తక్కువపదవికి చెందినవారని యిప్పుడు తెలిసికొనదగును. వారు మార్గమధ్యములో నొకొక్కస్థానములో నొకొక్క రుండిపోవుటచే నెవరెవ రేయే స్థానమును చేరుకొనిరో వారాయాస్థానము నే ఆఖరిస్థానముగను, ఆయధిపతినే అనంతపురుషుడు, అపార పురుషుడుననియు భావించుకొనుచు, ఆ స్థానాధిపతినే పూజింపుడని యుపదేశించెడివారు. అందు వలననే ప్రపంచములో వివిధమతము లేర్పడినవి. ఏలనన, పరమసర్వేశ్వరుడు తన సర్వశక్తిమత్త్వము మూలమున సృష్టిలోని ప్రతిలోకమును తననిజస్థానమున కొక ప్రతిబింబముగా, అనగా ఛాయారూపముగా సృజించుటచే క్రిందిసృష్టి లోని లోకములలోని ఆనందము, పరిస్థితులును కొంతవఱకు మూలధామములో వలెనే యుండుచున్నవి. కాని క్రిందిలోకములలోని ఆనందము, పరిస్థితులకును మూలధామములోని ఆనందము, పరిస్థితులకును విశిష్టతలోను, అనుభవకాల పరిమాణములోను, చాలవ్యత్యాసముగలదు. ఇంతియగాక, నీ లో క ము ల లోని సృష్టికూడ వేవేలు విధములుగనుండి క్రమ క్రమ ము గ పై లోకములకు వెళ్లినకొలది సూక్ష్మము, అ తి సూ క్ష్మ ము, మహా సూక్ష్మముగను, నిర్మలము, అతినిర్మలము, మహానిర్మలముగను మారుచుండును కాని ఈలోకములన్నిటిని చివరవఱకు చూచినవానికి మాత్రమే యీ తారతమ్యము గోచరముకాగలదు. లేనిచో నెవరేలోకమును పొందిరో వారాలోకాధిపతియొక్క తేజస్సు స్వరూపమును చూచి ఆయధిపతియే అనంతము, అపారమునైన పరమసర్వేశ్వరుడు సాక్షాద్భగవంతుడని ప్రకటింపసాగుదురు. ఈ లోకములలో నేలోకముయొక్క అధిపతినైనను దర్శించినపురుషుడు, మైమఱచిపోవునంతటి ఆనందసంతోషములలో మగ్నమైపోవును. అతని కప్పుడుకలిగెడి ప్రేమ సంతోషపరవశత్వము వర్ణనాతీతమైయుండును.

6. ఆత్మ ఊర్ధ్వలోకములలో చేరుకొన్నపుడు, దానికి కలిగెడి అనుభవ పరిస్థితులు వేవేలులోకములలో వేవేలువిధములుగ నుండును. ఏ స్థానమును జేరుకొన్నవానికి ఆస్థానాధిపతియే, అందుకు క్రిందిలోకములన్నిటిలోను వ్యాపించినట్లుగను, ఆక్రింది లోకములసృష్టికంతకు నాధారభూతుడుగను కన్పట్టుచుండును. ఉదాహరణార్థము ఎవరైన మొట్టమొదటిస్థానమునుగాని ద్వితీయ స్థానమునుగాని పొంది అంతటితోనే ఆగిపోయినయెడల అతనికి ఆస్థానాధిపతియే క్రిందిసమస్తలోకములకు సృష్టికర్తగను, ఆ లోకములందంతట వ్యాపకుడుగను

కన్నట్టి క్రిందిలోకముల సృష్టియంతయు నాస్థానాధిపతివలననే యుత్పన్నమై ఆ యధిపతియొక్క ఆధారసహాయములవలననే నిలబడియున్నట్లు గోచరమగును. అందుచే నట్టిసిద్ధపురుషుడు ఆలోకాధిపతినే పరమపురుషుడుగ భావించి తన శిష్యులకును, తనవద్దకువచ్చినవారికిని, ఆస్థానమునకే భక్తిపూజలు సల్పవలయు నని యుపదేశము నిచ్చునుగాని, దానిపైస్థానములవిషయమే అతనికి తెలియదు. ఏలనన, దానిపైస్థానముల రహస్యము నొక్కసంతసద్గురువుదప్ప మరెవ్వరు నెరుగరు. అతనికి సంత్ సద్గురువు లభింపలేదు. లభించియుండినచో నతడు గూడ తన శిష్యులకు ముందులోకముల రహస్యములను ప్రకటించి వారి నామార్గమునందు ప్రవర్తింపజేసి యుండెడివాడు.

ఇందు మూలముననే తనఆంతర్యమున మొదటి స్థానమునుగాని, రెండవ స్థానమును లేక మూడవ స్థానమునుగాని జేరుకొనినట్టి వ్యక్తియొక్కరిని అంత్యస్థానముజేరుకొనిన పరిపూర్ణసిద్ధులుగ నెంచుచుండుట జరుగుచున్నది. కారణమేమనగా ప్రథమస్థానమును పొందినంతమాత్రముననే సాధకునకు సమస్తశక్తులు చేకూరునుగావున నతనికిగల శక్తులు, మహిమలమూలమున నతనిని పరిపూర్ణునిగను, మహాత్మునిగను లోకులు మన్నింపదొడగుదురు. మరియు పైనచెప్పిన మండలములు క్రిందిసృష్టిలోని లోకములకన్న చాలయున్నతమైనవనియు, నామండలములను బొందిన మహాత్మునిలో నీప్రపంచసంబంధమైనట్టిగాని శరీరసంబంధమైనట్టిగాని మాలిన్యము పూర్తిగ నశించిపోవుననియు చెప్పుటలో నెట్టిసందియముకూడ లేదు.

7. సత్యఖండము, సత్యలోకము, అను నామాంతరములచే ప్రఖ్యాతమైన సత్యనామస్థానము మహోన్నతమండలమనియు, నది సంతుమహాత్ములుండు స్థానమనియు పైన చెప్పియున్నాము. దానిపైన నింకను మూడు ఉత్తమ మండలములున్నవి. కాని ఇంతవరకు నేసంతుమహాత్ములుగూడ వాని రహస్యమును బయలుపరుచలేదు. ఇప్పుడు పరమపురుష రాధాస్వామిదయాళుదు జీవులపై మహాదయతో నాస్థానములను సంపూర్ణవివరములతో ప్రకటపరచి, సమస్తలోకములకు నాదిభండారమైనట్టియు, సర్వోన్నతమైనట్టియు పరమసంతుల నిజస్థానమైనట్టియు, మూలస్థానమగు రాధాస్వామీపదము యొక్క రహస్యమునుగూడ అత్యంతదయతో ప్రకటించిరి. ఈస్థానమునుండియే ప్రప్రథమములో జీవాత్మ క్రిందికి దిగివచ్చెను. దీనిక్రిందనున్న లోకములన్నియు గూడ, జీవుని అవరోహణ మార్గములోని మజిలీలే. ఇప్పుడు సురత్ అనగా జీవాత్మ శరీరములో సహస్రదళకమలమునకుక్రింద స్థావరముగనుండి, దాని

తేజస్సును శక్తిప్రభావమును శరీరమంతటను వ్యాపింపజేసి మనస్సు ఇంద్రియములద్వారా శారీరక మానసికకార్యములన్నిటిని నెఱవేర్చుచున్నది.

8. మనస్సులు రెండు: ఒకటి బ్రహ్మాండీ మనస్సు, అనగా, బ్రహ్మాండమునకు సంబంధించిన మనస్సు. రెండవది పిండీమనస్సు, అనగా, పిండాండమునకు సంబంధించిన మనస్సు. బ్రహ్మాండీ మనస్సుయొక్క స్థానములు త్రికుటియు, సహస్రదళకమలమును. దీనినే బ్రహ్మ, పరమేశ్వరుడు లేక, పరమాత్మయనియు, దేవుడనియు నందురు. పిండీమనస్సు అనగా వ్యక్తిగత మనస్సుయొక్క స్థానములు మానవశరీరములో నేత్రద్వయమునకు వెనుకను, హృదయచక్రమందును ఉన్నవి. జీవాత్మయొక్క సహాయముతో నీ పిండీ మనస్సు ప్రాపంచిక కృత్యములన్నింటిని నెఱవేర్చును. జీవాత్మకు మనస్సునెడల మహాగాఢప్రేమ యేర్పడిపోవుటచే మనస్సుతో పాటు జీవాత్మయొక్క వృత్తికూడ అధోముఖమైపోయెను. అనగా క్రింది స్థానములవైపునకే పూర్తిగ తిరిగిపోయియున్నది. మనస్సు, ఇంద్రియములు, మున్నగువానికి తమ తమ కృత్యములను నెఱవేర్చుశక్తియంతయు జీవాత్మవలననే చేకూరుచున్నది. సురత్ లేక జీవాత్మ తనస్వస్థానమువైపున కభిముఖమైనచో అనగా తనవృత్తిని స్వస్థానమువైపునకు మఱల్చినచో, లౌకికపదార్థములవైపునకు దానియభిముఖత్వము తగ్గిపోయి నివృత్తికి అనగా మోక్షమునకు త్రోవచూపట్టును. ఎవని ఆత్మయైనను బ్రహ్మాండీమనస్సుయొక్క స్థానములకు ఊర్ధ్వముగనున్న తనస్వస్థానమగు సత్యలోకమందు ప్రవేశించినపుడు అతనికి స్థూల, సూక్ష్మ, కారణబంధనములును, శరీరము, మనస్సు, ఇంద్రియములకు సంబంధించిన బంధనములును సంపూర్ణముగా నశించిపోయి, అతడు తనలౌకికప్రవృత్తిని ముఖ్యావసరమైనంతవఱకే పరిమితమగునట్లు చేసికొని, తనకెపుడు కావలెనన్న నాతత్క్షణమే దానిని ముగించివేయగల్గునట్లు పూర్ణస్వాతంత్ర్యము గల్గియుండును. పర్యవసానమేమనగా సురత్ అనగా జీవాత్మ, స్థూల, సూక్ష్మ, కారణదేహములతో అనగా శరీరము, మనస్సు, ఇంద్రియములతో తనకు స్థాపితమైన బంధనములను త్రెంచుకొనిగాని, శిథిలముచేసికొనిగాని, పిండబ్రహ్మాండదేశములకు సంబంధించిన మలినస్థానములను విడచి, తనస్వస్థానమువైపునకు మఱలి బ్రహ్మాండీమనస్సును దాటి పైకి వెళ్లువఱకు జడచైతన్యములగ్రంధి విడిపోనేరదు. జడపదార్థములనగా శరీరము, మనస్సు, ఇంద్రియములు, సమస్తప్రాపంచికవ్యాపారములు, ఇంద్రియభోగములు మున్నగునవి. ఆత్మసూక్ష్మమైనదియు, చేతనస్వరూపమైన

దియు. ఈరెండింటియొక్క సమ్మేళనకే గ్రంథియనిపేరు. కావున నీ ముడి విడి పోవువఱకు, అనగా మాయతో సమ్మేళనము పోవువఱకు మోక్షము ఉండ నేరదు, ఆశా[1]తృష్ణలకు నాశము కలుగనేరదు.

9. అభ్యాసముయొక్క ప్రభావమువలనను, మఱియు నాధ్యాత్మికమార్గమున కొంతదవ్వేగుటమూలమునను, ఆశాతృష్ణలప్రాబల్యము కొంతతగ్గి, కొలది కాలమువఱకు నవి నిజముగ నణంచివేయబడినట్లును నశించిపోయినట్లునే కనబడ వచ్చునుగాని నిజమునకవి అభ్యాసియాత్మ సత్యలోకములో ప్రవేశించునంత వఱకుపూర్తిగ నిర్మూలము కానేరవు. ఏలనన, సాధకుని ఆత్మ సత్యలోకము నకుచేఱకుండినచో, బ్రహ్మాండీమనస్సు, మాయల ప్రభావము తీవ్రముగా కలిగినప్పుడును, విషయభోగములు, వాని యానందములు, నతనిపై నెక్కుడు వ్యామోహము కలుగజేసినప్పుడును, ప్రథమస్థానమైన సహస్రదళకమలమువఱకుగాని, రెండవస్థానమైన త్రికుటివఱకుమాత్రమేగాని సిద్ధిపొందినసాధువు కాపుదల తప్పిపోయి, భ్రష్టుడైపోవుట కవకాశము గలదు. పిమ్మట నతడు వెంటనే మెలంకువ తెచ్చుకొని, భోగములనుండి విముఖుడై, అభ్యాసముచేసియు, గురుకటాక్షమును పొందియు, తిరిగి తనమొదటిస్థానమునకు చేరుకొనినను జేరుకొనవచ్చును. కాని, మధ్యకాలములో నతడు పతితుడాయెననుటలో సందేహమేమియు లేదు. కావున అభ్యాసియైన భక్తుడు, తనఆత్మను ఆశాతృష్ణలుగాని ఇహపరలోకములకు సంబంధించిన భోగవాసనలుగాని లేశమాత్రమైనను కానరానట్టియు, కేవలము పరమపురుషులు, సర్వసమర్థులునైన రాధాస్వామీదయాళుని దర్శనానందవిలాసలు తప్ప మఱేదియు లేనట్టియు, ఉన్నతోన్నతస్థానమునందు ప్రవేశపెట్టుట యవసరము. అప్పుడే యతడు మాయయావరణమునుండి అతిక్రమించినవాడై, యెట్టి యేమఱిపాటులో పడిపోకుండ సురక్షితముగనుండ గలడు. అట్టివానికే సంతుపదవి లభ్యమైనట్లు చెప్పవలెను. గొప్పగొప్ప అవతారపురుషులు, ఋషీశ్వరులు, మునీశ్వరులు, ఔలియాలు[2] ప్రవక్తలును వారి వారి కాలములలో మాయయొక్క దుష్ప్రభావమున కప్పటప్పట లోనై

---

1 సృష్టికిపూర్వము కొన్నిఆత్మలకు మాయతో కలియవలెననెడి ప్రవృత్తి లేక వాసన యుండుటచే నవి యీ మాయాదేశమునకు దిగివచ్చినవి. దాని పర్యవసానముగా పుత్రేషణ, ధనేషణ, అన్నపానాదులకొఱకు కోరికలు, ఇత్యాదితృష్ణ లుద్భవించినవి. మొదటిప్రవృత్తి లేక వాసననే ఆదికర్మ అనికూడ చెప్పవచ్చును. ఇచ్చట "ఆశా" అనుపదము ఆత్మలయొక్క ఆది ప్రవృత్తియైన మాయాసమ్మేళనవాసన యను నర్థములో ప్రయోగించబడినది.

2. ఔలియాలు అనగా భగవంతునితో సామీప్యగతి సాధించుకొన్న సిద్ధపురుషులని యర్థము.

తాత్కాలికముగ తమగతిని మఱచిపోయి పదభ్రష్టులైనట్లు చెప్పబడుటకు కారణమిదియే. ఉదాహరణార్థము నారదుడు, వ్యాసుడు, శృంగిఋషి, పరాశరుడు, బ్రహ్మ, మహాదేవుడు మున్నగువారి కథావిషయములను గమనించవచ్చును. ఆ విషయములన్నియు వివిధగ్రంథములలో ప్రస్తుతమై యుండుటచేతను, కొంతవఱ కండఱకును తెలిసినవేయగుటచేతను, వానివివరణ మిచ్చుట యనవసరమని తలంచుచున్నాము.

10. పైన సూచించినవిషయములను బట్టి, వారందఱును మాయకు పూర్ణముగ దాసులైపోయిరనిగాని, పారమార్థికముగా పూర్తిగా పతితులైపోయిరనిగాని, చెప్పుట మా అభిప్రాయముగాదు. మా యుద్దేశ్యమేమనగా, మాయ తన ప్రభావముచే నట్టివారిని మోసముచేసినదని చెప్పుటమాత్రమే. అందుకు కారణమేమనగా వారు నిస్సంశయముగ నున్నతస్థానములనే పొందిరిగాని, మాయయొక్క ఆవరణకు అతీతమగు స్థానమువఱకు జేరుకొనలేదు. సత్యనామము రాధాస్వామీనామములయొక్క దేశమే అట్టి మూలధామమని తెలిసికొనవలయును. ఇప్పుడు ఆత్మయొక్క అవరోహణక్రమములో మజిలీలపూర్ణవివరము లీక్రింద చెప్పబడును. వానినిబట్టి ఆత్మయొక్క మూలస్థాన మెంత దూరముగను ఉన్నతముగను ఉన్నదో, అవతారములు, ప్రవక్తలు, ఔలియాలు మున్నగువారేయేస్థానములనుండి వచ్చిరో, ఏయేస్థానములవఱకు సిద్ధిపొందిరో అనువిషయములు సంపూర్ణముగ విశదము కాగలవు.

11. అన్నిటికన్న నున్నతమును, అన్నిటికన్న పెద్దదియు, నొకలోకమని చెప్పుటకు సాధ్యముకానిదియు, మొట్టమొదటిదియు నగు మూలధామము రాధాస్వామీ అనియు, అనామియనియు, అకహ (అనగా వర్ణింపశక్యముగానిది) అనియు పేర్కొనబడుచున్నది. ఇది సమస్తమునకు ఆదియును, అంతమునుకూడనై యుండి, సమస్తమును చుట్టియున్నది. అనగా, ఈ ధామముయొక్క దయయు, ఇచ్చటి శక్తియునే సర్వేసర్వత్ర అంశరూపమున వ్యాపించి కార్యములను సాగించుచున్నవి. సృష్ట్యాదియందీధామము నుండియే ఉప్పెనవలె నొకసంచలనము (దీనినే హిందీభాషలో "మౌజ్" అందురు) బయల్వెడలి క్రిందికి శబ్దరూపముగా దిగెను. ఈస్థానము పరమసంతులస్థానము. ఈ స్థానమును సంతులలోగూడ నరుదుగ కొద్దిమందిమాత్రమే చేరుకొనిరికాని, మఱెవ్వరు జేరుకొనలేకపోయిరి. ఇచ్చటకు చేరుకొన్నవారినే పరమసంతులని పేర్కొందురు.

12. రాధాస్వామీ ధామమునుండి క్రిందికి, రెండులోకములను విడిచి దిగినచో సత్యలోకము వచ్చును. సత్యలోకము మహాప్రకాంతవంతము, నిర్మలము, పవిత్రమునై యుండి, పూర్తిగ చైతన్యమయమై యున్నది. క్రిందిసృష్టి కంతకు నాద్యంతములు, సత్యలోకమే. ఈ లోకమునుండి రెండుఅంశలు బయల్వెడలి క్రిందిలోకము లన్నిటిలోనికి దిగి వ్యాపించినవి. సంతుమతములో, ఈ లోకాధిపతినే నిజమైన ప్రభువనియు, సృష్టికర్తయనియు చెప్పెదరు. సత్య శబ్దము ఈ లోకమునుండియే ఆవిర్భవించెను. ఈ శబ్దమును మహానాదమనియు సారశబ్దమనియుకూడ చెప్పెదరు. ఈ స్థానముయొక్క అధిష్ఠానదేవతనే సత్య పురుషుడు, ఆదిపురుషుడు అనికూడ పేర్కొందురు. ఈలోకాధిపతి అజరామరుడు, అవినాశియు, సదాస్థాయియు, నిర్వికారుడును, సంతుమహాత్ములీపురుషుని యవతారస్వరూపులే. ఈస్థానము దయాళుపురుషుని లోకము. ఇచటనెల్లపుడు దయాకటాక్షములును, ఆనందాతిశయమును దప్ప మఱేదియు గానరాదు. ఈస్థానమున ననంతసంఖ్యాకమైన హంసలు అనగా, ప్రేమ పూరితనిర్మలాత్మలు అనగా భగవద్భక్తులు, వెవ్వేఱు కేంద్రములలోనుండి సత్యపురుషుని దర్శనానందము ననుభవించుచు నమృతాహారము భుజించుచు నుందురు. అచ్చట క్రోధము, దండన, దుఃఖము, సంతాపము, పుణ్యపాపములు, కాలకర్మలయొక్కయు జాడకూడ కానరాదు. అందువలననే ఈపురుషుని దయాళువు కృపాళువునని యందురు. వాస్తవమైన సంపూర్ణసిద్ధులగు భక్తులు ఈస్థానమును "హూత్" అని పేర్కొందురు. ఆత్మ రాధాస్వామీ పదమునుండి దిగిన పిమ్మట మొట్టమొదట నది ఈస్థానమందే ఆగి, తిరిగి క్రిందికి దిగిపోసాగెను. రాధాస్వామీదయాళుని చరణములందు దృఢవిశ్వాస ముంచుకొని, వారిపదప్రాప్తి ఆదర్శముగ చేసికొని, ఎవరు క్రిందిలోకములన్నిటిని దర్శించుకొనుచు నీ సత్యలోకమును జేరుకొందురో, అట్టివారే రాధాస్వామీ పదమునుకూడ తప్పక పొందగలరు. కాని మఱొకవిధముగ నెవరును రాధాస్వామీ ధామము జేరుకొనలేరు. అందువలననే సంతులు ముఖ్యముగ సత్యపురుష రాధాస్వామివారి ఉపాసన చేయుదురు. సంతుల ఇష్టదైవమును భగవంతుడును సత్యపురుష రాధాస్వామీ. ఈ స్థానమును జేరుకొన్నవారినే సంతులనియు సద్గురువనియు పేర్కొందురు. మఱెవరును సంత్ సద్గురుపదవి కధికారులు కానేరరు.

13. సత్యలోకమునకుక్రింద రెండులోకములు దిగువన దశమద్వారము లేక సున్నలోకమున్నది. ఆత్మ సత్యలోకమునుండి దిగి, ఇచ్చటనే ఆగి, తిరిగి

ఇచ్చటనుండి బయల్దేరి, బ్రహ్మాండమందు వ్యాపించి. తిరిగి పిండదేశములోనికి దిగిపోయెను. ఈస్థానమునే సంతులు ఆత్మపదమనియు, ఫకీర్లు "హాహూత్" పదమనియు పేర్కొందురు. ఆత్మ పంచతత్త్వములనుండియు, త్రిగుణములనుండియు, స్థూల, సూక్ష్మ, కారణశరీరములనుండియు వేరై అనగా, నిర్మలమై యీస్థానమును జేరుకొన్నపుడు దానికి పరమపురుషుని భక్తిసేయుటకధికారము ప్రాప్తించును. అది ఇచ్చటనుండి ప్రేమబలముతో ముందు సత్యలోకమును పొంది, తిరిగి అచ్చటనుండి రాధాస్వామీ పదమును జేరుకొనగలదు. ఈస్థానమును పొందినవానిని రాధాస్వామీమతములో అనగా సంతుమతములో పరిపూర్ణసాధువని పేర్కొందురు. ఈస్థానములో కూడ హంసలు అనగా భగవత్ప్రేమపూరితమైన ఆత్మల సమూహములు నివసించుచు, అమృతాహారమును భుజించుచు మహానందమగ్నతావస్థలో నుండును. దీనినే పారబ్రహ్మపదమనికూడ చెప్పుదురు. ఈస్థానమునుండియే పురుషుడు, ప్రకృతియు నావిర్భవించిరి.

14. సున్న లేక దశమద్వారమునకు క్రిందుగా త్రికుటిస్థానము కలదు. దీనికి గగనమని నామాంతరముగూడ కలదు. ఈస్థానమునే బ్రహ్మపదమనియు ప్రణవస్థానము, అనగా ఓంకారస్థానమనియు కూడ చెప్పుదురు. నిజమైన ఫకీర్లు ఈస్థానమునే "అర్శ అజీమ్" అనియు "ఆలమ్ లా హూత్" అనియు పేర్కొందురు. యోగీశ్వరులును, నిజమైన పరిపూర్ణజ్ఞానులు, నీలోకమువఱకు చేరుకొనిరి. త్రిగుణములును, పంచతత్త్వములును, మహాసూక్ష్మరూపములో నీస్థానమునుండియే ఆవిర్భవించినవి. వేదములు, ఖురాను, జైనుల ఆదిపురాణము, ఇంకనితర పవిత్రగ్రంథములును ఈస్థానమునుండియే యుత్పన్నమైనవి. సమస్తసృష్టియొక్క సూక్ష్మపదార్థమును, శక్తి లేక ఈశ్వరమాయయు, నీస్థానమునుండియే ప్రకటమైనవి. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, వ్యాస, వశిష్ఠాదులవంటి యోగీశ్వరులు, జైనుల ఋషభదేవుడును, ఈస్థానమునుండియే అవతరించిరి. ఈస్థానమును మహాకాశమనికూడ అందురు. చైతన్యప్రాణము (అనగా శరీరములోని పంచప్రాణములకు ఆధారమైన శక్తి) కూడ ఇచటనుండియే ప్రకటమయ్యెను. ఈస్థానాధిపతిని ప్రాణపురుషుడు అనియు "ఖుదాయ్ అజీమ్" (అనగా అన్ని దేవుళ్లకు పైదేవుడు) అనియుకూడ పేర్కొందురు. ఈ అధిపతినే సంతులు బ్రహ్మాండీ మనస్సు అని చెప్పుదురు.

15. దీనిక్రింద సహస్రదళకమలమనెడి లోకము కలదు. ఈలోకాధిపతిని నిరంజనజ్యోతి, శివశక్తి, లక్ష్మీనారాయణ, నారాయణజ్యోతి, శ్యామసుందర్

అర్శ, ఖుదా, అను నామములతో పేర్కొందురు. సంతుమతములో సాధకులచే మొట్టమొదట నీ స్థానమునసే సాధనచేయించబడును. ద్వితీయ శ్రేణికి చెందిన అవతారపురుషులందఱును, ప్రథమ శ్రేణికిచెందిన ప్రవక్తలును, ఔలియాలు మున్నగువారును, ప్రథమ శ్రేణియోగులును, ఈ స్థానమునుండియే ప్రకటమై, ఈ స్థానమునందే తిరిగి చేరుకొందురు. సంతులు, ఫకీర్లును, దీనినే నిజమనస్సు అని పేర్కొందురు. ఈ స్థానమునుండియే తత్త్వములకు సంబంధించిన తన్మాత్రలు[1] మొదట ప్రకటమై ఆ తరువాత స్థూలతత్త్వములు[2], నింద్రియములును[3], ప్రాణములు[4], ప్రకృతులును[5] బయల్వెడలెను. ఈ లోకముయొక్క ప్రతిబింబము "నుక్తేసు బేదా"[6] మీద లేక తిల్ మీద అనగా నేత్రద్వయమునకు వెనుకనున్న తృతీయనేత్రముమీద మొదట ప్రతిఫలించి, పిమ్మట నేత్రద్వయములోనికి దిగెను. జాగ్రదవస్థలో జీవాత్మ యుండెడి స్థానము ఈ తృతీయనేత్రము. సహస్రదళకమలమునుండి చిదాకాశము (దీనిని కొందఱు జ్ఞానులు బ్రహ్మయని పేర్కొందురు) ప్రకటమై శరీరమందంతటను అనగా పిండమందును మరియు సహస్రదళకమలస్థానమునకు క్రిందనున్న సృష్టిలో నంతటను వ్యాపించెను. ఈ చైతన్యాకాశముయొక్క శక్తియే సహస్రదళకమలమునకు క్రిందిసృష్టిలో ప్రకాశించుచున్నది, అనగా, ఈ చైతన్యరూపమైన ఆకాశముయొక్క ప్రభావమే, క్రిందిసృష్టిని చైతన్యవంతముగ చేయుచున్నది. సృష్టిలోని ఉన్నతలోకముల వివరణము ఇంతటితో సమాప్తము. ఈ స్థానమునకు క్రింద బ్రహ్మ, విష్ణు, మహాదేవుల లోకము గలదు. ఈదేవతలు చైతన్యాకాశరూపము గలిగియుందురు. సంతులు, ఫకీర్లును, జీవాత్మను ముందుగా నేత్రస్థానమునుండి సహస్రదళకమలమున కారోహింపజేయుదురు. ఇది తప్ప ఊర్ధ్వలోకములకు పోవుమార్గము వేఱొకటిలేదు.

---

1. అయిదుజ్ఞానేంద్రియములకు అనురూపముగా అయిదు తన్మాత్రలున్నవి. ఒక్కొక్క జ్ఞానేంద్రియములోని తన్మాత్ర ఒక్కొక్క తత్త్వమునకు సంబంధించి యుండును.

2. పృథివి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, అను నీఅయిదును స్థూలతత్త్వములు.

3. త్వక్కు, చక్షువులు, శ్రోత్రములు, జిహ్వ, ఘ్రాణములు, ఈ అయిదును జ్ఞానేంద్రియములు.

4. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు అని ప్రాణములు అయిదు.

5, ప్రకృతుల సంఖ్య ఇరువదియైదు. పంచతత్త్వములతో, త్రిగుణములకును, జ్యోతినిరంజను లిరువురకును గలిగెడి సమ్మేళనచే 5 × 5 = 25 ప్రకృతు లుత్పన్నమైనవి.

6, సూఫీలు ఆజ్ఞాచక్రమును "నుక్తేసు బేదా" అని పేర్కొందురు.

16. ఈ స్థానము (సహస్రదళకమలము)వఱకే శబ్దము లేక అనహదనాదము విరాజిల్లు లోకములున్నవి. సత్యలోకమునుండి సహస్రదళకమలమువఱకు నున్న లోకములు అయిదింటికి అయిదు శబ్దములు వేఱువేఱుగనున్నవి. పరిపూర్ణ సిద్ధ పురుషునివలన అనగా సంత్ సద్గురువువలన నా పంచశబ్దముల వివరములు తెలిసికొనవచ్చును. ప్రతిస్థానములో నొక్కొక శబ్ద మున్నది. ఆ శబ్దములను గుఱించిన రహస్యవిషయములుగూడ వేఱువేఱుగ నుండును. పంచమశబ్దము సత్యలోకములోనిది. దానిపైనున్న శబ్దధారను ఉచ్చారణచేగాని, వ్రాతచేగాని తెలుపశక్యముగాదు. ఆధారనుపోలిన శబ్ద మీసృష్టిలో నెచ్చటను లేకపోవుటచే దానిస్వరూప మెవరికిని నూహింపశక్యముగాదు. ఆశబ్దము ఆ లోకమునకు వెళ్లినపిదపనే సాధకునకు గోచరము కాగలదు. ఈపంచశబ్దములును, ఆపంచలోకములను సూచించును. ఆత్మ ఆశబ్దములధ్వనులను పట్టుకొనియే ఒక్కొక లోకమునుండి దానిపై లోకమునకు వెళ్లుచు అన్నిటికంటె నూర్ధ్వతమలోకమువఱకు నారోహింపగలదు. ముఖ్యముగా నీ కలియుగములో నూర్ధ్వలోకములకు, మఱే యభ్యాసముచేగాని ఆత్మ నారోహింపజేయుట కేవలము నసాధ్యము.

17. అన్నిటికన్న పైలోకము అనగా చిట్టచివరస్థానమైన రాధాస్వామీ ధామమునకు రూపు, రంగు, రేఖ లెంతమాత్రములేవు. సరిగదా, అచ్చటి శబ్దముకూడ గుప్తముగ నుండును. అచ్చటిపరిస్థితి వాగ్రూపమునగాని వ్రాతరూపమునగాని తెల్పుటకు సాధ్యముగాదు. అది పరమసంతులకు విశ్రమస్థానము.

18. సత్యలోకమునుండి సహస్రదళకమలమువఱకు నూర్ధ్వమండలములు ఆఱున్నట్లే, క్రిందకూడ, అనగా పిండదేశములోగూడ నాఱుస్థానములు ఆయూర్ధ్వమండలములకు ఛాయారూపములుగ నున్నవి. ఆస్థానములును వాని పేర్లు నిచ్చట వెవ్వేఱుగ వివరించెదము. హుజూర్ రాధాస్వామీ సాహెబ్ వారి ఉపదేశముల ననుసరించియు, వారు అతిదయతో ప్రకటించిన సులభమైన సహజాభ్యాసముదృష్ట్యాను, అభ్యాసముచేయువానికి ఈ క్రింది లోకములను అధిగమింపవలసిన యవసరము ఏమాత్రములేనప్పటికి నిక్కాలములో వాచకజ్ఞానులు విద్యావంతులును కల్పించిన శంకలు సంశయములు అపభ్రమలను పోగొట్టునిమిత్తమును, వానినిగుఱించి యథార్థవిషయము బోధపడునిమిత్తమును, ఈక్రిందిస్థానముల వివరణముగూడ నిచ్చట కొంతవ్రాయుట యుక్తమును, ఆవశ్యకమునని తోచినది. ఈషట్స్థానములును, ఆఱుచక్రములుగ

పేర్కొనబడుచున్నవి. ఇవన్నియు పిండదేశమునకు అనగా స్థూలశరీరమునకు సంబంధించినవి. వీనిపైనున్న ఊర్ధ్వలోకములు, బ్రహ్మాండమునకును దానిపై మండలములకును సంబంధించినవి.

19. మొదటిచక్రము నేత్రద్వయమునకు వెనుకభాగమున నున్నది. ఆత్మ ఇచట స్థాయిగనుండి ఇచ్చటనుండి క్రింది అయిదు చక్రములద్వారా క్రమక్రమముగా దిగి, శరీరమందంతటను ప్రసరించినది. ఈచక్రముయొక్క అధిపతి పేరు పరమాత్మ. ప్రపంచములోని అనేకమతములలో ఈయననే బ్రహ్మగను, భగవంతుడుగను, ఖుదాయనియు మన్నింతురు. జాగ్రదవస్థలో జీవుడు వాస్తవముగ నీస్థానమందే యుండును. ఈస్థానమునుండియే సిద్ధులు, అవతారములు, యోగులు, ప్రవక్తలు, వలీలు[1]ను అవతరించిరి.

20. రెండవ చక్రము కంఠమున నున్నది. జీవాత్మయొక్క ప్రతిబింబము ఈస్థానమున కంఠచక్రములో ప్రతిఫలించి స్వప్నావస్థను రచించును. అనేక మతములలో నీచక్రమునే విరాట్స్వరూపియైన భగవంతునిగను,[2] ఆత్మపదముగను నమ్మెదరు. శరీరముయొక్క ప్రాణస్థానముకూడ నిదియే.

21. మూడవచక్రము హృదయస్థానములో నున్నది. ఇది పిండీమనస్సు (అనగా ప్రత్యేక వ్యక్తిగతమైన మనస్సు) యొక్క స్థానమును, శివశక్తియొక్క ఛాయాస్థానము నైయున్నది. సమస్తపిండముయొక్క పాలనప్రబంధ మీస్థానమునుండియే జరుగుచున్నది. ఇచ్చట పిండమనగా సూక్ష్మశరీరమని గ్రహించవలయును. సంకల్ప, వికల్పము లీస్థానమునుండియే ప్రకటమగును. సంతోష విచారములు, ఆశాభయములు, కష్టసుఖములు నీస్థానమునందే అనుభవమునకువచ్చును.

22. నాల్గవచక్రము నాభిస్థానము. లక్ష్మీవిష్ణువుల స్థానమిదియే. ఈస్థానమునుండియే శరీరమంతకును పోషణ గలుగును. ఇది స్థూలప్రాణములకు మూలస్థానము.

23. అయిదవచక్రము ఇంద్రియస్థానము. ఇది సావిత్రీ బ్రహ్మలకు నివాసస్థానము. స్థూలశరీరముయొక్క ఉత్పత్తికేని. దానిశక్తికేని, దానికార్యక్రమములకును మూలస్థానమిదియే.

---

1. వలీ అనగా భగవత్సాన్నిధ్యము సంపాదించిన సిద్ధుడని అర్థము.

2. సహస్రదళకమలముయొక్క అధిపతియే నిజముగ విరాట్స్వరూపము. సున్నలోకమే నిజముగ ఆత్మస్థానము. కాని కొన్నిమతములలో కంఠచక్రమునే విరాట్పురుషుని స్థానముగను, ఆత్మపదమనియు పేర్కొనుచుందురు.

24. ఆరవచక్రము గుదాస్థానము. ఇది గణేశుని నివాసస్థానము. పూర్వ కాలములో ప్రాణాయామము లేక అష్టాంగయోగము ఈచక్రమునుండియే ప్రారంభించెడివారు గనుక ప్రతికార్యమునకు ప్రారంభములో నీయారవ చక్రాధిపతియగు గణేశుని పూజచేయవలసినదిగ నిర్ణయించబడినది.

25. పైనచెప్పిన ఊర్ధ్వస్థానములు, నీచస్థానములు నన్నియుకూడ మానవశరీరములోపలనే యున్నవనువిషయము గుర్తింపవలసియున్నది. బాహ్యస్థానములతో నేమియు పని లేదు. నీచస్థానములు గుదాచక్రమునుండి నేత్రముల వెనుకనున్న చక్రమువఱకు వ్యాపించియున్నవి. కావున పిండముయొక్క సరిహద్దు నేత్రములవరకు ఉన్నది. దీనిని నవద్వారముల ప్రసరణయనియు నందురు. ఆ నవద్వారములు నెవ్వి యనగా, రెండు నేత్రములు, రెండుచెవులు, రెండు నాసికారంధ్రములు, ఒక నోరు, ఒకమూత్రద్వారము, ఒకమలద్వారము.

26. నేత్రములకుపైనుండి సహస్రదళకమలస్థానము ప్రారంభమగును. ఇదే బ్రహ్మాండము[1]నకు మొదలు. ఈబ్రహ్మాండముయొక్క హద్దు దశమ ద్వారముక్రిందనున్న ప్రణవస్థానమువఱకు నున్నది. ప్రణవము పైస్థానము పారబ్రహ్మాండము లేక పరబ్రహ్మస్థానమని చెప్పబడును. సంతుమతప్రకారము నీచలోకములు స్థూలసగుణ[2] సృష్టిగను, సహస్రదళకమలము త్రికుటియును నిర్మల[2] సగుణసృష్టిగను గణింపబడును. వీనిపైనున్న సున్నస్థానము కేవలము నిర్గుణ[3]సృష్టిస్థానము. ఆపైనుండియే సంతులదేశము ప్రారంభమగును. ఈకారణముననే సంతులదేశము సగుణ నిర్గుణస్థానములకు అతీతమైనదని చెప్పుదురు. ఇందువలననే శ్రీకృష్ణుడు "త్రిగుణాత్మకములైన వేదములహద్దు దాటివెడలినపుడే నిజస్థానమును జేరుకొనగల"వని అర్జునునకుపదేశించెను. ఈపైస్థానముల గుప్తవిషయములును, అచ్చటి ఆనందములు, అచ్చటి మహాశక్తులు, నియమములును, మహాద్భుతముగనుండును. ఈవిషయమంతయు కుతూహలముగల

1. ఇచ్చట బ్రహ్మాండము అనుపదము వేదాంతులు ప్రయోగించెడి అర్థములో ప్రయోగించబడినది. సంతుల పరిభాషప్రకారము ప్రణవస్థానముపైనున్న పరబ్రహ్మ పదముకూడ బ్రహ్మాండములోనే కలిసియున్నది,

2. సగుణసృష్టి అనగా త్రిగుణాత్మకసృష్టి. త్రిగుణములు జడపదార్థమునకు చెందినవిగాన సగుణసృష్టి యనగా జడపదార్థముతో కూడిన సృష్టి. అందులో స్థూలసగుణ మనగా స్థూలరూపముగనున్న జడపదార్థముతో కూడిన సృష్టియు, నిర్మల సగుణమనగా జడపదార్థమున్నను సూక్ష్మరూపములో నిర్మల చైతన్యముతో కలిసి యున్నసృష్టియు.

3. నిర్గుణ సృష్టి యనగా త్రిగుణ రహితమైన సృష్టి.

సాధకుడు పరిపూర్ణసద్గురువువలన తెలిసికొనగలడు. అట్టి సాధకున కభ్యాస సమయములో నీవిషయములు అనుభవగోచరముకూడ కాగలవు.

27. ఇచట నొకవిషయము విశదపఱచవలసియున్నది. పూర్వకాలములో సాధువులు, యోగీశ్వరులు, మహాత్ములును, ఊర్ధ్వమండలముల రహస్యములు బహుసూక్ష్మములనియు, ప్రతివ్యక్తికిని వానిని అవగాహనచేసికొనగలశక్తి లేదనియు గ్రహించి, మఱియు ప్రాణాయామముతోకూడిన ఆధ్యాత్మికసాధనలు అభ్యాసముచేయుటకు మహాకఠినముగనుండుటచేతను, అందులో ముఖ్యముగా ఆకాలములో బ్రాహ్మణులకేగాని ఇతరులకు పారమార్థిక గ్రంథములను పఠించుటకు అనుమతిలేనందునను వారు ప్రథమములో, నీచస్థానముల రహస్యములనుమాత్రమే ప్రకటపఱచి, ఊర్ధ్వలోకముల రహస్యములను, సాధకులు ఊర్ధ్వముఖముగా పైకి ఆరోహించినకొలది క్రమక్రమముగా వారికి తెలుపవచ్చుననెడి యుద్దేశ్యముతో, గోప్యముగ నుంచివేసిరి. కాని చివరకు ఆమార్గమును, ఆ యభ్యాసపద్ధతులును, నీచస్థానములప్రాప్తికికూడ నభ్యాసము చేయు సాధకులే కనబడకుండునంతగా క్షీణించిపోయెను. క్రమక్రమముగా. ఆకాలపు ఋషులు, జనసామాన్యమందఱు కేవలము అజ్ఞానులు, మూర్ఖులుగ నుండుట గ్రహించి వారికి అవతారపురుషులయొక్కయు, దేవతలయొక్కయు బాహ్యపూజాపురస్కారములు చేయుచుండినందువలనగూడ కొంత శ్రేయస్కరముగ నుండునని తలఁచి, అట్టి బాహ్యపూజాపురస్కారములను లోకుల కుపదేశించిరి. అట్లుచేయుచుండుటచే జనుల కాంతర్యస్థానముల నామరూపములతో పరిచయము మొదట బాహ్యముగనైనను గలుగుననియు, పిమ్మట వారు కొంతకాలమునకైనను, ఆంతర్యాభ్యాసములో లగ్నముకాగలరనియు వారి యుద్దేశ్యమయి యుండెను. కాని సామాన్యజనులు ఈపాటికార్యముకూడ సక్రమముగను సఫలముగను, సాగించలేకపోయిరి. అందుమీఁదట కొందరుభక్తులు అభ్యాసములో సౌకర్యముకొఱకై ఉత్తమావతార పురుషులయొక్కయు, ఉత్తమ దేవతలయొక్కయు విగ్రహములను ధ్యానముచేసికొనుటలోను చిత్తమునేకాగ్రముచేసికొనుటలోను సహాయముగలుగు నిమిత్తము తయారుచేసికొనదొడగిరి. కాని స్వార్థపరు లాసావకాశమును స్వలాభార్థమై యుపయోగించుకొనదలఁచి, ధనికులను లాలనమాటలుచెప్పి, మభ్యపఱచి, వారిచే ఉత్తమోత్తమదేవతలు, అవతారపురుషులయొక్కయు, విగ్రహములను, దేవాలయములను నిర్మింపజేసి, వాటి పూజాపురస్కారములను, తమ ధనార్జనవ్యాపా

కనుకొంటకు, లోకులచే మహాధ్వజాయమానముగా జరిపించదొడగిరి. ఆ పని నిరాటంకముగా సాగించుకొనుటకై, ఆధ్యాత్మికోపాసనల విధానము తెల్పు పురాతనగ్రంథములను వారు దాంచివేయసాగిరి. ఈవిధముగా దేవతావిగ్రహములకు, అవతారపురుషుల విగ్రహములకును పూజలు క్రమ క్రమముగా బాహాటముగా ప్రచారములోనికి వచ్చెను. ఇట్టి పూజలు, పురస్కారములు సాగించుటలో నెవరికినెట్టికష్టము నుండనేరదు. కావున ప్రతివ్యక్తియు వానిని సులభముగ సాగించగల్గును. అందుచే సర్వసామాన్యముగా అందరు నీకార్యములలోనే మగ్నులగుటయు, ఆంతర్యరహస్యములు ఆరోజు కారోజు గుప్తమగుటయు జరుగుచుండి, చివరకందఱును బాహ్యపరమార్థులుగ తయారయిరి. దేశమంతట నిట్టి పూజాపురస్కారములే వ్యాపించిపోయెను. ప్రాపంచికజీవులును, భోగలాలసులును, తమకిష్టమైనవిధముగ, నిట్టి పూజలను సాగించుకొనుచు, వానిమూలముగ మాయికభోగములను, సంతోషములనుగూడ పొందుటకవకాశ మెక్కువగనుండుటచే వారల కీపూజలే యెక్కువ ప్రీతికరములయ్యెను.

28. కలియుగప్రభావ మిప్పుడు మహాతీవ్రముగ ప్రకటమగుచుండుటచే జీవులందఱును దారిద్ర్యము, రోగములు, అంటువ్యాధులు. పరస్పరఈర్ష్యాభావముచే గల్గుకలహములు, పోట్లాటలు మున్నగు ననేకవిధములగు దుఃఖములలో చిక్కుకొని మహాదుఃఖితులైయుండుట చూచియు, జీవులందఱును సత్యమార్గమునుండి బహుదూరముగ తప్పిపోయి మిక్కిలి అజ్ఞానములో పడియుండుట గూడ నిరీక్షించియు. సత్యపురుష రాధాస్వామివారికి జీవులయెడల దయగలిగి, వారు మహాకృప తో స్వయముగ భూలోకమున సంత్ సద్గురురూపమున నవతరించి వారి పవిత్రవచనములు, పవిత్రగ్రంథములద్వారా యథార్థమైన పారమార్థిక మతమును, ఆధ్యాత్మికమార్గమును, విస్పష్టవిధమున బాహాటముగా ప్రకటించిరి. మఱియు రాధాస్వామీ దయాళురు బ్రాహ్మణులు తమ జీవికోపార్జన నిమిత్తమై పరమార్థవిషయములో చాలకృత్రిమముగ ప్రవర్తించి ఆధ్యాత్మికమూలగ్రంథములను జనులకు కనిపించకుండ దాంచివైచిరని తెలిసికొని, మహాదయాకటాక్షములతో నాంతర్య రహస్యములను హిందీ భాషలో సులభశైలిని సమగ్రముగ వివరించి, సంతుమతమును జీవుల కుపదేశముకూడ చేసిరి. సంతుమతబోధలు ప్రపంచములో సులువుగా ప్రచారముకాకుండువిధముగ నీబ్రాహ్మణులు తమ జాలమును పన్నిరి కాని, చాలమంది యథార్థ

విచారణచేసి బోధపఱచుకొన్న పిమ్మట, సంతుమతబోధకులను క్రమేణ స్వీకరించి సంతుమతములో ఉపదేశముపొందిరి. గతించిన రెండుమూడుల సంవత్సరములలో వెవ్వేఱు సమయములలో కబీరుసాహెబ్ వారు, గురునానక్ సాహెబ్ వారు, జగజీవన్ సాహెబ్ వారు, పల్టూసాహెబ్ వారు, గరీబ్ దాసువారును, ఈసంతుమతమును కొంతవఱకు వివిధప్రాంతములలో ప్రకటముచేసిరి.

29. ప్రతి సంతుమహాత్ముని కాలములోను, పండితులును, వేషధారులును, సంతుమతప్రచారమువలన తమ జీవికోపార్జనకు కష్టములు కలుగునను భయముచే, ప్రణవస్థానమువరకు వేదమతములో నేకీభావముగనే యున్న సంతుమతము ప్రచారముగాకుండులాగున తమ ప్రజ్ఞాశక్తులను పూర్తిగ వినియోగించి తమ శక్తికొలది ప్రయత్నించుచుండిరి. అందుచే వారు మూర్ఖులగు, సాంసారికజీవుల ననేకవిధముల భ్రమపెట్టి (సంతుమతసిద్ధాంతములకు ప్రతికూలురగునట్లు) అెచ్చగొట్టుచుండెడివారు. ఈ కారణమువలన సంతుమతప్రచారాభివృద్ధి కావలసినంత యధికముగ కాలేదు.

30. సర్వసాధారణముగ పండఱుజీవులును. సంతుమతములో జేరుటకు అధికారులు కానేర రనువిషయము నిజమే. భగవంతుని కలిసికొనవలెననిగాని తమ జీవోద్ధారము కావలెననిగాని, ఆసక్తిలేనట్టియు, విషయలోలురు, భోగలాలసులునైనట్టియు, జీవులకు ఈ మతము నవగాహనచేసికొనగల విచక్షణశక్తి యుండనేరదు. అట్టివారికి తమ పూర్వపు దేవతోపాసనలను వదిలి, సంతులనారాధించుట కష్టతరముగగూడ తోచును. అదికాక, పండితులు, వేషధారులును, అట్టివారిని భ్రమలపాలుచేసి భయపెట్టుచుందురు కావున, సీమతమునందు వారికి దృఢవిశ్వాసము కలుగనేరదు. ఇంతియగాక, సీమతమును, దీని విశిష్టవిషయములను విమర్శపూర్వకముగా, అవగాహనచేసికొని దృఢవిశ్వాసము గలుగకుండగనే జనసామాన్యమందఱకును వ్యాపింపచేయుట సంతుల దివ్యేచ్ఛకాదు. ఏలనన, అట్టి సంశయాత్మకవిశ్వాసమువలన, లోకములో ప్రస్తుతము దేవతలయొక్కయు, అవతారపురుషులయొక్కయు, విగ్రహములను పూజించుటచే కల్గుచుండిన పరిస్థితులే, ఈ మతములోగూడ నేర్పడగలవు. అనగా, లోకములో జనులు, శ్రీరాముని, శ్రీకృష్ణుని, మహాదేవుని, విష్ణువును, శక్తిని, బ్రహ్మను పూజించుచున్నట్లు బాహ్యముగ కనిపించినను, నిజముగ వారు స్త్రీ, సంతాన ధనములయందును, పెదప్రతిష్ఠలయందును, భక్తిగల్గి వానికే అధీనులై యుండుచు, తమ ఇష్టదైవముయొక్క ఆజ్ఞలను పాలించవలె

వను ఆలోచనకూడ లేకుండగను తమ ఇష్టదైవమునెడల భయముగాని, భక్తి గాని యొకించుకగూడ లేకుండగను ఉంచుచున్నారు. అట్టివిశ్వాసము- అవ తారములందుండుగాక, దేవతలయందుండుగాక, లేదా సత్యపురుషునియందు గాని, పరమపురుషపూర్ణసర్వేశ్వరులైన రాధాస్వామివారియందుగాని ఉండు గాక- యెవరియందుండినను గూడ నేమియు ప్రయోజనముండ నేరదు.

31. అసాధారణశక్తులను దర్శించుటవలనను, విచిత్రములు చూచుట వలనను ఏదేవతయందైనను జనించిన భక్తి, విశ్వాసము లెంతమాత్రము విశ్వస నీయములు కావు. ఏలనన నెవరైనను ఆధ్యాత్మికప్రమాణముల ఆధారముతో విమర్శచేసియు, స్వబుద్ధికుశలత నుపయోగించియు, నేదేనివిషయమును స్థిర పఱచుకొననియెడల వారివిశ్వాసము దృఢముగగాని, చిరస్థాయిగగాని యుండ నేరదు. ప్రస్తుతకాలములో చాలమంది హిందువులుగను, మహమ్మదీయులు గను, ఉన్నట్లు బాహ్యముగ కనిపించుచున్నను, వారి కాంతర్యమున నేమతము లోను విశ్వాసములేనట్లు స్పష్టముగా కనపడుచునే యున్నది. దీనికి కారణ మేమన, వారు తమ మతగ్రంథములను విమర్శపూర్వకముగ నెన్నడు చదు వుటగాని, బోధపఱచుకొనుటగాని చేయను లేదు, లేక అభ్యాసిపురుషుని ప్రశ్నచేసి ఆ విషయములను తెలిసికొనను లేదు. అందువలన వారి కామత గ్రంథములలో చెప్పిన విషయములపైన- అవి మనోరంజకములగుగాక, లేదా భయానకములగుగాక- ఉండవలసినంత విశ్వాసము, నమ్మకము పుట్టుటలేదు. మఱియు, వారితరలౌకికవిషయములను గుఱించి యావజ్జీవితము పూర్ణవిమర్శ యెట్లు సల్పుచుందురో, అవ్విధముగ పరమార్థవిషయములను గుఱించికూడ విమర్శచేయుటలేదు. అందఱును తమ తెలివిని, జ్ఞానమునుపయోగించియో లేక నితరులను చూచియో, లేదా పెద్దలవలన విన్నదానినిబట్టియో తమకు తోచిన రెవరినోయొకరి నిష్టదైవముగ నవలంబించుచున్నారేకాని, అందువిషయమై ముందుగా యథార్థనిర్ణయము చేసికొనుటయే లేదు. ఇవ్విధముగ నిష్టదైవము నేర్పఱచుకొనినచో నది కేవలము నామకార్థమే యగును. కావుననే లోక ములో దినదినము దుష్కృత్యములు పెరిగిపోవుచు జనుల కెవరియందును భయ భక్తులు లేకపోవుటచేతను, ఒకరిపరిస్థితిని గుఱించి మఱొకరెవరు నడిగెడివారే లేనందునను, ప్రస్తుతకాలములో జనులు దినదినము నీచతరశ్రేణులలోనికి దిగ జాఱిపోవుచున్నారు.

32. వేదమతమునకు, ఖురానుమతమునకు ప్రవర్తకులును నాయకులునైన పండితులు, సన్యాసులు, సాధువులు, మౌల్వీలే, ఇస్లాములమున స్వయముగ

నీవరమార్థసంపత్తును, కోల్పోయి, వారే ఇతరులకన్న నెక్కువగా ప్రాపంచికభోగములు సుఖములలోను, పేరాసలోను, లోకప్రఖ్యాతికై ఆశలోను లిప్తమైయుండియున్నారు. ఇట్టిస్థితిలో వారలకు, అనగా, నీవండితులకు, వేషధారులకు, గృహస్థులకును, వారలపొరపాట్లను తెలియజెప్పి వారిని సన్మార్గమున బెట్టగలిగినవారు మఱెవరున్నారు? ఈ కార్యము ఒక్కసంతుమహాత్ములే చేయగలరు. కావున నిక్కాలమున వారి ఉపదేశముల నెవరు శ్రద్ధగా విని, బోధపఱచుకొని, వారు చెప్పినసాధనల నభ్యాసముచేయుదురో, అట్టివారే నిస్సంశయముగ మనస్సుయొక్క మోసమునుండియు, మాయయొక్క జాలమునుండియు, తప్పించుకొనగలరు. అట్లెవరైన నంగీకరించనియెడల వారు తమకిచ్చవచ్చినట్లు ప్రవర్తించవచ్చునేగాని వారిపై బలాత్కారము చేయువారెవరును లేరు.

33. ఇక్కాలమున జీవులయందు సంతులు నిస్సంశయముగ మహాదయచూపుచున్నారు. ఏలనన, వారు జీవులకు వాస్తవమైనమతము, యథార్థమైన మార్గముయొక్కయు, సారమును క్లుప్తరూపమున బోధపఱచి, భగవంతుని పొందుటకై సరళమైన సహజమార్గమును చూపించిరి. పూర్వకాలములో సాధకులు, మూలచక్రము అనగా గుదాచక్రమునుండి అభ్యాసము ప్రారంభించి, దీర్ఘకాలము ప్రయాసపడగా, కొద్దిమందిమాత్రము బహుకష్టముమీద ఆఱవచక్రమువఱకును, అంతకన్న నరుదుగ కొద్దిమంది సహస్రదళకమలమువఱకును గాని, త్రికుటివఱకునుగాని వెళ్లి, యోగిగతి లేక యోగీశ్వరపదవిని పొందుచుండెడివారు. ఇప్పుడు సంతుమహాత్ములు సహస్రదళకమలమునుండియే అభ్యాసము ప్రారంభముచేయించి, ప్రాణాయామముచే శ్వాసను అరికట్టనవసరములేకుండా సురత్ శబ్దమార్గమనెడి సహజయోగమును ప్రకటముచేసిరి. ఈయభ్యాసము ప్రతియొక్కరికి నవలంబించశక్యమైనది. మఱియు నీఅభ్యాసమువలన ప్రాణాయామము, ముద్రాసాధన, హఠయోగము, మొదలగు నితర అభ్యాసములకంటె నత్యధికలాభము చేకూరుటయేగాక, ఆ అభ్యాసములన్నిటిఫలితము సురత్ శబ్దాభ్యాసికి మార్గమధ్యమందే చేకూరగలదు. ఇందు గుఱించిన పూర్ణవివరములు ముందుముందు చెప్పబడును.

34. ఇప్పుడు, నాభిచక్రమువద్దగాని, హృదయచక్రమువద్దగాని ధ్యానాభ్యాసముచేయువారు, వాస్తవమైన గమ్యస్థానమున కెంతదూరముగనుండిరో యోచించదగును. ఏలనన, వారాస్థానములను సాధించినను గూడ, వాస్తవ

గమ్యస్థానముయొక్క ఛాయ, లేక ప్రతిబింబమును మాత్రమే పొందుదురు. ఆ నాభి, హృదయచక్రస్థానములను సాధించుటకూడ ప్రస్తుతకాలములో బహు కఠినము. ఏలనన, ప్రాణాయామము, ముద్రాసాధనల యభ్యాస మీకాలములో నెవరికిని చేయ శక్యముకాదు. ఉన్నతస్థానముల విషము మెవరికిని బొత్తిగా తెలియకనుండి, నీచస్థానములనే వీరు, ఉచ్చతరస్థానములుగను, సిద్ధాంతస్థానములుగను మన్నించుచుండినపుడు, వారు ఆ మూలస్థానమును పొందుటెట్లు, వారికి ఆభగవంతుని ధామ మెప్పుడు లభ్యముకాగలదు? ఈకారణముచేతనే, సర్వోన్నతమైనట్టియు, మహానిర్మల పవిత్రస్థానమైనట్టియు, సత్యనామ రాధాస్వామీపదమును పొందిన సంతుమహాత్ములు, ప్రాపంచిక జీవులందఱును, అజ్ఞానము, భ్రమలలోను పడియుండిరనియు, భగవంతుని నిజస్థానమును విడచి వేఱుస్థలములలో భగవంతునికొఱకై అన్వేషించుచుండిరనియు సెలవిచ్చుచున్నారు. కొద్దిగొప్ప ఆంతర్యధ్యానము, ఆంతర్యపూజాసేవలును చేయువారికిని, షట్చక్రభేదనయొక్క సాధనలను చేయువారికిని మాత్రమే, యీ పైనజెప్పినదంతయు వర్తించగలదు. బహిర్ముఖ పరమార్థుల విషయమన్ననో, అనగా తీర్థయాత్రలు, వ్రతములు, విగ్రహపూజలు సల్పువారైనచో వారాధ్యాత్మికులలో లెక్కింపనేతగరు. ఏలనన, వారు పూర్తిగ అజ్ఞానాంధకారములోను, భ్రమలలోను మునిగియున్నారు. వీరు నిజమైన భగవంతునికొఱకన్వేషణచేయుటకు బదులు, ఈకార్యములనే చేయుచు నుండిపోయినచో వీరికెన్నటికిని భగవంతుని దర్శనముకాని వారి నివాసస్థానముయొక్క జాడకాని యెంతమాత్రము లభింపనేరదు.

35. గుదా చక్రమునుండి సహస్రదళకమలమునకు క్రిందనున్న చక్రమువఱకు మొత్తము ఆఱుచక్రములుగలవు, ఏ ప్రభువు సమస్త సృష్టిని సృజించి మానవున కుత్తమశరీరమును ప్రసాదించి, వివిధపదార్థములను, వివిధరూపములను సృజించెనో అట్టిమహాశక్తివంతుడు, మహాకృపాళువు, దయామయుడునైన భగవంతుని, ప్రాపంచికజీవులు, విగ్రహములలోనో, గంగాయమునా నర్మదలనెడి నదీజలములలోనో, తులసి, రావి, యనెడి వృక్షములలోనో గోసర్ప, మర్కటములనెడి, పశువులలోనో, స్థాపించి పూజచేయుటయు, అన్వేషణచేయుటయునెంత శోచనీయవిషయము! ప్రత్యక్ష సూర్యచంద్రులును, మానవుడే స్వయముగను, పైనచెప్పినవాటికన్నిటికన్న కూడ శ్రేష్ఠమేగదా. కావున భగవంతునిచే సృజింపబడిన పదార్థములను భగవంతునిగా భావించిపూజించుచు,

నిజమైన భగవంతుని తెలిసికొనుటకు ప్రయత్నములు సల్పకపోవుటయేగాక, తమచేతులతో నిర్మించిన పదార్థములను తామే పూజచేయుట యెంత మూర్ఖత్వము, అజ్ఞానము, నిర్లక్ష్యమును ప్రకటించును! ఏలనన, మానవు డివ్విధమైన పరివర్తనమూలమున, నుత్తమమైన మానవశరీరమును, వ్యర్థముగ నష్టపరుచుకొని, నీచయోనులలో జన్మలెత్తుటకును, నరకమునబడుటకును దారితీయుచు నధమగతి నొందుచున్నాడు. తన జీవునివిషయములో మానవుడింతకన్న నెక్కుడు పాపముగాని, అపరాధముగాని, మరేమిచేయగలడు? ఎవనికైన నిజమైన భగవంతుని గురించి యథార్థము కొంచెమైనను, తెలిసినచో, నతని మనమున కొంతభయభక్తులు తప్పక పుట్టగలవు. కాని మానవుని హస్తనిర్మిత పదార్థములవిషయములో నెవనికైనను భయముగాని, ప్రేమగాని యెట్లుదయించగలవు?

36. ఎవనికైనను, భగవంతునితో నైక్యసిద్ధిపొందిన సద్గురువుగాని, లేక వాస్తవమైన ఫకీరు లేక సాధువుగాని లభించుటయు, వారి అనుగ్రహము పొందుటయు తటస్థించినయెడల అనగా వారి దయాదృష్టి యేజీవునిపైనైనను పడినయెడల, అట్టివాని జీవకళ్యాణము సహజముగా సిద్ధింపనారంభించును. కాని ఇందులోగూడ నొకకష్టమున్నది. ఏలనన, సామాన్యజీవుడు సద్గురువునుగూడ ఇతరస్వార్థపరులవలెనే లోభులనియు, మోసగాండ్రనియు, నెంచి వారిశరణ్యమును స్వీకరింపనొల్లడు. ప్రాపంచిక సుఖములు, సంతోషములకు నిజముగ దాసులైన భోగలాలసులు గొందఱు ఈయవకాశము చూచుకొని, అనగా సామాన్యముగా ప్రజలు మూర్ఖులు, నజ్ఞానులుగనుండుట గుర్తించి తామే గురువులమని ప్రకటనచేసికొని తమకుక్షింభరణ వ్యాపారమును బాగుగ సాగించుకొనుచున్నారు. అట్టి బూటకపుగురువులు అజ్ఞానులైన యీఅల్ప జీవులకు ధన, పుత్రదారాదులును, ఆరోగ్యము, లోకప్రతిష్ఠాగౌరవములు, కలిగించెదమని (తామే స్వయముగ నట్టి తీరనిపేరాసలతో నిండియుండియు) ఆశగల్పించి చెట్లకును, రాళ్లకును, జలములకును జంతువులకును పూజలుచేయించియు, తీర్థయాత్రలు, ఉపవాసవ్రతములు, హోమములు, యజ్ఞములు చేయించియు, ఒకేవ్రతము చేసినందువల్లను, ఒక్కటే తీర్థయాత్ర చేసినందువలనను, మాత్రమే మోక్షములభించగలదని అతిశయోక్తులు సాటుచు, వారిని తమశక్తికొలది మోసపుచ్చి భ్రమింపజేసి తన్మూలముగ స్వలాభము సేకూర్చుకొనుచున్నారు. ఇవ్విధముగ వారు కుక్షింభరణము సాగించుకొన్నను— అందు

వేలన నంతేయెక్కువ హానిగలుగనేరదు— ఈయమాయకులకు నజ్ఞానులకును సరియైనమార్గము చూపించియుండినచో, వారికిగూడ కొంతలాభము గలుగు చుండెడిదను ఆలోచనయే వారికి లేకపోయెను. కాని స్వయముగ వారికే, యీమార్గము, యీఅభ్యాసమును గుఱించి యెంతమాత్రము తెలియదు. వారు కేవలము గ్రంథములు పఠనపాఠములు చేయుటలోను, పురాణగాథలు చెప్పి వినిపించుటలోనుమాత్రమే ప్రజ్ఞావంతులు, దక్షులును. ఉద్ధవుడు అనేక సంవత్సరములు శ్రీకృష్ణుని సాంగత్యములోనుండి సేవచేసియుండినప్పటికిని, అతనిని శ్రీకృష్ణుడు తనతోకూడ తనధామమునకు తీసికొనివెళ్లుటకు సాధ్యము కాలేదుగదా! ఈవిషయము ఉద్ధవునితో శ్రీకృష్ణుడు చెప్పినమాటలనుబట్టియే స్పష్టమగును. "నీవు మొదట యోగాభ్యాసముచేయుము. పిమ్మటనే నీవు పరమపదమును చేరుకొనుట కధికారము పొందగల"వని శ్రీకృష్ణు డుద్ధవునికి సెలవిచ్చెను.

సాక్షాత్తు శ్రీకృష్ణుని సాంగత్యములోనుండి సేవాశుశ్రూషలు చేయు చుండిన ఉద్ధవునివంటి మహాభక్తునకే అభ్యాసముచేయనిదే పరమపదప్రాప్తి అసంభవమైనపుడు, శ్రీకృష్ణుని రూపమునకు పోలికగా పాషాణవిగ్రహమును గాని, లోహవిగ్రహమునుగాని చేయించి దాని సేవాశుశ్రూషలలో కాలక్షేపము చేయుచు, సహజయోగాభ్యాసమునుగాని, సద్గురుభక్తినిగాని బొత్తిగా చేయ కుండ నిర్లక్ష్యముగనున్నవారికి పరమపద మెట్లులభించగలదో ఆలోచింపుడు. అదియునుగాక, ప్రస్తుత పరిస్థితులలో, మఠాధిపతులు పూజారులు మొదలుకొని పూజకులు, యాత్రికులవఱకునుగల యీవస్మందిలో విగ్రహములందు యథార్థ మైన దృఢవిశ్వాసముగలవారు ఏ యొకరిద్దఱోమాత్రమే అరుదుగనుందురు గాని మిగిలినవారందఱు నీప్రపంచమనెడి విగ్రహమును, అనగా మాయను, మాయికపదార్థములనే స్వయముగ పూజించుచు నితరులచేగూడ పూజింప జేయువారే.

37. పుణ్యక్షేత్రముల పరిస్థితిగూడ నిట్లే యున్నది. సత్సంగమును దాన పుణ్యములను చేసికొనుటకును, కొలదికాలము గృహమునుండి దూరముగ నేకాంతముగ నివసించి విశ్రాంతి తీసికొనుటకును పూర్వకాలమహాత్ములు స్థాపించిన పుణ్యక్షేత్రము లిపు డుత్సవములు, వినోదములు జరుపునట్టి స్థానము లుగ మారిపోయినవి. ఇప్పుడు పుణ్యక్షేత్రములకు వెళ్లువారందరును మనో వినోదములను చూచుటకును, ఇంద్రియసుఖానుభూతి నిమిత్తమును, మిత్రు

లను కలసికొనుటకును, క్రొత్తస్థలములను ఆటపాటలను చూచుటకును, బహుమతులనుగాని, యితరవస్తువులనుగాని కొనుటకును మాత్రమే వెళ్లుచున్నారు. వారికి పూజాప్రార్థనలయొక్క ప్రసక్తియే లేదు. మే మిపు డట్టివారికి బోధించున దేమనగా వారికి పుణ్యక్షేత్రము లీపరిస్థితిలో ముక్తి నెవ్విధముగ నీయగలవో, వారే కొద్దిగ శ్రద్ధతో విచక్షణచేసి తెల్సుకొనవలసినదనియే. ఉపవాసవ్రతములవిషయములో గూడ పరిస్థితి యించుమించు నిట్లేయున్నది. అవి కూడ నుత్సవములమాదిరిగనే జరిపించబడుచున్నవి. ప్రాచీనమహాపురుషులీఉపవాసవ్రతములను మనస్సును, ఇంద్రియములను వశముచేసికొను నిమిత్తమును జాగరణచేసి, భగవత్పూజాసత్సంగములను సాగించుకొను నిమిత్తమును నిర్ణీతముచేసిరి. కాని ఇప్పుడు ప్రజలు ఉపవాసములను రోజంతయు చదరంగము పచ్చీసుఆట, పేకాటలు, ఆడుటకును, రాత్రింబవళ్లు నిద్రపోవుటకును, వివిధ మధురపక్వాన్నములు, ఫలములు మున్నగునవి తినుచుండుటకును ఉపయోగించుచున్నారు.

38. మొదటలో విగ్రహపూజలు చిత్తైకాగ్రతాసాధననిమిత్తమును, ధ్యానాభ్యాసముచేయుటలో సహాయముగనుండునిమిత్తము నేర్పాటైయుండగ, ఇపు డందుకు బదులుగ, జనులు నామకార్థముమాత్రమే దేవాలయమునకు వెళ్లుటయు, అచ్చటివిగ్రహములకు హారములు, పూవుల నర్పించి, ఉదకముతో స్నానాభిషేకములు జరిగించుటయు మాత్రమే మిగిలినది. దేవాలయములలో పూజార్లు విగ్రహారాధనలు తమజీవికోపార్జన వృత్తిగా నెంచుకొనుచు నచ్చట అనేకవిధములైన అలంకారములు, ఆటలు, పాటలు నాట్యములు మున్నగు వినోదముల నేర్పాటుచేయుచున్నారు. మఱియు ముఖ్యముగ నచ్చట సాగించవలసిన సత్సంగమును గుఱించి పూర్తిగ మఱచి పూజకజనులవినోదార్థమై దేవాలయములలో క్రొత్తక్రొత్త వినోదములను అలంకారములను జరిగించుట కేర్పాట్లు చేయించుచున్నారు.

ఇక పుణ్యక్షేత్రములయు నుపవాసవ్రతములయు పరిస్థితిగూడ నట్లే పూర్తిగా తారుమారై పోయి యెంతయైనను చెడిపోయినది. ఈ కాలములో నెవరైనను యాత్రలుచేయకుండ నింటనేయుండిపోయి, ఇంటిలో భగవత్పూజ చేయకపోయిననుగూడ నెన్నియోపాపములయు దుష్కృత్యములయు బారి నుండి తప్పించుకొన్నవారగుచున్నారు. యాత్రలకువెళ్లి అచ్చట పుష్టికరాహారములను భుజించి, వినోదములను చూచుచు నిరర్థకపుపనులలో కాలము వ్యర్థ

పుచ్చుకొనుచు మీదుమిక్కిలి యాత్రలుచేసితిమనెడి మితిలేని యహంకారమును మనస్సులో పెంచుకొనుచుండెడి యాత్రికులకన్న యాత్రలు చేయనివారి పరిస్థితియే ఎంతయైనను మెరుగుగనుండును. కావున ప్రస్తుతకాలములోని పరిస్థితులను, మానవుల దురవస్థను చూచినపుడు సంతులకు మహాదయగలిగి వారు జీవులలో నిజమైన పరమార్థులును సత్యాన్వేషులును చాలతక్కువగనే యున్నట్లు కనిపెట్టికూడ తమ దయాకటాక్షములతో పరమపదమును గుఱించిన రహస్యము నందఱకు తమవచనములు, గ్రంథములద్వారా తెలియపర్చిరి. వారుండిన కాలములో నెవరెవరు వారి యుపదేశములను హృదయపూర్వకముగ విని యవగాహనచేసికొని వానియందు పూర్ణవిశ్వాసముతో నభ్యాసముచేయు దొడగిరో, అట్టివారిని పరమపదమునకు చేర్పించిరి. మిగిలిన జీవులందఱియుపయోగార్థమై తమ యుపదేశములను గ్రంథరూపమున వ్రాసియుంచిరి. ఆగ్రంథములను వ్రాయుటలో వారి యుద్దేశ్యము, ఆగ్రంథములను చదివి బోధపఱచుకొన్నవారు సంతులమహిమను తెలిసికొని, నిజసర్వేశ్వరుని పొందుకొఱకై పరిపూర్ణ సంత్ సద్గురువును అన్వేషించుకొని బాహ్యకర్మలను, భ్రమాత్మక విషయములను విడచి, అనగా విగ్రహములు, జంతువులు, ఉదకములు, వృక్షముల పూజలను, అవతారములు, దేవతల పూజలను విడిచిపెట్టి, సకలసృష్టికిని కర్తయు, అతీతుడునైన నిజభగవంతుని చరణకమలములందు దృఢవిశ్వాసముతో అనన్యభక్తి చేయుదురనియు, అట్లు చేసి భగవంతుని దర్శనము నొందు సావకాశము బడయగలరనియే.

39. గతించిన 700 సం॥రములలో ప్రకటమైనట్టి కొందఱు వాస్తవమైన పరిపూర్ణ సంతులు నిజమైనసాధువులు, ఫకీర్లయొక్కయు నామములీదిగువ పొందుపఱచబడినవి. కబీర్ సాహబ్, తులసీసాహబ్, జగజీవన్ సాహబ్, గరీబ్ దాస్ జీ, పల్టూసాహబ్, గురునానక్ సాహబ్, దాదూజీ, తులసీదాస్ జీ నాభాజీ, స్వామీహరిదాస్ జీ, సూరదాస్ జీ, రైదాస్ జీ, మహమ్మదీయులలో షమ్సతబ్రేజ్, మౌల్వీరూమ్, హాఫిజ్, సరమద్, ముజద్దిద్, అలఫ్ సానీ ఈ మహాపురుషుల వచనములను గ్రంథములను పరిశీలించినయెడల వారేయే ధామముల నుండి అవతరించిరో ఏయే స్థానములవఱకు చేరుకొనిరో తేటపడగలదు.

40. సంతుమహాత్ములయొక్కయు, ఫకీరులయొక్కయు, విశిష్టచిహ్నమేమనగా వారు ప్రజలను విగ్రహపూజలు, తీర్థయాత్రలు, గ్రంథాధ్యయనము గ్రంథపూజలలోను, అవతారపురుషులను, దేవతలను ప్రవక్తలను పూజించుట

లోను లగ్నము కాకుండ జేయుచు, వారల కాంతర్యముగ నిజభగవంతుని చర ణములందు దృఢమైన భక్తి, విశ్వాసముల నెల్లపుడు నెలకొల్పుచుందురు. నిజ మైన భగవంతుని పొందుటకు సహజయోగము, అనగా సురత్ శబ్దాభ్యాసము దప్ప మఱొకమార్గము లేదు కావున వారెల్లపుడును ప్రజలకు ఆ సహజయోగా భ్యాసమునే ఉపదేశించుచు సమకాలికులైన పూర్ణసద్గురువునెడల భక్తివిశ్వా సములు గలిగియుండి, వారిసేవ చేయుచుండవలెనని బోధించుచుందురు. మఱియు వారు నిజమైనజిజ్ఞాసువులకును, భగవద్భక్తులకును స్త్రీ, పుత్ర, ధనములందు ఆసక్తిని, అహంకారాభిమానములను దినదినము క్షీణింపజేయుచు, హృదయ మందు నిజమైన భగవంతునియందు భక్తిప్రేమల నభివృద్ధిపొందించుచుందురు. వారు స్వయముగ నిరంతరము భజనధ్యానాభ్యాసములలో నిమగ్నులై యుండుచు తమ సేవకులచేతగూడ నిరంతర మట్టి అభ్యాసములను చేయించు చుందురు. తమ శిష్యులచే పూర్వకాలపు ధర్మములను, కర్మలను విసర్జింపజేసి, వారలభ్రమలు, శంకలు, సందేహములనుగూడ నిర్మూలించి, వారిచే అన్యదేవ తలపూజలను మాన్పించి నిజమైన పరమసత్పురుషునొక్కనినే పూజింపజేయు దురు. అట్లు క్రమేణ తమశిష్యులకు ఆంతర్యబంధనములను, బాహ్యబంధనము లను పూర్తిగ నిర్మూలించి, వారి నీజన్మలోనే భగవచ్చరణములందు చేర్పించు దురు. అయిన నిదంతయు సిద్ధించుటకు శిష్యుడు సద్గురువుయొక్క సత్సంగసేవల నుండి తొలగిపోకుండగ నుండుచు వారి చరణములయందు భక్తివిశ్వాసములను దినదినప్రవర్ధమానముగ వృద్ధిచేసికొనుచు, వారి ఆజ్ఞానుసారము అభ్యాసము నిరంతరము చేయుచునుండుట ముఖ్యావసరము.

41. వసిష్ఠమహర్షియొక్క వాక్యానుసారము బంధనములు అష్టవిధ ములు, మొదటిది- తనవంశము లేక కుటుంబముయొక్క గౌరవప్రతిపత్తులు, రెండవది- తనకులముయొక్క గౌరవప్రతిపత్తులు, మూడవది- తన వృత్తిఅధి కారముయొక్క ఆధిక్యగౌరవములు, నాలుగవది- ప్రపంచములో తన ఖ్యాతి అపఖ్యాతులను గుఱించిన లజ్జాభయములు, ఐదవది- తన దారాపుత్రులు, ధన సంపత్తులను గుఱించి మోహము, ఆరవది- క్షుద్రదేవతారాధనలు, తప్పుడు విశ్వాసములను గుఱించిన పక్షపాతబుద్ధి, ఏడవది- ఆశా[1]తృష్ణలు, ఐహికభోగ వాంఛలు, ఎనిమిదవది- అహంకారము.

---

1. ఇచ్చట 'ఆశ' అనుపదము ఒక ప్రత్యేకార్థములో ఉపయోగింపబడినది. సృష్టికి పూర్వము ఇచ్చటికి దిగివచ్చిన జీవాత్మలలో జడపదార్థముతో సమ్మిశ్రితమైపోవుటకు ఒక ప్రవృత్తి యుండెను. ఈప్రవృత్తినే యిచట 'ఆశ' అని పేర్కొనిరి. ఈప్రవృత్తిమూలముననే అనేకమైన యితరవాంఛలు అనగా, తిండికొఱకు, ధనముకొఱకు, పేరుప్రతిష్ఠలకొఱకు వాంఛలు బయల్వెడ లెను. సంతుమతములో ఈ ఆశ లేక ప్రవృత్తినే 'ఆదికర్మ' యనిగూడ చెప్పుదురు.

42 ఏమహాత్ముని సత్సంగసేవలు చేయుటచే శిష్యునకు ఈ బంధనములు దినదినము క్షీణించిపోవుచు, నిజమైనభగవంతుని చరణములయందు భక్తివిశ్వాసములు ఆరోజుకారోజు వృద్ధినొందుచుండునో, ఆమహాత్ముడే యితనిని సమస్త బంధనములనుండి విముక్తిజేసి సర్వేశ్వరుని నిజధామమందు తప్పక చేర్పించగల డని విశ్వసింపవలెను. సాధువులను, సంతుమహాత్ములను, గుర్తుపట్టుట కింతకన్న నెక్కువశ్రేష్ఠమైన చిహ్నె మఱొకటిలేదు. ఎవరైనను, సంతులయొక్క జీవిత విధానమునుగాని, వారి సుగుణములనుగాని, ప్రవర్తననుగాని ప్రాచీనగ్రంథ లిఖితవిషయములతో పోల్చి పరిశీలించదల్చినను, లేదా వారిని అద్భుతకార్యములను చేసిచూపవలెనని కోరినను లేదా వారిని మఱి యేయితరవిధముగా గాని పరీక్షించి విమర్శింపజూచినను అది చాల గొప్పపొరపాటును, పరమమూర్ఖతయు నగును. ఏలనన, ఈ తుచ్ఛజీవునకు తన అల్పబుద్ధితోను, తుచ్ఛజ్ఞాన వివేచనాశక్తులతోను, సంతులప్రవర్తనను, వారి జ్ఞానమును, పరీక్షించుటకు సామర్థ్యమెక్కడిది? అతడు తనకవసరమైన విషయమొక్కటే మొదట చూచుకొనవలయును. అనగా సంతులయొక్క దర్శనప్రభావమువలనను, వారి అమృత వచనములను వినుచుండుటచేతను, తన హృదయములో భగవచ్చరణముల యందు భక్త్యుత్సాహములు తనకెంతవఱకు వృద్ధిపొందుచున్నవి అనెడి విషయ మును మాత్రమే అతడు మొట్టమొదట గమనించుకొనవలెను. అతడు సంతుల వద్దకు హృదయపూర్వకమైన దీనత్వముతోను, అణకువతోను వెళ్లవలెను. అచ్చట నతడు చాతుర్యాహంకారములతో ప్రవర్తించకూడదు. తన తుచ్ఛ బుద్ధితో వారి నడవడి, పద్ధతులను నిర్ణయించుటకుగాని, విమర్శించుటకుగాని ప్రయత్నించరాదు. ఏలనన, సంతులు జేయు ప్రతికార్యములోను, ఆ కార్యము పైకి పసిపిల్లల ఆటవలెనే కనిపించినను, గుంభితముగ నొకయున్నతోద్దేశ్య మెపుడు నుండి తీరును. వారు చేయుపనులలో సమస్తజీవులకును శ్రేయోలాభములు అంతర్గతముగ తప్పక నుండును. సాధారణజీవునికి సంతుల కార్యకలాపములోని నిజలాభనష్టములను గ్రహించుకొనగలుగునంతటి బుద్ధిసామర్థ్య ముండజాలదు. ఈ కారణమువలననే అనేకజీవులు తమ అల్పబుద్ధి, అజ్ఞానములమూలమున సంతులయెడల అభావమును పొంది వారి సాంగత్యమునకు దూరులై వ్యర్థముగ తమకు హానినష్టములు కలిగించుకొనుచుందురు.

43. సంతుమహాత్ములు తమ సత్సంగములో కేవలము అధికసంఖ్యాకు ల్గుంపులకుగాని, ప్రాపంచికజీవులు పెద్దపెద్ద గుంపులుగా వచ్చియుండుటకుగాని

యిష్టపడరు. వారు పరమపదమును పొందవలెనను యథార్థమైన ఆసక్తిగల జీవులుమాత్రమే తమ సత్సంగములోనికి వచ్చుట కిష్టపడుదురు. వారు ఐహిక వాంఛలతో నిండిన జీవుల సాంగత్యము నేవగించుకొందురు. ఈ కారణముచేత నే వారు సామాన్యముగ తమ యద్భుతశక్తినిగాని, మహిమనుగాని, బాహ్యముగ ప్రదర్శింపరు. ఏలనన, అట్టివిషయములను చూచి, ప్రాపంచికజీవులు, అధిక సంఖ్యాకులుగ వారివద్దకుజేరి వారియొక్కయు, వారిసేవకులయొక్కయు, సత్సంగ మునకు అభ్యాసమునకు భంగముకలుగజేయుదురు. కాని, సంతుల బోధనలను, వచనములను విని వారియందు విశ్వాసముపొందినవారికి వారు తప్పకుండ ఆంత ర్యమున అద్భుతానుభవములు కలుగజేయుదురు. అనగా, అట్టివారలకు నిజ మైన భగవంతుని దివ్యతేజోదర్శన మిప్పించి, అన్ని కార్యములలోను ఆంతర్య సహాయము నెల్లప్పుడు చూపుచునే యుందురు. ఇవ్విధముగ భక్తునకు సంతుల అద్భుతమహిమ స్పష్టముగ అనుభవరూపమున బోధపడి, వారి చరణముల యందు భక్తివిశ్వాసములు దినదినాభివృద్ధి నొందుచుండును.

44. సంతులు తమ సత్సంగములోనికి జనసామాన్యమందఱును వచ్చుట కంగీకరించినపుడు, తరచుగా బీదసాదలుకూడ వారి దర్బారులోనికి వచ్చుచుం దురు. భక్తులు సంత్ సద్గురువునకు తమధనమును, తదితరపదార్థములను అర్పణ చేసినపుడు వా రాపదార్థములను, ధనమును, అట్టిబీదసాదలకు ధర్మముచేయు నిమిత్తమై వినియోగింతురు. తమ సత్సంగములోనికి బీదసాదలు అప్పుడప్పుడు వచ్చుటకు సంతులంగీకరించుట కిదియే కారణము. ఏలనన, ఆ పదార్థములను ధనమును సద్గురువు తమ స్వంతయుపయోగార్థము ఉంచుకొనరు.

45. సంత్ సద్గురువు దయతో నెచ్చటనైన సత్సంగమును స్థాపించి నపుడు, ప్రాపంచిక జీవులును, అహంకారీ జీవులును, తమ దర్బారులో ప్రవే శించి, తమ సత్సంగమునకు భంగము కలుగజేయకుండునట్లు చేయునిమిత్తము వారు తమదినచర్యలో ప్రాపంచికజీవు లాక్షేపించి, తప్పులుపట్టి దూరముగ పోవునట్లుజేయు కార్యములను కొన్నిటిని బుద్ధిపూర్వకముగ సాగించుచుందురు. చెడ్డవారిని, మంచివారిని విచక్షణచేసి చెడ్డవారు తమసత్సంగమునకు రాకుండ నాపుజేయునిమిత్తమై, వారికి ప్రత్యేకముగ పహరాదార్లెవ్వరును ఉండరు. అందుచే ప్రాపంచికజీవులును, అహంకారీ జీవులును, వారినిగుఱించి చేయు ఆక్షేపణలే వారికి పహరాపనిచేయును, అనగా లౌకికజీవులను, అహంకారు లను, వారిసత్సంగమునుండి దూరముగ నుంచును. అట్టివారు ప్రాపంచికజీవుల

యొక్క ఆక్షేపణలకు భయపడియు, సిగ్గుచెందియు నచ్చటికి పోనేరరు. పరమార్థముకొఱకై పూర్ణవాంఛతోనున్న యథార్థజిజ్ఞాసులు మాత్రమే ప్రాపంచిక జీవులవలన వెఱపు, సిగ్గులు చెందకుండ వారి సత్సంగములో వచ్చి చేరుదురు. ఇంతియేగాక ఈ నింద ముముక్షువున కొకవిధమైన పరీక్షగా పనిచేయును. ఏలనన, నవ్విధముగ నతడు నిజమైన పరమార్థియగునో, కాదో తేటపడిపోవును. నిజమైన జిజ్ఞాసి ప్రాపంచిక ప్రతిష్ఠ, అప్రతిష్ఠలకును, మూర్ఖుల ఆక్షేపణలకును, ఎన్నడును వెఱపుజెందక, తన నిజోద్దేశ్యమును సాధించుకొనుటకై అనగా పరమార్థలాభమునొందు నిమిత్తమై సత్సంగములో తప్పక వచ్చిచేరును. నిజమైన జిజ్ఞాసులు కాని వా రచ్చటికి రానేరరు.

46. ప్రాపంచిక జీవులను చూడుడు. వారు మనస్ఫూర్తిగ ప్రాపంచిక విషయములనే కోరుచుందురు. తమ ఐహికవాంఛలను సాధించుకొను నిమిత్తము వారు ఎట్టిచోటకైనను పోవుటకు సందేహించరు. మరియు నచ్చట దైన్యముతో ప్రవర్తించుటకుకూడ సిగ్గుచెందరు. ఉదాహరణార్థము, బ్రాహ్మణులు, (ఉత్తమజాతివారైనప్పటికిని) యితర కులములవారికి సేవచేయుచుందురు; రోగచికిత్స నిమిత్తమై పాకీవాండ్ల గుమ్మము త్రొక్కుటకుకూడ వెనుకాడరు. అటులనే ఉత్తమజాతికిచెందిన చాలమంది తమ మతమును ఇష్టదైవమును గుఱించి చింతయే లేకుండ, పీరులు, సయ్యదులగోరీలను పూజించుటయు ననేకమైన క్షుద్రదేవతలను, భూతప్రేతములను పూజించుటయు గూడ చూచుచున్నాము. ప్రాపంచికజీవులు ఐహికలాభము నిమిత్తము, తమ కర్మధర్మములను విడిచిపెట్టి, మరణానంతర మేమగుననెడి భయమెంతమాత్రము లేకుండగ ప్రవర్తించుచున్నపుడు, పరమపురుషుని పొందగోరినవారు కొద్దిపాటి నిందకును, మూర్ఖుల ఆక్షేపణలకును వెఱచి సంతుల సత్సంగమునకు వెళ్లుటకు వెనుకాడినచో వారియాసక్తి నిజమైనదని యెట్లునమ్మదగును? దీనివలన, వారలకు యథార్థమైన పరమార్థాసక్తి లేనట్లును, వారి కీ ప్రపంచమునుండి సంపూర్ణవిరక్తి గల్గునంత యధికమైన బాధలు ప్రాపంచిక వ్యవహార విషయములలో గలుగలేదనియు, వారి కింకను ఈప్రపంచము దూరమున నుంచవలసినంతటి మహాశత్రువనెడి భావము ఉత్పన్నముకాలేదనియు, లోకమర్యాదలను ప్రాపంచిక జీవుల ఆక్షేపణలను లెక్కపెట్టకుండునంత తీవ్రాభిలాష భగవద్దర్శనము నిమిత్తము వారి కింకను గలుగలేదనియు స్పష్టపడుచున్నది. అట్టివారికి దీనభావముతో సంతుల సన్నిధానమున చేరి, తమ దుఃఖోపశాంతికై యత్నము

చేయగలుగునంత నిర్మలపరమార్థాసక్తి గలుగలేదు. వారు సంతుల సత్సాంగ్ములో చేరుటకు అర్హులుకానేరరు.

47. సంతులసేవకులను సరిదిద్ది వారిభక్తిని దృఢపఱచుటలో నిందారోపణలు, హేళనలు, ఆక్షేపణలును, సహకారముగ నుండునని తెలిసికొనదగును. సేవకునకు నింద అపఖ్యాతులు గలుగనిచో నతడెప్పటియట్ల నపక్వముగనే యుండిపోవును. నిందయు, నపఖ్యాతియు నిజమైన ప్రేమకు చిహ్నాలు. నిజమైన భగవద్భక్తులు తప్ప మఱెవ్వరు నీలోకములో అపనిందనుండి వెలువకుండ నుండజాలరు. ఫార్సీభాషలో నిట్లు చెప్పబడియున్నది:-

మలామత్ షహనప బాజారే ఇష్క్ అస్త్॥
మలామత్ సైకలే జంగారే ఇష్క్ అస్త్॥

తర్జుమా:- ప్రేమయొక్క బజారులో వివిధరకములైన దోషారోపణలే బ్యాండు మ్రోగినట్లు మ్రోగుచు నీకు స్వాగతమీయగలవు. అవి నీయొక్క భక్తికి సానపట్టి తుప్పుపోగొట్టు ఆతివలె పనిజేయును. అనగా, నిందలు, ఆక్షేపణలును, ప్రేమ బజారులో కావలాయుండు పోలీసువలెనుండి మురికిని పోగొట్టి శుభ్రముచేయునని యభిప్రాయము.

ప్రాపంచికలాభమును కోరెడి గురువులు ఈప్రపంచముతోను, ప్రాపంచిక జీవులతోను అధిక స్నేహభావముగలిగి ప్రేమతో ప్రవర్తించుచు, వారికి ఆదర సత్కారములు చేయుచుందురు. వారు తమకీ ప్రపంచములో ఐహికాభివృద్ధి, గౌరవప్రతిపత్తులు యెక్కువగనుండవలెనని కోరుచుందురు. వారికి తమ శిష్యులు అసంతుష్టులైనచో తమ జీవికోపార్జనకును, వ్యాపారమునకును నష్టము రాగలదనెడి భయము మెండుగనుండును. పూర్ణసర్వేశ్వరునికి అనన్యభక్తులైన సంతులు అట్లుగాక, ప్రాపంచికజీవులు తమసత్సంగమునకు వచ్చి భంగము కలుగజేయకూడదనియు, తమ శిష్యుల భక్తిశ్రద్ధలకు వారి సహవాసదోషము వలన భంగము కలుగకూడదనియు కోరుచుందురు. కావుననే సంతులకు నింద అపఖ్యాతులు పహరాదార్లవలె ప్రాపంచికజీవులను తమ దర్బారులోనికి రాకుండ నడ్డుపెట్టగలవను హేతువుచే మహాప్రియముగ నుండును.

48. సంతులవద్ద కెవరైనను వచ్చినపుడు వారికి సామాన్యముగ సంతులు సత్యపురుష రాధాస్వామి వారొక్కరే సత్యవస్తువనియు, మిగిలిన యావద్విషయములు తుచ్ఛములు, నాశమానములనియు బోధింతురు. మూర్ఖులు,

అజ్ఞానులు, అయిన ప్రజలు ఈబోధను దేవతలయొక్కయు, అవతారపురుషుల యొక్కయు, ప్రవక్తలయొక్కయు, నిందావమానములుగ భావించి సంతుల పైన తమ ఇష్టదైవములను నిందించువారని దోషారోపణచేయుదురు. కాని సంతులు, బ్రహ్మ విష్ణు మహాదేవులను దేవతలను అవతారపురుషులను, ప్రవక్తలను, తక్కువవారని చెప్పినపుడు వారెవరిని సర్వోత్తములని చెప్పి శ్లాఘించుచున్నారో యీయజ్ఞానులైన ప్రజలు ఆలోచించుటలేదు. సంతులు సర్వసమర్థ పరమపురుషులైన సత్యపురుష రాధాస్వామివారినే శ్లాఘించినచో అది యుక్తమేకదా! ఏలనన, సర్వశ్రేష్ఠులును, సమస్తజగత్తునకు నధిపతియునైన ప్రభువును శ్లాఘించుటయు వారిచరణములయందు భక్తివిశ్వాసములను కలుగజేయుటయు, వారికి పూజాసేవలు జరుపుటకై ఉపదేశించుటయు, ఎంతయు నుచితమును, ఆవశ్యకమునగు విషయమైయున్నది. కారణమేమన, నట్లుచేయనిచో జీవోద్ధారణయే యసాధ్యమగును. పరమసర్వేశ్వరుని మహిమను విని కోపగించుకొనుటయు, సంతులబోధలలోని సారమును గ్రహించలేక వారి వచనములను గౌరవించుటకుబదులు, తృణీకారముచేసి సంతులను నిందకులుగ భావించుటయు నెంత లజ్జాకరమైన విషయమో యూహించుకొనవలెను.

49. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులయొక్కయు, దేవతలయొక్కయు, ఆయుః కాలపరిమితిని గురించి వేదశాస్త్రములలోను, భాగవత పురాణములు మున్నగు గ్రంథములలోను చెప్పబడియున్నది. ఈప్రపంచమందవతరించిన అవతారపురుషులుగూడ ప్రపంచమును వీడి వెడలిపోయిరి. అందుచే వారిదేహస్వరూపమును, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు మున్నగు వారి దేహములును నాశమానములని సంపూర్ణముగ విశదమగుచున్నది. ఈ రూపములన్నియు నాశమానమైనట్లు స్థిరపడినపుడు ఆ స్వరూపములయొక్క అనుకరణరూపములను శాశ్వతములుగ నంగీకరించి ఆరాధించుట యెట్లు యుక్తమగును? జనులు అవతారపురుషులయొక్క నిజచైతన్యస్వరూపమును గురించి తెలిసికొని ఆ రూపమును భక్తివిశ్వాసములతో ధ్యానముచేసినచో అధమము కొంతవఱకైన వారికి లాభముగలిగెడిది. అసత్యరూపమువలన పరమార్థలాభ మెంతమాత్రము చేకూరనేరదు. కావున సామాన్యజనులు చేసెడి పొరపాటు స్పష్టమగుచున్నది. ఆ పొరపాటును సంతులు నిర్మూలింపదలచినపుడు సామాన్యజనులు తమ మూర్ఖతాహంకారములమూలమున వారిని నిందకులుగ జెప్ప

చున్నారు. అందులో ప్రధానముగ మతము పేరుతో పొట్టపోసుకొనెడి పండితులును, వేషధారులగు సన్యాసులును సంతులను దూషించుటకు ఎల్లప్పుడును సిద్ధమే.

50. ఎవరైనను అవతారపురుషులయొక్క నిజరూపమును, నిజధామమును తాము ఉపాసనచేయుచున్నట్లు చెప్పినచో నది యుక్తమే. అయినను గూడ నింకొకవిషయ మాలోచింపదగియున్నది. ఏమనగా, వారారూపమునకు స్థానమునకు పూజచేసి భక్తిచేయుటకుబదులు సమస్తావతారములయొక్క నిజస్థానములు నేధామమునుండి ప్రకటమైనవో, అట్టి ఆమూలధామమునకు భక్తిపూజ లేలచేయరాదు? ఈ రెండుపదముల పూజావిధానమును, అందుకు పడవలసిన శ్రమయును, సమానమేగాని, వాని ఫలితములలోను, లాభములలోను చాల వ్యత్యాసము గలదు. కావున సర్వోత్తమము, సర్వశ్రేష్ఠమునైన స్థానమునకే భక్తిపూజలు సల్పుట యుక్తము. సంతులు పూజించునట్టియు, ఇతరుల కుపదేశించునట్టియు స్థానమిదియే. ఈ బోధచేయుటలో జనులితరస్థానముల అధిపతులతో ఈర్ష్యావిరోధములు పెట్టుకొనవలయునని యభిప్రాయము గాదు. పైగా, సత్యపురుష రాధాస్వామివారి భక్తుడుగూడ తన మార్గములో వచ్చునట్టి ప్రతిస్థానమునందును ఏకాగ్రచిత్తముతో ధ్యానముచేయవలసియే యున్నది. లేనిచో అతడు ఆస్థానములను దాటి పైకి వెళ్లనేలేడు. కాని భక్తు డీమార్గమున ప్రయాణ మారంభింపకపూర్వము ఉన్నతోన్నతమైన మూలస్థానమునే తనకు ఉపాస్యస్థానముగను, గమ్యస్థానముగను మనమున నిశ్చయించుకొనవలయును. పిమ్మట నితడు మార్గమధ్యమందలి ప్రతిస్థానముయొక్క వివరములను గుఱించియు అచ్చటి ఆనందవిశేషమునుగుఱించియు, సంపూర్ణవివరములు తెలిసికొనవలెను. ఏలనన, ఈలోకములో తప్పుడుబోధలుచేసి అపభ్రమలు కలిగించెడివారు చాల మందిగలరు. ఖుదా, పరమేశ్వరుడు, పరమాత్మ, బ్రహ్మ, పరబ్రహ్మ, శుద్ధబ్రహ్మ, సత్యనామములను గుఱించి చెప్పెడివారు చాలమందిగలరు గాని, వారి కాస్థానములనుగుఱించియు మార్గమధ్యమందలి వివిధస్థానముల వివరములను గుఱించియు యథాతథమైన వాచకజ్ఞానముగూడ లేదు. కావున నట్టివారెల్లపుడు మోసపోవుదురు. వారేయేస్థానాధిపతులను బ్రహ్మయనియు, ఖుదా యనియు, సత్తనామ్ అనియు పేర్కొందురోకూడా తెలియదు. అందుచే సంతులు సహృదయతతో ముముక్షువునకు ముందుగా వివిధస్థానములచిహ్నలను తెలియజెప్పి అన్నిటికన్న నున్నతోన్నతమైన ఆఖరుస్థానమగు సత్యపురుష

రాధాస్వామివారియందు ఉపాస్యబుద్ధిని దృఢపఱచి, పిమ్మట నే ఆ మార్గమున ప్రయాణముచేయుట కభ్యాసము నుపదేశింతురు. అభ్యాసి యీ విధముగ ఆఖరుస్థానమువఱకు వెళ్లి చేరుకొనగలడు; సమస్తలోకములను గుఱించిన వివరములను వాని నిజమైన స్థానములనుగూడ తెలిసికొనగలడు; మఱియు ఆ నిజ పరమసర్వేశ్వరునిగుఱించి సంపూర్ణమైన యథార్థవివరములు తెలిసికొని, ఇచ్చటనుండగ నెంతగుర్తుపట్టశక్యమగునో, అంతవఱకు వారిని గుర్తుపట్టి ఆధ్యాత్మికాభ్యాసము ప్రారంభించ గలుగును. అభ్యాసికి రహస్యవిషయములు తెలియకుండి, ఆ విషయముల నతడు గుర్తుపట్టలేకను అవగాహనచేసికొనలేకను, ఉండి పోయినచో నతనికి పరమపురుషుని చరణములయందు నిజమైనభక్తియు గలుగ నేరదు, అభ్యాసములో దినదినాభివృద్ధియు గలుగనేరదు, మూలధామమును జేరుకొనగల శక్తియుగూడ చేకూరనేరదు. ఆ పరిస్థితిలో అత డేదేని మార్గ మధ్యస్థానమున మోసపడి నిలచిపోవచ్చును.

51. అవతారములును, దేవతలును, పరమసర్వేశ్వరుడు కానేరరని చూపుటకై వారు రచనానంతరమందే అనగా, కొందఱు ద్వాపరయుగము నందును కొందరు త్రేతాయుగమునందును ప్రకటమైరనువిషయముమాత్రము చెప్పినచాలును. వీరు ప్రకటము కాకముందు అనగా, సత్యయుగములో జనులు ఎవరిని పూజించి యెవరిద్వారా ఆ పరమధామమును పొందుచుండిరో, ఆలోచించుకొనవలెను. ఆ కాలములో ప్రణవము (ఓంకారము) అను నామాంతరముచే పేర్కొనబడు హిరణ్యగర్భపురుషుడే ఉపాసన చేయబడుచుండెడివాడు. వేదభాగములైన ఉపనిషత్తులలో నీ పురుషుని ఉపాసనయే బోధింపబడినది. ఆ యుపాసన నిక్కాలమున ప్రజలు విడిచిపెట్టి విగ్రహపూజలు, తీర్థయాత్రలలోను చిక్కుకొనుట కేమి కారణము? గంగానది భగీరథునికాలములో పుట్టెను, కాని అంతకుముందు లేదుగదా! భగీరథునికి పూర్వమందు ప్రజలు, ఏ క్షేత్రములకు తీర్థయాత్రలు చేసెడివారు? పర్యవసాన మేమన, ప్రస్తుత కాలములో వ్యాప్తమైన పూజలన్నియు ద్వాపరత్రేతాకలియుగములలో క్రొత్తగా ప్రకటమైనవే అని తేటపడుచున్నది. పరమపురుషుని సేవయే సరియైన భగవదుపాసన, ఆ యుపాసన సంతమతప్రకారము ప్రతియొక్కరును చేయగలరు. అవతార పురుషులయొక్కయు, ప్రవక్తలయొక్కయు, పూజలు వారుద్భవించిన దేశములలోనేగదా సాగింపబడుచున్నవి. ఏలనన, తదితర దేశములలో వారినిగుఱించి యెవరికిని తెలియనేతెలియదు, ఎవరును వారిని పూజించుటయు లేదు,

౬౨. అవతారపురుషులును, ప్రవక్తలును, వారేయే ధామములనుండి అవతరించిరో, ఆయాధామముల అధిపతులనే నిజమైన భగవంతునిగ నిర్ణయించుటలోను, తమ్ముతాము ఆయాధామముయొక్క అధిపతిచే పంపబడినవారమనిగాని, ఆ భగవంతునికి ప్రియమైనవారమనిగాని చెప్పుకొని తమ్ము లోకులచే పూజింపచేసుకొనుటలోను, తమరినే పూజార్హులుగ చెప్పుకొనుటలోను, తప్పేమియు లేదు; కాని, అందువలన లాభము వారి కాలములో నున్నవారికిమాత్రమే గలిగెను. అవతారపురుషులు, ప్రవక్తలును, తమకాలములో నున్నవారికిమాత్రమే తమ స్వధామములో నివాసము ప్రసాదించిరి. వారి మతములో వారు గతించినపిమ్మట చేరినవారు కేవలము నామమాత్రమునకే వారి అనుయాయులైరి గాని, అందువలన వారి శరీరమనస్సుల పరిస్థితిలో నెట్టి మార్పును కలుగలేదు. అట్టివిశ్వాసమువలన నెన్నటికి ముక్తిలభించనేరదు. పూర్వకాలపు సంతుమహాత్ములను పూజించువారి గతికూడ నిట్టిదే. సంతుమహాత్ములకాలములో వారివలన నుపదేశముపొంది, వారిసేవచేసి, భక్తిచేసినవారు మోక్షముపొందుట కర్హులైరి. కాని, అటుపిమ్మట వచ్చి యా సంతులను నామమాత్రముగ దైవభావముతో స్వీకరించి సమకాలికులగు పూర్ణసద్గురువునుగాని, పూర్ణసాధువునుగాని, అన్వేషించకుండగను, సంతులమార్గమును, అభ్యాసవిధానమును, అనుసరించకను ఉండినవారు తక్కినమతముల అనుయాయులవలెనే మోక్షార్హులు కాజాలరు. విగ్రహపూజలు, తీర్థయాత్రలు పవిత్రగ్రంథపూజలు మున్నగునవి జరుపుచుండెడి యితరజనులవలెనే, సంతులభక్తులుగూడ సమాధులను, పతాకములను, పవిత్రగ్రంథములను పూజించుటలో కాలక్షేపము చేయుచు, సంతుల నిజరూపమును గుఱించిగాని, వారి ధామముయొక్క నిజరహస్యమును గుఱించిగాని సంతులచే బోధింపబడిన ఆధ్యాత్మికమార్గముయొక్కయు, అభ్యాసవిధానముయొక్కయు వివరములనుగుఱించిగాని తెలిసికొనుటకు ప్రయత్నించుట లేదు. మీదుమిక్కిలి బహిర్ముఖమతానుయాయులవలెనే వీరుకూడ కేవలము సమాధులు, గ్రంథములు మొదలగువానియందు విశ్వాసము వహించియుండిరి. అందుచే వీరికికూడ యితరమతములలోని బహిర్ముఖపూజలు సలుపువారివలెనే కర్మభ్రమలలో చిక్కుపడియుండుటచే ముక్తి ప్రాప్తించుటలేదు. సంతులుచెప్పిన ఆధ్యాత్మిక అభ్యాసము చేయుచు, మార్గమధ్యమందలి మజిలీలనన్నిటిని దాటి సత్యపురుషరాధాస్వామీధామము నెవరు చేరుకొందురో లేక అధమపక్షము ఆ మార్గమున ప్రయాణముచేయుట ప్రారంభింతురో, అట్టివారినే వాస్తవమైన సంతుమతానుయాయులుగ చెప్పదగును.

అట్టివారే నిజమైనముక్తి నెప్పటికైనను పొందగలరు. పర్యవసానమేమనగా, పూర్వకాలమునాటి మహాత్ములకు, అవతారపురుషులకు, ప్రవక్తలకు, దేవతలకు దైవభావముతో భక్తిచేయుటయే తమ మతముగ నెంచుకొనెడివారి కెన్నటి కిని ముక్తిలభింపనేరదు.

౬౩. నిజమైన సత్యాన్వేషి తనకాలములోనుండినట్టి పరిపూర్ణసంతునిగాని, పరిపూర్ణసాధువునిగాని, అనగా, నొకపరిపూర్ణసద్గురువు నన్వేషించుకొని, వారున్నట్టి స్థానమునకు వెడలి, వారి సాంగత్యములోనుండి, పూర్వకాలమునాటి సాధువులు, సంతులు, మహాత్ములు, అవతారములు, దేవతలందరును, వారిలోనేయున్నట్లు భావించుకొనుచు, వారికి శరీరమనస్సులతో సేవాభక్తులుచేసి, తనజీవకళ్యాణమును నెఱవేర్చుకొనవలెను. దీని కుదాహరణ యేమనగా పూర్వకాలపు చక్రవర్తు లెంత న్యాయప్రియులును, మహాదాతలు నైయున్నను, వారి చరిత్రలు చదువుటవలనను వారిపేర్లను పునస్మరణచేసినంత మాత్రమునను, తమకిపుడు ధనధాన్య సంపత్తులుగాని, ఉద్యోగాధికారములుగాని లభ్యము కానేరవు. మన కిపుడట్టికోరిక యే యుండినచో, నీ కాలములో సజీవుడై యున్న చక్రవర్తిని కలిసికొనవలెను. అప్పుడే మనకార్యము నిస్సంశయముగ నెఱవేరగలదు, లేనిచో వృథాశ్రమప్రయాసలు దప్ప మఱేమియు లాభముండ నేరదు. మౌలానారూమ్‌వా రిట్లు సెలవిచ్చిరి:-

చూంకి కరదీ జాతే ముర్షిద్ రా కబూల్ ।
హామ్ ఖుదా దర్ జాతశ్, ఆమద్ హామ్ రసూల్॥

తర్జుమా:- నీ వొక మహాపురుషుని సద్గురువుగ నంగీకరించితివిగాన, నీవు ప్రవక్తయు, సాక్షాత్ భగవంతుడుకూడ వారిలోనున్నట్లే నమ్మియుండవలయును. అనగా, పరిపూర్ణసద్గురువునకును, భగవంతునకును వ్యత్యాస మెంత మాత్రములేదు. సద్గురువునందు సాక్షాత్ భగవంతుడు, అవతారపురుషులందరునుగూడ నిమిడియున్నారు. అనగా, భగవంతుని నీవు కలిసికొనగోరినచో ఫకీరులలో అనగా సంతులలో సద్గురువును అన్వేషించుకొనవలయును. కాషాయవస్త్రములను ధరించినవారే సంతులు అగుదురను అనివార్యనియమ మెద్దియు లేదు. సత్యలోకమున ప్రవేశించి, సాక్షాత్ భగవంతునితో నైక్యముపొందిన వారిని సంతులని పేర్కొందురు. వారు గృహస్థులైనను కావచ్చును. లేదా విరాగులైనను కావచ్చును బ్రాహ్మణకులమునకైనను చెందవచ్చును, లేదా మ్లేఛ్ఛకులమునకైనను చెందవచ్చును. ఎవరికైనను భగవంతుని సాక్షాత్ దర్శ

నము కావలెనన్నచో నతడట్టిదర్శనమును తన యంతరంగముననైనను లేదా పరిపూర్ణ సాధుసంతులలోనైనను పొందవలసినదేగాని, యీ లోకములో మరెచ్చటను లభ్యముకానేరదు. పరిపూర్ణసంతు ఈసృష్టికంతకును సహజసిద్ధమైన గురువు. సత్యాన్వేషులకు పైనచెప్పిన రెండుచోట్లనే భగవద్దర్శనము లభింపవలసినదేకాని, విగ్రహములు, పుణ్యక్షేత్రములు, ఉపవాసములు, నాలుగు ధామములు[1], దేవాలయములలోను ఎచ్చటనుగూడ భగవంతునిజాడకూడ లభింపనేరదు. మాల్వీరామ్ ఇట్లు సెలవిచ్చిరి-

మస్‌జిదే హస్త్ అందరూనే ఔలియా।
సిజదా గాహే జుమ్లా హస్త్ ఆఁజా ఖుదా॥

తర్జుమా :-

సిద్ధపురుషునిలో దేవాలయము కలదు.
జగత్తంతకు పూజింపదగినచోటు భగవంతుడు నివసించునట్టి స్థానమే.

అనగా మహాత్ములలో దేవాలయము, మసీదు నున్నవి. ఎవరైనను పరమపురుషునికి, భగవంతునికి పూజ సల్పవలెనన్నచో మహాత్ములకే సాష్టాంగపడవలయును.

ఇట్లుకూడ చెప్పబడియున్నది :-

గుఫ్త్ పైగంబర్ కి హాక్ ఫరమూదహ్ అస్త్।
మన్ న గుంజమ్ హేచ్ దర్ బాలా వో పస్త్॥
దర్ దిలే మోమిన్ బిగుంజమ్ ఈఁ అజబ్।
గర్ మరా ఖ్వాహీ అజాఁ దిల్‌హా తలబ్॥

తర్జుమా :- ప్రవక్త, భగవంతుడు తనతో నీక్రిందివిధముగ సెలవిచ్చినట్లు చెప్పుచున్నారు.

“నా నివాసము, క్రింది లోకములలోగాని, యూర్ధ్వలోకములలోగాని, యెచ్చటనులేదు- చెప్పుటకు వింతగనే కన్పించవచ్చును, కాని నేను నాభక్తుల హృదయములలో నివసింతును. నన్ను కలిసికొనగోరినచో నీవు నాభక్తుల వద్దకు వెళ్ళి యాచించుము”

---

1. ద్వారక, రామేశ్వరము, పూరీ, బదరీనాథ్ అను నాలుగు పుణ్యక్షేత్రములును నాలుగుధామములని పేర్కొనబడును.

అనగా పైగంబర్ సాహబ్ వారితో భగవంతుడు "నేను ఆకాశమందు గాని, భూమిమీదగాని, యెచ్చటను ఉండను, నాభక్తులహృదయములలోనే నివసింతును. నన్నుకలిసికొనగోరినచో వారియొద్దకుపోయి వెదకికొనుడు" అని సెలవిచ్చెను.

కావున భగవంతుని కలిసికొనగోరిన ప్రతిసత్యాన్వేషియు, తనకాలములో విరాజమానులైయున్న సద్గురువు నన్వేషించుకొని, వారివలన నుపదేశమునుపొంది, వారిచరణములయందు శరీరమనోధనములనర్పించి భక్తివిశ్వాసములతో సేవచేయవలెను. అప్పుడు అతనికి స్వల్పకాలములోనే కార్యసాఫల్యము కాగలదు. సంస్కృతములోకూడ నిట్లుచెప్పబడినది :-

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।
గురురేవ పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః

అర్థము :—

గురువే బ్రహ్మ, గురువే విష్ణువు, గురువే మహేశ్వరుడు, గురువే పరబ్రహ్మ – కావున గురువునకే నమస్కరించుచున్నాను.

శ్రీమద్ భాగవతములోను, భగద్గీతలోను, శ్రీకృష్ణుడుకూడ నెవరైనను తనను కలిసికొని ప్రేమించవలెననియు తనకు సేవచేయవలయుననియు, కోరినచో వారు తనభక్తులయొక్కయు, సాధువులయొక్కయు, సేవచేసినచో నదియే తనకు సేవయగుననియు, అందుమూలముననే వారిపై తాను ప్రసన్నుడుకాగలడనియు, తనభక్తుల నెవరు ప్రేమించుదురో, వారే తనకు ప్రేమపాత్రులగుదురనియు, సెలవిచ్చెను. మఱియు శ్రీకృష్ణుడు "నే నాకాశమందుగాని, పాతాళమునగాని స్వర్గములోగాని, వైకుంఠమునగాని ఉండుటలేదు. నాభక్తజనులు సాధువులయొక్కయు హృదయములలో నేనుందును"- అనికూడ సెలవిచ్చెను.

54. సంత్ సద్గురువు బాహ్యముగ మానవరూపమును ధరింతురుగాని, వారి నిజస్వరూపము భగవత్స్వరూపముతో నైక్యమై యుండును. ఏలనన, వారు అనుక్షణము సాక్షాత్ భగవంతుడైన సత్యపురుషునితో కలిసి ఆనందమగ్నులై యుందురు. సత్యాన్వేషికి తనయాంతర్యమున నిజస్వరూపదర్శనము లభించునంతకాలము సద్గురుస్వరూపమునే భగవత్స్వరూపముగ నెంచుకొని వారి చరణములయందు భక్తివిశ్వాసముల నభివృద్ధిచేసుకొనుచుండవలెను.

అతని కాంతర్యమున నిజస్వరూపదర్శనము లభించినపుడు అతడు భగవంతు నితో నైక్యమై, అనగా పరిపూర్ణసద్గురువుయొక్క చరణములందైక్యమై తానే సద్గురుస్వరూపుడై పోవును. అప్పుడే అతనికార్యము సంపూర్ణముగ నెఱవేరి నట్లు చెప్పవలెను. కావున, జీవకళ్యాణ మింతకుముందుకాని, యిటుపైనగాని యెప్పుడు యెవనికి సిద్ధించినను, అది అతనికి తన సమకాలికసద్గురునికి భక్తిచేసి వారి సేవాసత్సంగములను చేయుటమూలముననే సిద్ధించినదనియు లేక సిద్ధించ గలదనియు గ్రహించవలెను. ప్రాచీనకాలపు సంతుమహాత్ములు, గురువులు, అవ తారములు, ప్రవక్తలు, దేవతలును ఉపదేశములనుగాని, తమ నిజస్వరూపము యొక్క దర్శనమునుగాని ప్రస్తుతసమయములో నియ్యజాలరు. అందుచే నిజ మైన సత్యాన్వేషికి వారలయందు నిర్మలభక్తివిశ్వాసము లేర్పడనేరవు. ఒక వేళ నెవరైనను నిర్మలభక్తిగల్గియున్నను, అత డెప్పటియట్లే యుండిపోవును. అనగా అట్టివాని కాంతర్యమున కొంత చిత్తశుద్ధి కలుగగలదు. కాని, అతని జీవాత్మకు తన ప్రస్తుతస్థానమునుండి కదలికయుండనేరదు. అనగా, అతని జీవాత్మ ఉత్తమలోకముల కారోహింపనేరదు. అతని యాత్మ యథాప్రకారము మలినస్థానములోనే ఇప్పుడుకూడ నుండిపోవుటచే, అంతయెక్కువ శ్రమప్రయా సలుపడి సంపాదించినట్టి చిత్తశుద్ధికూడ నిలకడగనుండనేరదు. ఏలనన, మాయికలోకములలో మాయాప్రభావము పనిచేయుచునేయుండును గావున, దానిప్రతాపము అధికముగ ప్రకటమైనపుడు అతని భక్తివిశ్వాసములు వెంటనే హ్రస్వమై అతడు తిరిగి ప్రాపంచికభోగసుఖములలో చిక్కుకొనిపోవును. పరి పూర్ణసద్గురువుయొక్క సేవాసత్సంగములను చేసికొని, వారిదయాకటాక్షములను సంపాదించనంతవఱకు నేరికిని తమ అధోముఖవృత్తులనుండి సంపూర్ణవిముక్తి గల్గుటయు, భగవంతుని నిజరూపజ్ఞానము లభించుటయు నసంభవము. ప్రతిమాన వునిలో నెన్నియో సంశయములును, సందేహములును, తనకు తెలియకుండగనే దాఁగియుండును. సంతసద్గురుని సాంగత్యములోనికి రానంతకాల మతడు తనకు సంశయ సందేహములున్నట్లే తెలిసికొనలేక తనకెట్టి సంశయములు లేనేలేవని యనుకొనుచుండును. అతడు సద్గురుసత్సంగములోనికి వచ్చినపుడే అతనికి తనలో నెన్నిసంశయములు, భ్రమలు దాఁగియున్నవో, నిజమైన భక్తివిశ్వాసములను సంపాదించుట యెంతకష్టతరమో, మూలధామ మెంత మహాదూరమున నున్నదో, అనువిషయములు బోధపడగలవు. సారాంశమేమనన, సమకాలికు లైన పూర్ణసద్గురునియొక్క కృపాకటాక్షములు, సహాయమును లేనిదే యెవరి కిని నిజమైన భక్తిని సంపాదించుటయు, పరమార్థము సిద్ధించుటయు, నెంత

మాత్రము సాధ్యముకాదు. ఈలోకమునకు వచ్చిన అవతారపురుషులుగూడ గురువును స్వీకరించవలసియే వచ్చెను. మాతృగర్భమున నుండినపుడే జ్ఞానమునుపొందిన శ్రీశుకునివంటి మహాజ్ఞానికిగూడ, గురూపదేశములేకుండ పరమార్థమార్గములో ముందంజసాగలేదు. వైకుంఠమునకు రాకపోకలు జరుపగల శక్తిసామర్థ్యములుగల్గిన నారదమహర్షికే గురువును స్వీకరించనిదే వైకుంఠములో నివాసము పొందునర్హత సిద్ధించలేదు. అట్టి పరిస్థితిలో సామాన్యజీవునకు సమకాలిక సద్గురుని కటాక్షము సంపాదించకుండగనే పరమార్థమార్గములో ముందంజవేయగలశక్తి యెట్లుండును ?

55. కొందఱు వేదశాస్త్రములను, పవిత్రగ్రంథములనే గురువుగ భావించుచున్నారు. ఆగ్రంథములమూలమున నెన్నియోవిషయములు తెలియగలవనుటలో సందేహము లేదు. కాని యెవరైన నాగ్రంథములను చదువుట, వినుటతోనే తృప్తిజెంది సద్గురువు నన్వేషించకుండ నుండినచో నతనిని శుద్ధమూర్ఖుడనియే చెప్పవలెను. ఏలనన, ఆధ్యాత్మికసాధనలవిధానమును, వానిరహస్యవిషయములును, సమకాలికసద్గురువువద్దనుండియే తెలిసికొనదగినవి కాని, లిఖితపూర్వకముగ దెల్పుటకు శక్యమైనవికావు. ఆవిషయములు శాస్త్రములలోను, గ్రంథములలోను వ్రాయబడియుండనులేదు. గ్రంథములలో నీవిషయములు కేవలము సూచనరూపముగా వ్రాయబడినవి. కావున గ్రంథములు ఈ విషయములకు ప్రమాణములుగా ఉపయోగించును కాని, రహస్యవిషయములన్నియు సద్గురువువలననే తెలిసికొనవలెను. గ్రంథములు చదువుటచే విద్యమాత్రము వచ్చును, కాని, నిజమైన భగవంతుని పొందుమార్గము దొరకదు. కావున శాస్త్రములు పవిత్రగ్రంథములును సహాయకరములుగ పనిచేయును. వానిని చదివి అవగాహనచేసికొన్నందువలన కొంతవఱకు వ్యావహారికములో సత్ప్రవర్తన గలుగవచ్చును. అనగా, వానిమూలముగా ప్రవర్తనలో నేది యుక్తమో, ఏది అయుక్తమో బోధపడి, నిజమైన పరమార్థచింతగల సత్యాన్వేషి చెడుపనులను క్రమక్రమముగ విడిచిపెట్టి, మంచిపనులను చేయుట ప్రారంభించవచ్చును. కాని, పరిపూర్ణసద్గురువుయొక్క దయాకటాక్షములు లేనిదే, మనస్సు నశించుటయు, మనోవికారములు పూర్తిగ తొలగిపోవుటయు సాధ్యముగాదు. మనస్సు శేషించియున్నంతకాలము చెడుగు, చెడువృత్తులయొక్కయు బీజములట్లే నిలచియుండిపోవును. ఈ వృక్షమునకు ఆకులును, కొమ్మలును రాలిపోయిన నేమిలాభము? అంకురము నిలిచియున్నంతకాలము, ఎప్పు

డైన, మాయికసుఖభోగములస్వాదము తగిలినచో నా యాకులు, కొమ్మ లన్నియు చిగిర్చి క్రొత్తక్రొత్తకొమ్మలు బయల్దేరును. అందువలన వేద శాస్త్రములు, గ్రంథములమూలముగ భగవంతుని గుఱించిన గుప్తవిషయములు కొంతవఱకుమాత్రమును సద్గురువుచిహ్నలనుగుఱించి కొన్నిప్రమాణములను మాత్రమే తెలిసికొనగల్గుటయు, మంచిచెడుగులు, పాపపుణ్యముల తారతమ్య మును తెలిసికొనగల్గుటయు మాత్రమే సాధ్యమనువిషయము గ్రహించవల యును. వానివలన నింతకన్న నధికలాభము చేకూరనేరదు. నిజమైన పరమా ర్థము కేవలము పరిపూర్ణసద్గురువువలననే లభించగలదు. అట్టిగురువు నన్వే షించుకొనుట సత్యాన్వేషి కత్యావశ్యకము. ప్రాచీనమహాత్ములందు విశ్వాస ముంచుకొని, అంతటితోనే తృప్తినొందువారికి భగవంతుని పొందునిమిత్తమై తీవ్రసంవేగము లేదు. అందువలన నట్టివారికి భగవద్దర్శనముగూడ పొంద శక్యముగాదు.

56. ప్రతిపరమార్థియు పరిపూర్ణసద్గురువు నన్వేషించుకొని వారిని గురు వుగ స్వీకరించవలెను. పరిపూర్ణసద్గురువనగా సత్యలోకమువఱకు జేరుకొని, సత్యపురుషునితో నైక్యము జెందిన మహాపురుషుడే. అట్టి మహాపురుషునే సంతు అనిపేర్కొందురు. వారు తమవద్దకు వచ్చినవారికి ఒక్క సురత్ శబ్దమార్గము తప్ప మఱొక యుపదేశమివ్వరు. మఱియు వారు ఆంతర్యమార్గమును, ఆంతర్య స్థానముల రహస్యములనుజెప్పి సద్గురుస్వరూపముయొక్కయు (అనాహత)శబ్దము యొక్కయు సహాయముతో నాత్మ నాంతర్యమున నారోహింపచేయవలయు నని యుపదేశింతురు. అటులనే వారి సత్సంగములోను, వారిగ్రంథములలోను గూడ నీ రహస్యమునుగుఱించియు, సద్గురువు, సత్యపురుషుడు, శబ్దస్వరూప ములయొక్క మహిమలనుగుఱించియు, ఆంతర్యమార్గమును గుఱించియు, అనురాగము, ప్రేమ, వైరాగ్యము మున్నగువిషయములను గుఱించియు వర్ణ నలుండును. ఏస్థలమున పూర్వపు మహాపురుషులగాథలు, లీలలను గుఱించి వర్ణనలు జరుగుచుండునో లేక కేవలవైరాగ్యమే ప్రధానవిషయముగ నొక్కి చెప్పబడునో, కాని ఆంతర్య రహస్యములను గుఱించియు, మనస్సు నేకాగ్రము చేసి ఆరోహింపజేయుసాధనను గుఱించియు కొంచెముగూడ చెప్పబడదో అట్టి స్థలము సంతుల నిర్వాచనప్రకారము సత్సంగమని పేర్కొనబడనేరదు. ఏలనన, సత్సంగమనుపదమునకు అర్థము 'సత్' అనగా సత్యపురుషునియొక్క సాంగత్య మెచ్చట లభించునో అట్టిస్థలమే. సంతులు స్వయముగ సత్యపురుషుని స్వరూ

కముగనుక వారిసాంగత్యము సత్సంగమగును. వారి వచనములలోను, గ్రంథములలోను సత్యపురుష రాధాస్వామివారియొక్కయు, వారి సంత్ సద్గురు స్వరూపముయొక్కయు, మహిమను గుఱించియు, వారి నిజరూపమును నిజధామమును పొందుటకు చేయవలసిన సాధనను గుఱించియు, వారిచరణములయందును. శబ్దముయొక్క ధ్వనియందును ఉండవలసిన ప్రేమప్రతీతులను గుఱించియు, భక్తుడైన అభ్యాసికి మార్గములోని వెవ్వేఱు లోకములను జేరుకొన్నప్పుడు గలిగెడి అనుభవములను గుఱించియు, వర్ణనలుండును. అందుచే సద్గ్రంథములను, వచనములను, వినుటయు, వానిని మననముచేసికొని అవలంబించుటయు, వారి పవిత్రచరణములందుగాని, శబ్దమందుగాని, ఆత్మను మనస్సును, అంతర్యమున నైక్యము జేయుటయు 'సత్సంగ'మని చెప్పదగును. ప్రతిమతములోని ప్రాచీన గ్రంథములయందు ననేకస్థలములలో సత్సంగమునకు విశేషమహిమ చెప్పబడినది. సత్సంగము బహుస్వల్పకాలముచేసిననుగూడ కోటిజన్మల పాపములు నశించుననియు జీవకళ్యాణముగూడ చేకూరుననియు చెప్పుదురు. ఇందుకు రుజువు కావలెనన్నచో నెవరైనను సద్గురువుయొక్క సత్సంగములోజేరి పరిశీలించుకొనవలెను. అనగా, వారిగ్రంథములను చదువుకొనుచు, వారి వచనామృతమును గ్రోలుచు వారిచరణసన్నిధానమున కొన్నాళ్లుండిగాని, లేదా వారుపదేశించిన సాధనలను తనమనస్సును, ఆత్మను, లగ్నముజేసి అభ్యాసము చేసియు పరిశీలించుకొనవలయును. ఇట్లు విమర్శచేసినచో నీవిషయ మెంత యథార్థమో యెవరికైనను బోధపడి విశ్వాసము గలుగగలదు. మఱియునట్లు పరిశీలన చేసినచో నెవనికైనను కొలది దినములుమాత్రమే సంతుల సత్సంగము చేసినందువల్లను, వారుపదేశించిన యాంతర్యసాధనను కొద్దికాలముమాత్రమే అభ్యాసము చేసినందువల్లను ఎట్టి మహాఫలితముచేకూరగలదో స్వయముగ బోధపడగలదు.

57. ఇక్కాలమున శరీరమును కష్టపెట్టుసాధనలను తపస్సను పేరుతో జేయువారిని అనేకులు విశేషముగ శ్లాఘించుచుండుట కడుశోచనీయవిషయము. అనగా, పంచాగ్నిమధ్యమందు తపస్సుచేయుట, హస్తమును పైకెత్తి దానిని శుష్కింపజేయుట, నీటిలో నిలబడియుండుట, మేకులమీదను, కొయ్యలమీదను కూర్చుండుట, రాత్రింబవళ్లు బహిరంగముగ దిగంబరులై కూర్చుండిగాని, నిలబడిగాని యుండిపోవుట, లేక నేదోవిధముగ శరీరమునకు బాధకలుగజేసి విచిత్రములు చూపించుట, లేదా అన్నము మానివేసి కేవలము పాలు

త్రాగియుండుట, రాత్రియంతయుగాని, పగలంతయుగాని గ్రంథపఠనము జరుపుచుండుట, గుహాలలోకూర్చుండి స్మరణ ధ్యానములు చేయుచుండుట, అడవులలోనికిని కొండలమీదకునుపోయి నివసించుట, మౌనవ్రత మవలంబించి యెవరితోను మాట్లాడకుండనుండుట, యిటులనే అనేకవిధములైన ఆడంబరకృత్యములు చేయువారిని పెక్కుజనులు గొప్పమహిమగలవారినిగ నెంచి శ్లాఘించుచున్నారు. ఇట్టి కృత్యములను జేయువారియొక్క ప్రవర్తన బాహ్యముగ నాశ్చర్యకరముగనే కన్పించుటచే వారు గొప్పమహిమలు కలవారని ప్రేక్షకులందఱకు తోచవచ్చును. కాని, వారితో నెవరైన చర్చించినచో వారాయసాధారణ కృత్యముల నేయుద్దేశ్యముతో, లేక నేకోరికతో చేయుచున్నారో లేదా యేసంతోషమును పొందుకొఱకు లేక నేయితరకారణముచే చేయుచున్నారో తేటపడగలదు. అప్పుడు వారియథార్థపరిస్థితి అనగా వారు నిజమైన పరమార్థులో లేక పాషండులో తేలిపోవును. ఇప్పుడు నిజమైన పరమార్థియన నెట్టివాడో, కపటియు, స్వార్థపరుడు నన నెట్టివాడో విమర్శించవలసియున్నది. అసలైన పరమార్థి యేపనిచేసినను తనకు అందుమూలముగ నిజమైన భగవంతుని దర్శనము లభించవలెననియు, భగవంతుడు తనకు జననమరణములకు సంబంధించిన సుఖ దుఃఖములనుండి విముక్తిగలుగజేసి శాశ్వతానందముగల నిజధామ నివాసము దయచేయు మహాకృప జూపవలెననియు నొక్కటే కోరికతో చేయును. అదితప్ప మఱొకకోరిక యతని కుండనేయుండదు. స్వార్థపరులు, డాంబికులు, మోసగాండ్రు నేపనిచేసినను అందువలన తమకు పూజలు గౌరవప్రతిష్ఠలు, లభించవలెననియు, అధికారము, ధనము, ఐహికభోగములు, లభించవలెననియు, లోకులందఱును తమ్ముస్తుతి పాఠములుచేయుచు గొప్పవారిగ నెంచుకొనవలెననియు, కోర్కెతోనే చేయుదురు. వారు కోరెడి భోగములును, గౌరవమును, ఇహలోకమునకు సంబంధించవచ్చును లేదా స్వర్గము, వైకుంఠము, బ్రహ్మలోకమునకు సంబంధించినవైనను గావచ్చును; కాని యీరెండిటిలో గొప్పవ్యత్యాస మేమియులేదు. ఏలనన, ఒకస్థానములోని భోగములు స్వల్పకాలములోను, మఱొకచోట భోగములు కొంతకాలమైనపిమ్మటను నశించిపోవునవే. స్వర్గములోగాని, వైకుంఠములోగాని లేదా బ్రహ్మలోకములోగాని ప్రవేశించినను ప్రవేశించవచ్చును. లేక మృత్యులోకములోనే యుండిపోయినను ఉండిపోవచ్చును. ఇవన్నియు కాలునియొక్కయు మాయయొక్కయు ఆవరణలోనిస్థానములే. కాబట్టి అందెచ్చటికివెళ్ళినను నిజమైనమోక్షము లభింపనేరదు. తిరిగితిరిగి పుట్టుచును చనిపోవుచును, సుఖ

దుఃఖముల ననుభవించుచు నుండవలసినదే. శ్రీకృష్ణు డర్జునున కొకచీమను చూపించి, అది అంతకుముందెన్నియోమారులు బ్రహ్మగను, ఎన్నియోసార్లు ఇంద్రుడుగను ఉండి, మఱియు ననేకసార్లు ఇతరవిధములైన ఉత్తమగతుల నెన్నియో పొందియుండెననియు, ఆ ప్రస్తుతజన్మయందొక చీమగ జన్మించె ననియు, చెప్పెను. కావున స్వయముగ బ్రహ్మయును, ఇంద్రుడునే జన్మమరణ చక్రమునుండి తప్పించుకొనలేనపుడు వారిలోకములను పొందగోరి సాధనల నభ్యాసముచేసెడివా రెట్లు జన్మమరణచక్రమునుండి తప్పించుకొనగలరు? అమరులెట్లుకాగలరు? కావున హోమములు, యజ్ఞములు, ఉపవాసవ్రత ములు, నాలుగుధామములకు యాత్రలు, ఇత్యాది కర్మలను చేయువారును, మఱియు సూర్యుడు, చంద్రుడు, గణేశుడు, శివుడు, విష్ణువు, బ్రహ్మ, శక్తి, ఈశ్వరునియొక్క అవతారస్వరూపములు మున్నగువారిని ఉపాసనచేయువా రును విష్ణులోకమగు వైకుంఠమును దాటి పైకివెళ్ళనేరరు. అవ్విధముగ నుపా సనలు చేసినవారు తమతమఉపాస్యదేవతయొక్క లోకమందు అనగా, సూర్య లోకము, చంద్రలోకము, స్వర్గలోకము, శివలోకము, విష్ణులోకము, శక్తి లోకము, బ్రహ్మలోకము, వైకుంఠలోకము మొదలుగాగల లోకములయందు మాత్రమే చేరుకొని అచ్చట కొంతకాలముండి తిరిగి మృత్యులోకములో జన్మించి జన్మమరణచక్రములోనికి వత్తురు. క్షుద్రదేవతల నుపాసనచేయువా రినిగుఱించి చెప్పనవసరమేలేదు. ఏలనన నట్టివా రాయుపాసనాఫలితమును, భూలోకమునందే అనుభవించి, అనగా కొన్ని ఐహికవస్తువులనుగాని లేదా కొన్ని సిద్ధులను, శక్తులనుగాని సంపాదించి తిరిగి జన్మమరణచక్రములోనే ఉండిపోవుదురు.

౫౮. బ్రహ్మజ్ఞానులమని చెప్పుకొనుచు తమ్ము నితరులందఱికన్న నుత్త ములుగ భావించుకొనువా రిక్కాలమున పెక్కుమంది గలరు. నిజమునకు పైనచెప్పిన అభ్యాసములన్నిటికన్న బ్రహ్మజ్ఞానము బహుశ్రేష్ఠమైనదే. కాని అది వాస్తవమైన బ్రహ్మజ్ఞానమై యుండవలెను. గ్రంథములను చదివి సంపా దించుకొన్నజ్ఞానము కేవలము పుస్తకజ్ఞానమే యనిపించుకొనును. అట్టిజ్ఞానము వలన మోక్ష మెన్నటికిని లభించదు. ఏలనన పవిత్ర గ్రంథములలో పెక్కు చోట్ల తత్త్వజ్ఞానము మనోవాసనలను నాశనముచేయునని వ్రాయబడియున్నది. అనగా మనస్సును వాంఛలును పూర్తిగ నశించిపోయినగాని తత్త్వజ్ఞానము అనగా పరమపురుషునిజ్ఞానము కలుగనేరదు. అయితే, యోగాభ్యాసము

చేయనిదే మనోవాసనలు నాశనమగుట అసంభవము. అందుచే యోగసాధన చేయకుండ కలిగినజ్ఞానము వాచకజ్ఞానమేయగును. పాండిత్యముగల ప్రతి మానవుడును తన్నుతాను బ్రహ్మజ్ఞానిగ చెప్పుకొని, అందఱికన్న తాను గొప్ప వాడని చెప్పుకొనగలడు. అందులో విశేష మేమున్నది ? ఇంద్రియమనస్సుల దమన మెక్కడనున్నది ? ఈకాలములో బ్రహ్మజ్ఞానులమని యనుకొనెడివారి నెవరైనను "మీరేసాధనచేసి బ్రహ్మజ్ఞానమును పొందితి"రని ప్రశ్నించినచో వారు కోపగింతురు. మఱికొందఱు తమ పూర్వజన్మలో నభ్యాసమును చేసితి మని సమాధానము చెప్పుదురు. ఆమాట నిజమైనచో వారలకు ఆసాధనల విధానముగూడ తెలిసియేయుండవలెను, అనగా, ఈజన్మలోగూడ జ్ఞావక ముండవలసినదే. ఏలనన, బ్రహ్మకును, బ్రహ్మజ్ఞానికిని, భేదమేమియు లేదు. మతగ్రంథములలో నీక్రిందివిధముగా చెప్పబడియున్నది:—

బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి ।

అర్థము :—

బ్రహ్మను తెలిసినవాడు స్వయముగ బ్రహ్మయే అగును.

మఱియు నిట్లుగూడ చెప్పిరి :—

ఇజాతమఉల్ ఫకర్ ఫహో అల్లాహో ॥

అర్థము :—

ఫకీరుగతిని పొందినవారు, అనగా, సంపూర్ణమైన ఫకీరు స్వయముగ 'అల్లా'యే యగును.

కావున [1]సూఫీలకును, జ్ఞానులకును, పూర్వవిషయములన్నియు తెలిసి యుండవలెను. కాని పైనచెప్పిన బ్రహ్మజ్ఞానుల పరిస్థితి యెట్లున్నదనగా, వారికి తమ ఇంద్రియమనస్సుల విషయమే తెలియదు. అనగా, తమ ఇంద్రియ మన స్సులు వారిని లోబరచుకొని వారిచే నేయేపనులు చేయించుచున్నవో గూడ వారికి తెలియదు. ఆ పరిస్థితిలో వారు బ్రహ్మజ్ఞానులమని చెప్పుకొనుటయు, తాము బ్రహ్మ అయిపోయినట్లెంచుకొనుటయు గొప్ప పొరపాటు. అందుకు ఫలితముగా వారికికూడ కర్మకాండలు జరిపెడివారిగతియే పట్టును. అనగా, వారు జన్మమరణచక్రములోనే పడియుండిపోవుదురు.

---

1. సూఫీలు మహమ్మదీయ ఫకీర్లలో నొకతెగవారు. ఆధ్యాత్మికసాధనలు చేయుట ముఖ్యావశ్యకమనియు, భగవత్సాక్షాత్కారముపొందిన మహాపురుషులే ఇతరులకు పరమార్థ ములో సహాయము చేయగలరనియు వారి దృఢవిశ్వాసము.

59. పూర్వకాలమునాటి జ్ఞానులైన వ్యాసుడు, వశిష్ఠుడు, శ్రీరాముడు శ్రీకృష్ణుడు మున్నగువారు, యోగీశ్వర[2]జ్ఞానులును, ప్రకాశముగలుగజేయువారును, సాధన చతుష్టయము సంపూర్ణముగ చేసినవారును అయియుండిరి. అందుచే వారి సిద్ధాంతప్రకారము సాధనచతుష్టయము పరిపూర్ణముగా నెరవేర్చనివారు జ్ఞానులు కానేరరు సరిగదా, జ్ఞానగ్రంథములు చదువుటకైన నర్హులు కానేరరు. ఆనాల్గుసాధన లెవ్వియనగా,

1) వైరాగ్యము 2) వివేకము 3) షట్సంపత్తి, ఇందులో శమము[1], దమము[2], ఉపరతి[3], తితిక్ష[4], శ్రద్ధ[5], సమాధానత[6] అనెడి ఆఱు సాధనలును చేరియున్నవి. (4) ముముక్షుత అనగా, మోక్షము పొందవలెననెడి తీవ్రేచ్ఛ.

ఇప్పటి కాలపుజ్ఞానులలో నీసాధనలలో నొక్కటిగూడ కానరాదు. వారు గృహస్థాశ్రమము విడిచిపెట్టుటయే వైరాగ్యమనియు, గ్రంథములను చదివి మననముచేసికొనుటయే వివేకమనియు తలంచుచున్నారు. అటులనే వారు షట్సంపత్తికూడ తమ కేదోవిధముగ సిద్ధించినట్లే యెంచుకొనుచున్నారు. ఎట్లనగా, వారొకొక్కప్పుడు ఆకలిదప్పికలను కొంతవఱకు ఓర్చుకొనుచున్నారు, శీతోష్ణములనుగూడ కొంతవఱకు సహించుకొనుచున్నారు. గ్రంథములను పఠనమననములు చేయుసమయములలో నింద్రియమనస్సులను కొంతవఱకు నిగ్రహములో నుంచుకొనుచున్నారు. మఱియు వారు జ్ఞానులతో సాంగత్యసహవాసములు చేయుచుండుటవలనను, జ్ఞానగ్రంథములు చదువుటలోను, బోధపఱచుటలోను ఆసక్తియుండుటచేతను ముముక్షుతాసాధనగూడ తమకు సిద్ధించినట్లెంచుకొనుచున్నారు. వారి తెలివితేటలట్లుండినపుడు వారికి చెప్పవలసినదేమున్నది! ఉత్సవములు, వినోదములు చూచుటకును, దేశాటనము చేయుటకొఱకును, పేరుప్రతిష్ఠలు సంపాదించుకొను నిమిత్తమై సంతర్పణలుజరిపించుచు, తమయాజమాన్యముక్రింద సన్యాసుల సంఘములను ప్రోగుచేయుటకొఱకును పీరలకు ఆసక్తి మెండుగనుండి, తన్నిమిత్తమై వీరు సంతర్పణఖర్చులకనియు, రైలుఖర్చులకనియు చిన్నచిన్న గృహస్థులవద్దకుపోయి

---

2. యోగీశ్వరులనగా యోగాభ్యాసముచేసి త్రికుటిస్థానమును పొందినవారు.

(1) మనస్సుయొక్క నిగ్రహము (2) ఇంద్రియమనస్సుల నిగ్రహము (3) ప్రాపంచిక భోగ సుఖములయం దాసక్తిలేకుండ నుండుట (4) శీతోష్ణములను సహించియుండగల శక్తి (5) ఋషులయొక్కయు, సిద్ధపురుషులయొక్కయు వాక్యములయందు దృఢవిశ్వాసము (6) మనస్సును బాహ్యపదార్థములనుండి తప్పించి, అంతర్ముఖముగ చేసికొనుట.

ప్రాధేయపడి వారివద్దనుండియు, షాహుకార్లు, జమీందార్లవద్దనుండియు ధనమును ప్రోగుచేయుచున్నారు. అట్లుండియుగూడ తమ్ముతాము విరాగులుగ చెప్పుకొనుచున్నారు. వీరల యీమూర్ఖత చాలశోచనీయము. దీనినిబట్టి వారికి వైరాగ్యముయొక్క స్వరూపము లక్షణములు నెంతమాత్రము తెలియనట్లు స్పష్టమగుచున్నది. మఱియు వీరలకు నిత్యము గ్రంథములను చదువుటకును, చదివించుటకునే ఆసక్తి మెండు అగుచున్నది. వీరికివ్విధముగ మనస్సులో కొంచెముకూడ మార్పేమియు లేకుండినపుడు, వీరలకుగలిగిన బ్రహ్మానంద మెట్టిదా యని యాశ్చర్యముగలుగుచున్నది. వారిని మీారీపని నెందుకుచేయుచున్నారని యెవరైన ప్రశ్నించినచో, పరోపకారార్థమై చేయుచుంటిమని వారు సమాధానము చెప్పుదురు. వారిసమాధానమునుబట్టి పరోపకారమననేమియోగూడ వారికి తెలియనట్లు స్పష్టమగును. ఎవరైనను నిజమైన బ్రహ్మజ్ఞాని అయినచో నతనికి జీవులకు ఉద్ధారముచేయగలశక్తి యుండవలెను. జీవులను బంధనలలో నుండి విడుదలచేసి ముక్తిపదమునందు చేర్చుటయే నిజముగ పరోపకారమని చెప్పదగును; కాని విద్యనేర్పి జనులను అహంకారపూరితులుగ జేయుటయు, జనులకు తిండిపెట్టుటయు, సత్రములను, దేవాలయములను కట్టించుటయు, పేదలకు అన్నదానముచేయుటయు, పండ్లతోటలు వేయించుటయు,- ఈపనులు నిజమైన పరోపకారమని పేర్కొనదగవు. ఇట్టి యుపకారము చేయుటకు షాహుకార్లు, జమీందార్లు నుద్దేశింపబడియున్నారు గాని అందులకు బ్రహ్మజ్ఞాను లవసరములేదు. జీవులను తమ ఇంద్రియమనస్సులబంధనమునుండి తప్పించి వారికి ఆత్మదర్శనము గలుగజేసియు, వారల నాత్మస్థానమందు చేర్పించియు, అందుమూలమున జన్మమరణరహితులుగజేసి, సమస్తకష్టక్లేశములనుండి తొలగించుటయే బ్రహ్మజ్ఞానియొక్క కర్తవ్యము. కాని యిక్కాలపు బ్రహ్మజ్ఞాను లీపని నెట్లుచేయగలరు ? వారు తమకే స్వయముగ జీవకళ్యాణము చేసికొనలేకుండ నుండినపు డితరజీవుల కేవిధముగ జీవకళ్యాణము చేయగలరు ? వీరు ఇల్లువాకిలివిడచి తిరుగుటకు కారణము తమయింట నేదైన మహాకష్టమో, దుఃఖమో గలుగుటయో, లేదా గృహకలహములు, తగాయిదాలు బయల్వెడలియుండుటయో, లేదా సోమరితనమో ఎవరికి తెలియగలదు ? తమకుచితముగ నన్నవస్త్రములు దొరకగలవనియు, తమకందఱును పాదపూజలు సేయుచుందురనియు, జ్ఞానులనెడి పేరుప్రతిష్ఠలు గలుగుననియు, యోచించియే వారీసన్యాసివేషము ధరించియుందురు. అవన్నియు కొంతవఱకు లభించగనే, వారు తమ్ముతాము మహాత్ములుగను, ఉత్తమపురుషులుగను

లేదా సాక్షాద్బ్రహ్మస్వరూపులుగను భావించుకొనుచు, ప్రజలవద్దనుంచి ధనార్జన ప్రారంభించి వడ్డీవ్యాపారముగాని, వర్తకముగాని చేయదొడగుదురు. అట్లు ధనము నధికముగ సంపాదించి, పేరుపొంది, 10, 20, 50 లేక వందమంది సాధువులను తమపోషణలో నుంచుకొని, తీర్థములలోను, ఉత్సవములలోను వారిని తమకు నౌకరులుగ నుపయోగించుకొనుచు, ఏనుగులు, గుఱ్ఱములు, పల్లకీలు, డోలీలు, మున్నగు వానిని పోగుజేసి బ్యాండుమేళములనుగూడ సంపాదించి వీటన్నిటితో పెద్దపెద్ద ఊరేగింపులు, ఉత్సవములు, జరిపించవలె ననియే వారల ప్రధానాభిలాష. ఇట్టిప్రాపంచిక వాంఛలు, ఈర్ష్యలు గలవారు నిజముగ బ్రహ్మజ్ఞానులగుదురా యనువిషయము బాగుగనాలోచించవల యును- పైవిధముగుకోరికలు సఫలమైనపుడు వారు మహానందభరితులై ఇతరులను అహంకారముతో హేళనచేయుచు తమ్ముతాము మహాత్ములు, పండితులు, విద్యావంతులు, మహంతులనియు చెప్పుకొనుచుందురు. ఇంతియ కాక వారు గృహస్థుల సహాయముతో నుత్సవములను జరిగించుచు, నందు మూలమున నితరులకంటె తమయాధిక్యమును ప్రకటపర్చుకొని పేరుప్రతిష్ఠ లను సంపాదింపగోరుచుందురు. వీరు మానాభిమానములు, అహంకారము తోను మైనుఅచిపోయి తిరిగి యీవలకురాలేనంతగట్టిగా మనోమాయల జాలములో చిక్కువడిపోయిరి. ఎవరైనను వారి యజ్ఞానమును వారికి తెలియ జెప్పినచో వారు క్రుద్ధులై ఎమటివానిని నాస్తికుడనియు, భక్తిహీనుడనియు, ననేకవిధముల దూషించి కలహింతురు.

60. పైనసూచించిన జ్ఞానులకును, తీర్థయాత్రలు, విగ్రహపూజలు, జరుపువారికిని ఏమైన వ్యత్యాసమున్నదేమో శ్రద్ధగా ఆలోచించుడు. నిజము నకు వీరిరువురిలో తీర్థయాత్రలు, విగ్రహపూజలు చేయువారే మెఱుగని చెప్పవలసియుండును. వీ రజ్ఞానముతో నట్లుచేయుచుండుటచే నెవరైనను బోధ చేసినపుడు, తమతప్పును తెలిసికొని దిద్దుకొనగలరు. కాని జ్ఞానులమనుకొనెడి వారు బుద్ధిపూర్వకముగ మాయికప్రవృత్తిలో లగ్నమగుటచే వారు తప్పును తెల్పెడివానినే మూర్ఖుడనియు, ఈర్ష్యాగ్రస్తుడనియు, తూలనాడి వానిమాటను త్రోసిపుచ్చుదురు. ఈయిరుతెగలవారి పొరపాటునకును కారణము, వారికి పరిపూర్ణసద్గురువు లభింపకపోవుటయే. పరిపూర్ణసద్గురువు లభించియుండినచో నాసద్గురువు భక్తిమార్గమునుపదేశించి వారిచే సురత్ శబ్దయోగాభ్యాసమును జేయించియుందురు. అప్పుడు ఆధ్యాత్మిక రహస్యమంతయు వారికి పూర్తిగ

విశదమైయుండెడిది. అనగా, వారికి మొట్టమొదట చిత్తశుద్ధియు, నిర్మల భక్తియు గలిగి పిమ్మట భగవత్స్వరూప సాంతర్యమున లభించి, ఆ దర్శనానందమును వారు పొందియుండెడివారు. అప్పుడు వారిని, ఈమృత్యులోకములోని భోగముల నిమిత్తమైన ఆశలును, వాంఛలును ఆకర్షింపలేకుండును. వారు ప్రస్తుతమున నెట్లు జగడములలోను, వాదవివాదములలోను చిక్కుకొనియున్నట్లు కన్పట్టుచున్నారో అట్లు చిక్కుకొనియుండక నుందురు.

61. ఇట్టి వాచకజ్ఞానుల సహవాసము చేయుచుండెడి గృహస్థుల పరిస్థితి గూడ నిదేతీరున నున్నది. వారు బ్రహ్మస్వరూపులమని ముఖోక్తిగా జెప్పికొనుచుందురేగాని వారి జీవితవిధానమును ప్రవర్తనను పరికించిచూడగా, మామూలు ప్రాపంచికజీవులకంటె వారెవ్విధముగను శ్రేష్ఠముగనుండకపోవుటయేగాక, తమబుద్ధికౌశల్యమునుగురించి అహంకారపూరితులైయుండుచున్నారు. ఈ యహంకారమే సమస్తపాపములకును మూలము. అహంకారము కలుగు ప్రతివాడును పతితుడగును. కావున నిట్టిగృహస్థులును, వారికి గురువులుగ నుండిన పండితులు, వేషధారులును, ఈ యిరుతెగలవారునుగూడ కాలుడు కర్మలయొక్కయు, మాయయొక్కయు చక్రములో చిక్కుకొనిపోయి తమతమ కర్మఫలితములను భవిష్యములో ననుభవించగలరు. వారి కీపద్ధతి నెన్నటికిని ముక్తి అనగా, ఉద్ధారము లభింపనేరదు.

62. ఇక్కాలమున విద్యాభివృద్ధి విశేషముగనుండుటచే ప్రజలలో జ్ఞానాభివృద్ధియై అందరును బహిర్ముఖపూజలను వ్యర్థములు తుచ్ఛములుగ నెంచుచున్నారు. అవన్నియు కేవలము బూటకములనుటలో సందేహముగూడ లేదు. వానివలన లాభముగూడ నెంతమాత్రములేదు. కాని వారికి శరీర మనస్సులకు వత్తిడిని శ్రమను కలిగించెడి అభ్యాసములను, ఉపాసనలను తెలిసికొనవలెనను నాసక్తియులేదు, సహనశక్తియులేదు. అందుచే అన్నిమతముల లోని విద్యావంతులును జ్ఞానమార్గమునే అవలంబించి, దానియందే విశ్వాసముపహించుకొనుచు, వాచకజ్ఞానులు, సూఫీలు, బ్రహ్మజ్ఞానులుగను తయారై పోవుచున్నారు; కాని, తనయథార్థస్థితిని వారు స్వయముగను తెలిసికొనలేకున్నారు, మఱెవరిచేగూడ పరిశీలింపబడనొల్లకున్నారు. పైగా, ఇతరులందఱిని గూడ వారు తమవిద్యాబుద్ధుల కుశలతమూలమున, యుక్తియుక్తమైన వాదములతో తమతో సహమతమగునట్లు చేసికొనుటకు సిద్ధపడుచున్నారు. కామ, క్రోధ, లోభ, మోహ, అహంకారములు గల్గియున్నంతకాలము మానవుడు

పూర్ణబ్రహ్మగతిని పొందుట యెట్లుసాధ్యమగును ? ఈవిషయము గాఢముగ యోచించదగియున్నది. బ్రహ్మజ్ఞాన మనగా కొన్నిగ్రంథములను చదివి అవగాహనచేసికొనుటయే అయినచో అట్టిబ్రహ్మజ్ఞానములో కష్టమేమున్నది ? కొంతవఱకు విద్యాబుద్ధులుగల ప్రతిమానవుడును జ్ఞానగ్రంథములను చదువుకొనవచ్చును. కాని, ఇంద్రియమనస్సుల నిగ్రహించుకొనుటయు, చిత్తశుద్ధిని సంపాదించుటయు, వేఱువిషయములు. ఎవనికిగూడ నవి యోగాభ్యాసము చేయనిదే లభ్యముకానేరవు.

63. ఈజ్ఞానులను కొద్దిసేపు అభ్యాసములో కూర్చుండి తమ ఆత్మస్వరూపమును ధ్యానముచేసి చూసికొననిండు. వారిచంచలమనస్సు వారికి అభ్యాసమెంతమాత్రము సాగనీయదు. వారు సురత్‌శబ్దయోగాభ్యాసమును సంతులయుపదేశానుసారము చేసియుండినచో వారికి తమపరిస్థితి బోధపడి తమమనస్సు ఎంతచంచలమైనదో తెలిసియుండును. కాని వారికి సురత్‌శబ్దయోగాభ్యాసమునుగుఱించి యేమియు తెలియను తెలియదు, వారి కాయోగాభ్యాసముచేయు గోరికకూడ లేదు. పైగా అట్టియభ్యాసము అవసరమనిగూడ వారంగీకరించరు. వీరిలో కొందఱు గ్రంథములలో చదివిన విషయములపై మననముచేయుటయు, తాము మనస్సుకాదనియు, శరీరముకాదనియు, నింద్రియములుకాదనియు, పదార్థముకాదనియు, తాము మాయనుండివేఱనియు, జన్మరహితులనియు, బంధనరహితులనియు, నింకను, ఇట్టివారు, అట్టివారనియు అనేకవిధములుగ భావనచేసికొని తమ్ము తాము సర్వవిషయములనుండి వేఱైపోయినట్లెంచుకొనుటయే ఆధ్యాత్మిక అభ్యాసము అని నిర్ణయించుకొనుచున్నారు, ఆ మననమునే అభ్యాసముగ వారు విశ్వసించి అందువలన గలిగెడి కొద్ది మనశ్శాంతిని, ఆత్మానందముక్రింద భావించుకొనుచున్నారు. షేక్‌చిల్లీ[1] యనునాతడు తానొకదేశమునకు చక్రవర్తిననియు, తనకు పెద్దపెద్ద రాజభవనములు, పరివారము సైన్యములు నున్నవనియు, తాను మహాశోభాయమానముగ నున్నవాడనియు మనమున నూహాకల్పితముగ సంతోషించుచున్నపు డతనికిగూడ నిట్టి యానందమే గలిగియుండెను. కాని కన్నులు తెఱవగనే అతనికా వైభవములన్నియు మాయమైపోయెను.

64. బాగుగ నాలోచించినచో నీజ్ఞానుల పరిస్థితిగూడ సరిగ షేక్‌చిల్లీ వంటిదే యని బోధపడగలదు. ఏలనన, వీరుగూడ తమ్ము బ్రహ్మస్వరూపు

1. షేక్‌చిల్లీ యను వాడొక కథలో చెప్పబడిన పరమమూర్ఖుడు.

లుగను, సచ్చిదానందమూర్తులుగను చెప్పుకొనుచు నేయుందురు కాని, యెవ్వరైనను వారిని నిందించినను, ఆక్షేపించినను వెంటనే వారు క్రోధపూరితులై పోవుదురు. అటులనే ఏదైన ఆకర్షణీయపదార్థమునుగుఱించి విన్నను, చూచినను వారు తోడనే దానిని పొంది ఆనందించవలెనను కోరికతో నిండిపోవుదురు. ఎవరైనను వారిని పొగడినచో వారు ఆనందమగ్నులై అట్టివానియందభిమానము జూపుదురు. లేక ఎవరైనను వారినిగుఱించి అప్రియములు పలికినచో వారియందప్రసన్నులై వానితో విరోధమువహించి, దెబ్బలాడుటకు సిద్ధపడుదురు. వారి మనస్సు చంచలమగుటచే వారెన్నడు నొకస్థలములోగాని స్థానములోగాని స్థిరముగ నుండలేరు. వారు నిజముగ బ్రహ్మానందమునే పొందియుండినచో, నిట్లు దేశద్రిమ్మరులై పలుదేశములలో తిరుగుచు, వివిధస్థలములలో వినోదములనుచూచుటకై ప్రతిసామాన్యునివద్దనుండియు ముష్టినెత్తుకొనుచు, పుణ్యక్షేత్రములలోను, దేవాలయములలోను, బాహ్యకర్మపరాయణులతో సమానముగా తిరుగుపరిస్థితిలో నుందురా ? కడుబీదవానికెవనికైనను మూడు, నాలుగువేలరూప్యములు లభించినచో నతడాధనముతో నొకచోట వర్తకముచేసికొనుచు నచ్చటనే సుఖముగ కదలకుండ నుండిపోవును, అట్లే యెవనికైన నుద్యోగము లభించినచో నత డుద్యోగాన్వేషణార్థము మఱెచ్చటికిని పోకుండ, నేభయము, బెంగయులేకుండ సుఖముగ నచ్చటనే యుండిపోవును, అట్టిపరిస్థితిలో తమ్ము బ్రహ్మస్వరూపులుగను, ఆత్మస్వరూపులుగను సాటించుకొనుచుండియు, తీర్థములు, వినోదములు చూచుటకనియు, తోటలు, భవనములు నిర్మించుటకనియు, దేశదేశాంతరముల పర్యటనములు మానివేసి మూడు నాలుగు సంవత్సరములపాటైన నాంతర్యానంద మనుభవించుచు నొకచోట స్థిరముగ నుండగల్గునంతమాత్రపు బ్రహ్మానందము లేక ఆత్మానందమునైన నెరుగని వీ రెట్టి బ్రహ్మజ్ఞానులో బోధపడుటలేదు. వారిపరిస్థితినిబట్టి చూడగా, వారిజ్ఞానమనునది విద్యారూపమైనజ్ఞానము, లేక పైపైమాటలజ్ఞానమే కాని, నిజమైన జ్ఞానముకాదనియు, వారిచే మహామహిమగలదని యెంతో అధికముగ శ్లాఘింపబడు ఆత్మానందము లేక బ్రహ్మానందము వారి కించుకయైన లభింపలేదనియు, విస్పష్టమగుచున్నది.

65. బ్రహ్మయొక్క సాక్షాద్దర్శనమే నిజమైన జ్ఞానమని పేర్కొనబడును. ఆ బ్రహ్మయొక్క దర్శనానందము లభించినచో దానియెదుట గృహస్థాశ్రమమేకాదు, సప్తదేశముల రాజ్యముగూడ నెందుకుచాలదు. సంతులమతానుసారము ఈశ్వరుని లక్ష్యస్వరూపమునకు బ్రహ్మ అనిపేరు. ఈ లక్ష్య

స్వరూపమే మాయా సబలరూపము, అనగా మాయతోకలిసిన బ్రహ్మస్వరూపము. కాని, వేదాంతు లీలక్ష్యస్వరూపమునే శుద్ధబ్రహ్మగ జెప్పి వాచ్యస్వరూపియైన ఈశ్వరరూపమును, మాయాసబలమని, అనగా మాయతోకూడిన దానినిగ జెప్పుదురు. కాని, ఈ రూపద్వయమున కతీతులైన సంతులు బ్రహ్మయొక్క వాచ్యలక్ష్యస్వరూపములను రెండింటినిగూడ మాయాసబలమనియే చెప్పుదురు. అనగా, రెండురూపములలోగూడ మాయామిశ్రమముండి, వాచ్యస్వరూపములో మాయ ప్రకటముగను, లక్ష్యస్వరూపములో నతిసూక్ష్మరూపమున గుప్తముగను ఉన్నదని సెలవిచ్చుచున్నారు.

66. ఉత్తమశ్రేణికి చెందినట్టి అవతారములన్నియును, క్రిందిశ్రేణికి చెందినట్టి అవతారములు, ప్రవక్తలు, దేవతలందఱును, యోగీశ్వరజ్ఞానులును, బ్రహ్మయొక్క లక్ష్యరూపమునుండిగాని, వాచ్యరూపమునుండిగాని బయల్వెడలినవారని గమనించదగును. అందుచే బ్రహ్మయొక్క వాచ్యస్వరూపమునకు ఉపాసకులును, లక్ష్యస్వరూపముయొక్క జ్ఞానులును, అయినవారందఱును కాలునియొక్కయు, మాయయొక్కయు ఆవరణలను దాటివెళ్ళలేదు. కావున, వారెవరును జన్మమరణములనుండి తప్పించుకొనలేరు.

67. సంతసద్గురువు ఉపదేశించుమార్గము ఉన్నతోన్నతమైనది. వారు బ్రహ్మ, పరబ్రహ్మలకు పైనున్న నిజమైన పూర్ణసర్వేశ్వరుడగు సత్యపురుష రాధాస్వామీవారి ఉపాసనను ఉపదేశింతురు. కావున, జీవులు ఆ ఉపాసన వలన మాయాదేశము నతిక్రమించి పైకిపోగలరు. సున్నలోకము, అనగా, దశమద్వారమువఱకు సిద్ధిపొందిన పురుషునే పూర్ణమైనసాధువు అని పేర్కొనదగును. అట్టిసాధువే యోగీశ్వరజ్ఞాని. ఈస్థానమునకు క్రిందనున్న వారు పరిపూర్ణసాధుపదవి నొందలేదు. కావున, సంపూర్ణమైన ఉద్ధారము కావలెనని కోరునట్టి ప్రతిమానవుడును సంతులయుపదేశానుసారము సత్యపురుష రాధాస్వామీవారిని ఇష్టదైవముగ నవలంబించవలయును. సాక్షాత్తు పరమపురుషుడే స్వయముగ నీ రాధాస్వామీనామమును జగమున ప్రకటముచేసెను. ఈ నామముయొక్క ఆధ్యాత్మికరహస్యము నెవరైన దెలిసికొని రాధాస్వామీవారి శరణ్యము నొంది సంతులుపదేశించినరీతిని ఈనామము నాంతర్యమున జపించినను లేక అంతర్యమున నీనామధ్వనిని శ్రవణముచేసినను అట్టివానికి నిస్సంశయముగ నుద్ధారమగును. మరియు కొద్దిరోజు లీయభ్యాసముచేసినపిమ్మట నభ్యాసికి తద్విషయమునుగుఱించి ప్రమాణములు తనయాంతర్యముననే లభించగలవు.

68. సమస్తావతారములు, యోగీశ్వరజ్ఞానులు, ప్రవక్తలు, యోగులు, జ్ఞానులు మున్నగువారందఱును దశమద్వారస్థానమునుండికాని, త్రికుటినుండి కాని, లేదా, సహస్రదళకమలమునుండికాని, వచ్చిరనియు, చతుర్వేదములును త్రికుటిలోకములో ప్రణవనాదమునుండి ప్రకటమైనవనియు, బ్రహ్మ, విష్ణు, మహాదేవులవంటి దేవతలు సహస్రదళకమలముకంటె క్రిందిలోకములకు జెందిన వారనియు పైన వివరింపబడినది. అందుచే వీరందఱును సంతులయొక్కయు, సత్యపురుషునియొక్కయు స్థానమునకు దిగువవారు. అనగా, వీరందఱికంటెను సంతులపదవి ఉన్నతమైనది. వీరందఱును సంతుల కధీనులును, సంతులొక్క సత్యపురుష రాధాస్వామీవారికే అధీనులునైయున్నారు. ఈ కారణముచేతనే సంతులయొక్కయు, ఫకీరులయొక్కయు గ్రంథములు, వచనములును, వేద శాస్త్రపురాణములకంటెను, ఖురానుకంటెను గొప్పవి, అనగా, ఉచ్చతమ మైనవి. వేదములు, ఖురాను, పురాణములును, ప్రాపంచికజీవుల ప్రవర్తనను చక్కబఱచు నిమిత్తమేర్పడిన ధర్మసూత్రములవంటివి. వీని ముఖ్యోద్దేశ్యము ప్రవృత్తిమార్గమే, అనగా నైహికవిషయముల పాలన పోషణమాత్రమే. నివృత్తిమార్గమునుగుఱించి, ఈగ్రంథములలో చాల తక్కువగనుండును. సంతుల పవిత్రగ్రంథములలోను, వచనములలోను, ముఖ్యబోధ నివృత్తి మార్గము, అనగా జీవోద్ధారమునుగుఱించిన విషయములు. అందువలననే సంతుల గ్రంథములును, వచనములును సమస్తమతగ్రంథములకంటెను శ్రేష్ఠ తరమైనవి. సంతుల మహాత్మ్యమిదియే. ఏలనన, త్రిగుణములును, పంచతత్వ ములును ఏస్థానమునుండి యుత్పన్నమైనవో, మఱియు మాయ అనగా స్థూల సృష్టిగూడ నెచ్చటినుండి ప్రకటమైనదో, ఆస్థానమునుండియే వేదములును, తదితర మతగ్రంథములునుగూడ ప్రకటమాయెను; కాని సంతుమహాత్ముల వచనములు మాయయొక్క రూపురేఖలుగూడ లేనట్టి ఉత్తమస్థానమునుండి ప్రకటమైనవి. అందువలననే సంతులవచనములు కేవలము నివృత్తిమార్గమును గుఱించిచెప్పును, కాని వేదములు మున్నగుగ్రంథములు, నివృత్తి, ప్రవృత్తి మార్గములు రెండింటినిగుఱించిచెప్పుచు నందులో ప్రవృత్తినిగుఱించి యధిక ముగ వర్ణించుచున్నవి. ఎట్లనగా, వేదములలో కర్మకాండకు సంబంధించిన శ్లోకములు 80,000 గలవు. ఇవన్నియు ప్రవృత్తిమార్గమే. ఇంక ఉపాసనాకాండ 16000 శ్లోకములును జ్ఞానకాండకు అనగా, నివృత్తికి సంబంధించినవి 4000 శ్లోక ములు మాత్రమేగలవు. ఖురాను మున్నగు పవిత్రగ్రంథములన్నిటిలోగూడ నించుమించు ఇదేరీతిగనున్నది. వానిలోని విషయములు చాలవరకు చరిత్రా

త్మకములే, కాని ఆధ్యాత్మికసాధనాపద్ధతులను గుఱించినవియు, భగవంతుని తెలిసికొను పద్ధతులకు సంబంధించినవియు చాలతక్కువ. భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడే స్వయముగ నర్జునునకు వేదములు త్రిగుణములకు సంబంధించినవనియు, నందుచే వేదముల నతిక్రమించి పైస్థానమునకు వెళ్ళుమనియు, బోధించెను :-

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున.

అర్థము:- ఓ అర్జునుడా! వేదములు త్రిగుణములకును సంబంధించినవి. నీవు త్రిగుణముల నతిక్రమించుము. అదియునుగాక, ఎవరైనను వర్ణాశ్రమములకు సంబంధించిన ధర్మములలోను, కర్మలలోను, అనగా ఉపాసనాకాండలో చిక్కుకొనియున్నంతకాలము అతడు వేదములకు దాసుడనియు, మాయయొక్కయు, త్రిగుణములయొక్కయు, హద్దులనుండి యావలికి దాటిపోయినపుడు వేదములతని కాలిక్రిందకు వచ్చుననియు, అనగా వేదకర్త కతడే కర్తయై వేదవిధులకన్న నతని యుపదేశములే యెక్కువ గౌరవనీయము లగుననియు చెప్పబడియున్నది. అందుకే క్రిందిశ్లోకము ప్రమాణము :—

వర్ణాశ్రమాభిమానేన శ్రుతిదాసో భవేన్నరః ।
వర్ణాశ్రమవిహీనస్య పాదోథ శ్రుతిమూర్ధని ॥

అర్థము :— వర్ణాశ్రమములయందు అభిమానముగల మానవుడు వేద దాసుడగును. వర్ణాశ్రమముల నధిగమించినవాని పాదము వేదముల తలపై నుండును.

ఇదేతీరున, మహమ్మదీయులలో పరిపూర్ణులైన ఫకీర్లు ఖురానులోని ఆదేశములకు బద్ధులుకారు. పైగా వారిఆజ్ఞలే ఖురాను ఆదేశములకంటెను శ్రేష్ఠతరములుగ నెంచబడును.

69. పై విషయములు సంతులచే, అనగా, సత్యలోకమునుచేరి పూర్ణ సర్వేశ్వరునితో నైక్యముపొందిన పరిపూర్ణనిజభక్తులచే సెలవివ్వబడినవి. అనంతత్రిలోకీ[1]లును, అసంఖ్యాక బ్రహ్మాండములును, తిరిగి ఒక్కొక్క బ్రహ్మాండములో వేలువేలుగా బ్రహ్మ, ఈశ్వరుడు[2] మాయయు, శక్తియు (అనగా ప్రపంచికజీవుల దేవతయు వారిశక్తియు) అసంఖ్యాకములగు నవతార

1. పిండదేశము, అండదేశము, బ్రహ్మాండమునుకలిసి త్రిలోకీయని పేర్కొనబడును.
2. ఇచ్చట ఈశ్వరుడు అనగా త్రికుటియొక్క అధిపతియని అర్థము.

ములును, అసంఖ్యాకులగు బ్రహ్మ విష్ణు మహాదేవులును, దేవతలును, ప్రవక్త లును, ఔలియా[1]లును, అంబియా[2]లును, కుతుబులు[3], దేవదూతలు, యోగీశ్వరులు, జ్ఞానులు, ఋషీశ్వరులు, మునీశ్వరులు, సిద్ధులు, యోగులు, ఇంద్రులు గంధర్వులు, అపరిమితసంఖ్యలుగా సత్యలోకమునకు క్రిందనున్నట్లు సంతులు సత్యలోకములోనుండి తిలకించుచున్నారు. అంత మహామహిమగల సంతులకు పైనచెప్పినవారివైపు చూచుటకుగాని, వారి యాజ్ఞల పాలించుటకుగాని యవసరమేమి? ప్రతిత్రిలోకీకి నొక యధిష్ఠానదైవముగలడు. ఆయనను బ్రహ్మ, లేక ఈశ్వరుడు అనగా మాయాసబలబ్రహ్మ యని చెప్పుదురు. ఆయన స్థానములు త్రికుటియు, సహస్రదళకమలమును. ఇట్టి బ్రహ్మలును, ఈశ్వరులును. అనంతసంఖ్యాకులుగ పరమపదముచే అనగా, సత్యపురుష రాధాస్వామీ దయాళునిచే సృజింపబడిరి. సంతులొక్కరే యీపరమపదమును చేరియున్నారు కాని మరెవరికిని అట్టి అర్హతాసామర్థ్యములులేవు. అయినను సంతులయందు పూర్ణవిశ్వాసముగల్గి, వారియందు భక్తిప్రేమలతో వారి సత్సంగముచేసికొను వారినిగూడ, సంతులు మహాకటాక్షముతో కాలుని జాలమునుండి తప్పించి, సత్యపురుష రాధాస్వామీవారి చరణములయందు చేర్పించుదురు.

---

1. ఔలియా అను పదము 'వలీ' అను పదమునకు బహువచనము. భగవత్సాన్నిధ్యము పొందిన మహాపురుషుని 'వలీ'యని పేర్కొందురు.

2. అంబియాలు అనువారొకతెగ ఫకీర్లు.

3. కుతుబులు, సృష్టిలో పాలనపోషణకార్యము జరిగించు నిమిత్తమై నియమించబడిన ఒకతెగ ఫకీర్లు.



రాధాస్వామీ దయాల్‌కీ దయా
రాధాస్వామీ సహాయ్.

# సార బచన్

పరమపురుషపూర్ణధనీ రాధాస్వామీసాహబ్ వారు సత్సంగసమయములో తమపవిత్రముఖకమలమునుండి సెలవిచ్చిన మహోపదేశములలోనుండి సత్సంగుల పథప్రదర్శనము నిమిత్తమై యెత్తివ్రాయబడిన కొన్ని మహా వచనములు.

1. గ్రంథసాహబ్[1]లో పదేపదే ప్రతిశబ్దము[2]లోను సద్గురువు నన్వేషించుకొనవలెనని లిఖితమైయున్నది. కాని, శోచనీయవిషయ మేమన, నెవరును సద్గురువుకొఱకై యన్వేషణచేయుటలేదు. అందఱును పవిత్రగ్రంథ పారాయణలోను, తీర్థయాత్రలలోను కాలమును వ్యర్థపుచ్చుకొనుచున్నారు.

2. మొట్టమొదట సద్గురువునెడల భక్తిచేయుట ప్రధానమగు కర్తవ్యము. అట్టి భక్తిస్వభావముగలవానికి ఒకనాటికి సమస్తము లభించగలదు. సద్గురువునందు భక్తిలేకుండ నెవరైనను సత్యపురుషునికొఱకును, సత్యనామము కొఱకు నన్వేషించినయెడల వారికేమియు లభించనేరదు. సద్గురుభక్తియే ప్రధానమైనది. అది సమస్త బంధనములనుండియు విముక్తిని కలుగజేయును.

3. కామక్రోధాదులన్నియు తమవశములోనికి వచ్చినవా లేదా యను విషయమును ఎవరికివారు లోలోపల నెల్లపుడు పరిశీలించుకొనుచుండవలెను. అట్లు వశములోనికి రాకుండినచో తన యభ్యాసమును మానకుండ చేసికొనుచునే యుండి ఎవరితోను వాదవివాదములు పెట్టుకొనక నుండవలెను. ఈ యుపదేశము నెల్లపుడు జ్ఞాపకముంచుకొనవలెను.

4. తమకు సేవకులతోగల సాంగత్యము పరమార్థప్రధానమైనదనియు, మనోవికారలక్షణములలో ప్రవర్తించువారితో తమకెట్టి సంబంధము నుండజాలదనియు సద్గురువు సెలవిచ్చుచున్నారు.

---

1. సిక్కుల పవిత్రగ్రంథమును గ్రంథసాహబ్ అందురు.

2. శబ్దము అనగా, పద్యము. గ్రంథసాహబ్‌లోని పవిత్రపద్యములను శబ్దములు అందురు.

౫. కర్మ, ఉపాసన, జ్ఞానము, విజ్ఞానము ననెడి నాల్గుసాధనలు మానవు నకు సాధించదగినవి. కాని సద్గురుసహాయము లేనిదే వీనిలో నొక్కటిగూడ సాధింపశక్యముగాదు. పరిపూర్ణ సద్గురువు లభించినచో వారి నాలుగింటిలో శిష్యుని యధికారమునుబట్టి యతని కర్హతగలసాధననే అభ్యాసము చేయించుదురు. బూటకపుగురువు అట్లుగాక, శిష్యుని యిష్టానుసారముగ ఉపదేశము చేయును. దీనివలన శిష్యున కేమియు లాభముండదు, సరిగదా, నష్టమేగల్గును. ఏలనన, నతడు మరెచ్చటికైన పోయికూడ బాగుపడకుండ నుండిపోవును.

6. కబీరుసాహెబ్ వారు బ్రహ్మకు సత్యపురుషునిగురించి తెలియజెప్పినపుడు, బ్రహ్మ సత్యపురుషుని పొందునిమిత్తమై ప్రయత్నము చేయగోరెను. కాని, కాలుడు[1] బ్రహ్మను మోసపుచ్చి ఆయన మనస్సు మార్చివేసెను. అట్టి స్థితిలో సామాన్యుడైన అల్పజీవుడు సత్యపురుషుని పొందగోరినను, సద్గురువు సహాయములేనిదే అతని ప్రయత్నము లెట్లు కొనసాగగలవు ?

7. ఆధ్యాత్మికానుభవములు పొందు నధికారముగల భక్తులకు అట్టి యనుభవములు గలుగగలవను విషయము సత్యమే. కాని అట్టి యనుభవములను పొందుటకు అధికారము గల్గునంతటి భక్తిగల జీవులే కానవచ్చుటలేదు. జీవులు చేసెడి భక్తికార్యములన్నియు కేవలము అనుకరణరూపములు. అయినను అందు విషయమై చింతింపబనిలేదు. ప్రస్తుతకాలములో మాజ్[2] అనగా భగవదేచ్ఛ, జీవులందఱకు నర్హతతో నిమిత్తములేకుండగనే యుద్ధారమిచ్చుటకై యున్నది.

8. శరణాగతికైనను, యోగాభ్యాసమునకైనను, అనగా ఈరెండింటిలో నేది జయప్రదముగా జరుగవలెనన్నను, భక్తి యత్యావశ్యకము. భక్తి లేనిదే యీరెండు నసాధ్యములే.

9. క్షీరమందు ఘృతమును, వంటచెఱకునం దగ్నియును ఉన్నవికాని, అవి ప్రకటరూపమును దాల్చువరకు, పాలు ఘృతముపనినిగాని, వంటచెఱకు

1, సంతుల పరిభాషలో కాలుడనగా పరబ్రహ్మ. భగవద్గీతలోను అధర్వవేదములోగూడ నదే అర్థములో కాలశబ్దము వాడబడినది.

2. మాజ్ అనగా, శబ్దార్థము సముద్రతరంగము వంటి తరంగము. భగవంతునిలో అనగా నిర్మలచైతన్యసముద్రములో గలిగెడి కించిచ్చలనమువలన నిర్మలచైతన్యమండలములలోనే గాక, పిండబ్రహ్మాండములలోగూడ అద్భుతపరిమాణములో మార్పులుగలుగును. ఆచలనమునే భగవదేచ్ఛ లేక మాజ్ అని అందురు.

కప్పువనినిగాని నెఱవేర్చలేవు. అటులనే మానవునిలో బ్రహ్మపదార్థమున్నది కాని ఆ బ్రహ్మ తనలో ప్రకటరూపము దాల్చునంతవరకు నెవరైనను, తానే బ్రహ్మయని చెప్పుకొనుట పొరపాటు.

10. ప్రధానవిషయము సద్గురుభక్తి. అది లేనిదే యేమియు లభింప నేరదు. ప్రతిమానవుడును గురుచరణములయందు పరిపూర్ణమైన యథార్థ భక్తిని సంపాదించుటకు చేతనైనంతగట్టిగా ప్రయత్నించవలయును.

11. పుష్పమున సుగంధమున్నట్లే నీలో భగవంతుడున్నాడు. పుష్పము కంటికగుపించునుగాని, సువాసన యదృశ్యముగనుండును. నాసికేంద్రియమున్న వారే సువాసనను తెలిసికొనగలరు. అదేవిధముగా, గురుజ్ఞానముగలవారే, అనగా గురువును గుర్తుపట్టగలశక్తిగలవారే తమలోనున్న భగవత్స్వరూప మును తెలిసికొనగలరు.

12. సత్సంగులు సామాన్యముగచేసెడి భజనాభ్యాసము తెలికలివాని యెద్దు గానుగచుట్టు తిరిగినట్లే యుండును. గానుగయెద్దు రోజంతయు గానుగ చుట్టు తిరిగినప్పటికి; నది యిల్లుదాటి బయటకువెళ్లకుండగనే యుండియు, తాను ఇంటనుండి పండ్రెండుకోసుల దూరమైనను వెళ్లియుండునని గర్వపడును. అటులనే మానవునిలోని మనస్సనెడి యెద్దుకూడ భజనాభ్యాసములో కూర్చుం డునుగాని యూర్ధ్వమండలముల కారోహింపనేరదు. దానివలన తాను రెండు గంటలసేపు భజనాభ్యాసము చేసితినసెడి అహంకారముమాత్రము గల్గును కాని, అభ్యాసముయొక్క ఆనందమేమియు నుండదు. అభ్యాసముయొక్క ఆనందమే గల్గినచో అహంకారము గలుగుటకు సావకాశముండదు. త్రికుటి స్థానముదాటి, పైకివెళ్లువఱకు నభ్యాసికి నిర్మలానందము లభించనేరదు.

13. జీవులందఱకును భక్తిచేయుట కధికారముగలదు. కాని, అందుకు కూడ వారికి సంపూర్ణమైన అధికారములేదు. అయినను భక్తిచేయుటలో ప్రమాదమేమియు నుండదు. భగవంతునకు భక్తియొకటియు తప్ప మఱెద్దియు నిష్టములేదు. అదికూడ సద్గురువునకుచేసిన భక్తియేకాని, మఱెవ్వరిభక్తి యన్నను భగవంతునికిష్టములేదు.

14 ఒంటెలను నడుపువాడొక్క యొంటెయొక్క ముక్కుత్రాడును మాత్రమే తనచేతిలో నుంచుకొనును. కాని దానివెనుక వేనవేలు ఒంటెలు బ్లకద్దానివెనుక నింకొకటివొప్పున నడచిపోవుచుండును. అదేవిధముగ గురు

ముఖుడొక్కడే[1] యుండినను గాని అతని మూలమున ననేకజీవుల కుద్ధారము చేకూరును.

15. సత్సంగము పరుసవేది[2] వంటిది. పరుసవేదికి ఇనుము తగిలినంతనే అది యెట్లు బంగారముగా మాఱిపోవునో, అట్లే సత్సంగములో నిజమైన ఆసక్తితో జేరినవాడు బంగారముగ మాఱిపోవును. (అనగా ఉత్తమగతిని పొందును). హృదయపూర్వకముగ సత్సంగములో పాల్గొననిచో, అనగా కపటముగ నెవరైన ప్రవర్తించినచో నతఁడు మాత్రము లోహముగనే యుండి పోవును. సత్సంగ మెప్పటికిని పరుసవేదియే.

16. కొందఱు సత్సంగులు సత్సంగసేవ చేయుసమయములో నొండొరులపై చాల కోపగ్రస్తులై పోవుదురు. అది యుక్తముకాదు. ఏపనినైన జేయునపుడు విఘ్నములు గల్గినచో కోపగ్రస్తులై పోవుట ప్రాపంచికజీవుల స్వభావము. సత్సంగికిగూడ నట్లే ప్రవర్తించు స్వభావమున్నయెడల నతడుకూడ ప్రాపంచికజీవులవంటివాడే యగును. ఇరువురిలోను వ్యత్యాసమే యుండదు. సత్సంగికి క్షమాశక్తి యుండుట యుచితము. క్రోధము కాలునిజాలము. దానిని మనస్సులో ప్రవేశించనీయకూడదు. ఎవరైన నొకప్పుడు మొండితనముతో ప్రవర్తించినను రెండవవారు ఓరిమి చూపవలయును.

17. ఏదైన విషయమును వినుటయు, అవగాహనచేసికొనుటయు సులభమే. ఏలనన, పైనుంచి వినవచ్చును, అవగాహనగూడ చేసికొనవచ్చును. కాని, అది ఆంతర్యమున నిముడకపోయినచో నా వినుటయు, గ్రహించుటయు వ్యర్థము. ఎవనికైన నొకవిషయ మాంతర్యమున నిమిడినయెడల నతనిప్రవర్తన గూడ నవ్విధముగనే మాఱిపోవును. తనలో నేది యిమిడియుండునో, అదియే బయటకుగూడ వచ్చుననుట యొక నిశ్చిత నియమము. సత్సంగులెల్లపుడు తమ మనస్సున నీ విషయమును జ్ఞాపకముంచుకొనుటత్యవసరము. వారట్లే జ్ఞాపకమునుంచుకొనుచునే యుందురు. ఏలనన, సత్సంగులు తమప్రభువైన సద్గురువు నెల్లప్పుడు శిరసావహించుదురు. తమప్రభువైన సద్గురువు నట్లు శిరసావహించనిచో నీ విచక్షణజ్ఞాన మెల్లపుడు నిలబడనేరదు. అనగా, అట్టిరక్షకహస్తము

---

1. సద్గురుని యిష్టమే ప్రధానముగ చేసికొని నడచుకొనువారిని గురుముఖులనియు, తమ మనస్సున కిష్టమెట్లో అదే ప్రధానముగ జేసికొని ప్రవర్తించువారిని మనముఖులనియు పేర్కొందురు.

2. పరుసవేది, లేక స్పర్శవేది అనగా లోహమును అదితాకినచో లోహమును బంగారముగా మార్చివేయుశక్తిగల యొక మూలిక.

పై నట్లేనిచో నీకట్టి పైన మనస్సు వివేచనను లోనికెన్నడు ప్రవేశించనీయదు. అందువలన ప్రతిసత్సంగియు ననుక్షణము సద్గురువును, శబ్దమును అంతర్యమున శిరసావహించి యుంచుకొనవలయును. ఇదెన్నడును మఱచిపోకూడదు.

18. జీవులందఱకును జన్మానుజన్మలనుండి ప్రాపంచికవిషయములయం దెట్లు ఆసక్తి యుండుచువచ్చెనో, పరమార్థవిషయములోకూడ నట్లే వారికి ఆసక్తి యుండవలెను. అప్పుడే యీ జీవునకు పరమార్థవిషయములో కొంత వఱకు కార్యసిద్ధి చేకూరును.

19. ఈ ప్రపంచము నిజముగ నొక అరణ్యమేయైనను జనులు దీనినొక పట్టణముగా భావించుకొనుచు, నిందలి పదార్థములు నాశమానములేయైనను వానిని సత్యమైన ట్లెంచుకొనుచున్నారు. అసలు సత్యవస్తు వెద్దియో వారలకు తెలియనే తెలియకున్నది. అట్టిస్థితిలో జీవునికి నిర్వాహ మెట్లుకాగలదు, సత్సంగమం దెట్లు ఆసక్తిగలుగును ?

20. జీవులకు సంతుమహాత్ముల సత్సంగము చేసికొను నధికారమే లేదు. సత్సంగము కొంతకాలముచేయగా, నచ్చటకూర్చుండుట కర్హత చేకూర వచ్చును. ఎంతబోధచేసిననుకూడ నతడు సత్సంగకార్యక్రమమును తన బుద్ధి చాతుర్యములను ప్రయోగించి పరిశీలింపకుండ నుండలేడు. కాని సత్సంగకార్య క్రమము మానవబుద్ధి కతీతమైన విషయము. ఈ మార్గము ప్రేమమార్గము. సత్సంగము చేయనిదే ప్రేమచేకూరదు. కాలుడు జీవుని సత్సంగము చేసికొన నీయడు. ఈ విషయములో జీవుడుకూడ నశక్తుడు. అతనివశములో నేమియు లేదు.

21. మత్స్యమునకు జలమెంత ప్రియముగనుండునో, శిష్యునకు సద్గురువు అంతప్రియముగ నుండవలయును. సంతులయెడల నంతప్రేమతో నెవరుందురో, వారే సంతులకు ప్రియమగుదురు. అట్టివారే జగమునుండి తరింతురు.

22. నీమనస్సు చెప్పెడిమాటలను, సద్గురువు సెలవిచ్చిన ఆజ్ఞలను, రెండింటెని దృష్టిలో నుంచుకొనుము. అప్పుడు సద్గురునాజ్ఞను పాలించినచో మనస్సును జయించినట్లును, మనస్సు చెప్పినట్లు నడచుకొన్నచో సద్గురువునకు విముఖమైనట్లును తేటపడగలదు. పరమార్థము సంపాదించుకొనవలెననెడి నిజమైన కోరిక గలవాడు సద్గురువు నాజ్ఞలను ప్రధానముగ నెంచుకొనును. పరమార్థ నష్టమునకు భయపడనివాడు తన మనస్తరంగములలో కొట్టుకొని పోవును.

23. సంతుల ఉపదేశప్రకార మాచరించనంతవరకు సంతుల పవిత్ర గ్రంథములను పారాయణచేసి జ్ఞాపకముంచుకొన్నందువలన నేమియు ఫలిత ముండదు. అందుచే సంతులు సెలవిచ్చెడి వచనములను విని ఆచరణలో బెట్ట వలెను. లేనిచో నా వచనములు వినుటయు, అవగాహన చేసికొనుటయు నిరర్థకములు.

24. ప్రస్తుతకాలములో జనులకు ఉపవాస వ్రతములు, పుణ్యక్షేత్ర ములు, విగ్రహారాధనలయందును గల భక్తిలో నాల్గవవంతు భక్తికూడ సద్గురు చరణములయందు లేదు. ఈకారణముచేతనే, వారల కాంతర్యములో నేమియు మార్పు గల్గుటలేదు. మహావచనములను విన్నను బాహ్యముగనే, దర్శనము చేసికొన్నను బాహ్యముగనే, నామస్మరణముచేసినను కూడ బాహ్యముగనే చేయుచున్నారు. ఎవనికైనను పరిపూర్ణ సద్గురువు లభించినయెడల వారు అతనిని సమస్తద్వారములనుండియు నంతర్ముఖునుగనట్లు చేయుగలరు. పరిపూర్ణ సద్గురు వునకుదప్ప భక్తుని ఆంతర్యమున ప్రవేశింపజేయుగలశక్తి మరెవ్వరికిని లేదు.

25. సమకాలికసద్గురువునకు భక్తిచేయకుండ నెవరును జన్మమరణ చక్రమునుండి తప్పించుకొనలేరు. పూర్వకాలపు సంతుమహాత్ములయొక్క అనుయాయులైయుండి, వారియందు విశ్వాసముగలవారికిగూడ, తమ సమ కాలికులైన పూర్ణసద్గురువునందు భక్తిభావముగలిగి, అట్టి సద్గురువుయొక్క యుపదేశములప్రకారము ప్రవర్తించిననేగాని జన్మమరణచక్రమునుండి విముక్తి గలుగనేరదు. ఏలనన, ప్రాచీనకాలపు సంతుమహాత్ములుగూడ సమకాలిక సద్గురువుయొక్క శరణాగతుననే జీవకళ్యాణము సిద్ధించగలదని సెలవిచ్చి యున్నారు.

26. భగవంతుని పొందవలెనను తీవ్రవాంఛగల మానవుడే యీ మన స్సనెడి మదగజమును లొంగదీసికొనగలడు. మదపుటేనుగు అడవిలో తన ఇచ్చవచ్చినట్లెటుకావలెనన్న నటే, నిరాటంకముగా తిరుగుచుండును; కాని మావటివాని యంకుశముక్రిందికి వచ్చినపుడు, ఆ మత్తగజమే చక్రవర్తి స్వారి జేయుట కుపయోగపడుచు జీవితము సుఖముగ గడపగల్గును. అట్లే గురుని ఆజ్ఞలను శిరసావహించు గురుముఖునకే పరమధామమునందు ప్రవేశము లభించును. గురుశరణ్యమునొందనివారు జన్మమరణచక్రములో నుండిపోవుదురు. అందుచే శక్యమైనంతవఱకు గురుముఖుడగుటకు పరిశ్రమ చేయవలయును.అయితే గురువు పరిపూర్ణ గురువైయుండవలెను.

27. మేము జీవులకు చెప్పునది, ఉపదేశించున దంతయు జీవుల యధికారము ననుసరించియుండును. ఇక్కాలమున సంపూర్ణాధికారము గలవారెవరును కానవచ్చుటలేదు. గొప్పగొప్ప పరమార్థులని పేరుపొందినవారు చేయుచున్న దేమనగా, వందలకొలంది గృహస్థులను, కాషాయవస్త్రధారులను శిష్యులుగా జేర్చుకొని వారిచే విచారమాలాగ్రంథమును చదివించి, అంతటితో వారిని బ్రహ్మజ్ఞానులుగ చేసివేయుచున్నారు. ఇట్టి గురుశిష్యులిరువురునుగూడ భ్రమలోపడియున్నారు. వారికి కేవలము అహంకారముదప్ప మఱేమియు లభించనేరదు. గురునానక్ వారి అనుయాయులైనవారు గ్రంథసాహబ్[1]ను మూటగట్టి దగ్గఱనుంచుకొని దానికి ఆరతి[2]యు దండప్రణామములును చేయుచున్నారు. చాలకాలమునుండి వారు అట్లు చేయుచునే యున్నారుకాని, ఆ గ్రంథసాహబ్‌నుండి, "మీలో నామము ప్రకటమై, మీరు సుఖముగ నుందురుగాక", అనెడి ఆశీర్వచనరూపమైన మాట యింతవఱకు పైకి వినపడలేదు. గ్రంథసాహబ్‌లో నెక్కువగా సద్గురువుమహిమను గుఱించియే ప్రశంసించబడియున్నపుడు, తాము సద్గురువు నన్వేషించవలసియున్నదా లేదా అను విషయమునుగూడ వారు యోచించుటలేదు. ఈకాలములోని జనుల లాభార్థమై సద్గురువు సెలవిచ్చియుండిన యుపదేశమును వారు మన్నించుటలేదు. గురునానక్‌వారు అవతారమెత్తినపుడు గ్రంథసాహబ్ లేదుగదా! వారప్పుడు తమ ఉపదేశములమూలముననే జీవులకు పథప్రదర్శనము జేసియుందురు. దీనినిబట్టి సంతులను తయారుచేయుశక్తి గ్రంథమునకు లేదనియు, సంతులు గ్రంథముపై నాధారపడువారు కారనియు. సంతులకే సంతులను తయారుచేయగలశక్తి గలదనియు, వారెప్పుడు కావలెనన్న నప్పుడే గ్రంథములనుగూడ రచించగలరనియు తేటతెల్లమగుచున్నది. గ్రంథసాహబ్‌ను కొన్ని వందలసార్లు పారాయణ చేసినవారు వేనవేలున్నారు, కాని వారు గ్రంథసాహబ్‌లో వ్రాసిన విషయము లేవియో ఆలోచించుటయేలేదు. ఇవ్విధమైన పారాయణలచే నేమియు ప్రయోజనములేదు, సంతసద్గురువే భ్రమలనన్నిటిని పోగొట్టగలవారు. కాబట్టి సంత్ సద్గురువును అన్వేషించుట యత్యావశ్యకము. జన్మమరణచక్రమునుండి విముక్తినొందుట కింతకన్న వేఱు ఉపాయమేలేదు.

---

1. శిఖ్ఖుగురువులు పదుగురియొక్కయు గద్యపద్యాత్మకరచనలను గ్రంథసాహబ్ అను నొక గ్రంథములోజేర్చివ్రాసిరి. అందులో మఱికొందఱు ఇతర సంతుమహాత్ముల రచనలుగూడ జేర్చి వ్రాయబడినవి. ఆగ్రంథము గురుముఖి భాషలోనున్నది.

2. ఒక పళ్ళెములో దీపము వెలిగించిపెట్టి, అందులో కొన్ని ఫలపుష్పములనుగూడ పెట్టి దేవునియెదుట చక్రాకారముగా త్రిప్పుటను ఆరతియందురు.

28. సత్సంగము సమస్తవాంఛలను నశింపజేయునట్టి కల్పతరువు. కథలలో చెప్పబడిన కల్పతరువు కోరికల నన్నిటిని పూర్తిజేయునని చెప్పుదురు. కాని, యింతవఱ కెవరికి నాకల్పతరువు దొరకలేదు. సత్సంగమే నిజమైన కల్ప వృక్షము. కావున సత్సంగమును తిరిగితిరిగి చేయుచుండవలెను. చాలసేపు చేయలేకపోయినచో కొద్దిసేపుచేసినను శ్రద్ధాభక్తులతో చేయవలెను; కపట భావముతో చేసినచో నేమియు ప్రయోజనముండదు.

29. వజ్రము ముత్యమును దొల్చి రంధ్రముచేయును, కాని ఱాతిని అట్లు దొల్చనేరదు. అటులనే సంతులమహోపదేశమువలన అధికారిజీవులే పరిభావితులౌదురుకాని, అనధికారులు లాభముపొందలేరు. అయినను అనధి కారులుగూడ సత్సంగమును విడువకుండ నుండినచో కొంతకాలమునకు సత్సం గమున కధికారులు కాగలరు. కాని, అందులో కష్టమెద్దియనగా వారు సత్సం గములో నిలకడగ నుండలేరు.

30. సృష్టికిపూర్వము ఆదిలోనంతయు గుప్తావస్థలో నుండెను. అప్పుడు పురుషుడు సృష్టి ప్రారంభమగువఱకు శూన్యసమాధిలో నుండెను. పురుషునికి "మౌజ్" అనఁగ దివ్యేచ్ఛకలిగినపుడు శబ్దముప్రకటమై శబ్దమునుండి సమస్త సృష్టియు సృజించబడెను. మొట్టమొదట సత్యలోకము ప్రకటమై, పిమ్మట సత్యపురుషునియొక్క ధారలమూలమున ముల్లోకములును, సమస్తసృష్టియు జనించెను.

31. పరమాత్మస్వరూపమైన పరబ్రహ్మ సకలజీవులలోనున్నది. కాని, అది యేజీవునిగూడ సంసారసాగరమునుండి యుద్ధరించలేదు సరిగదా, పైగా జీవుల నది క్రమక్రమముగా అందులో మఱింత చిక్కుకొనిపోవునట్లు చేయును. ఆ పరబ్రహ్మపరమాత్మయే, సద్గురురూపమును ధరించి జీవున కుపదేశమిచ్చి నపుడు అతనిని సంసారబంధనములనుండి విముక్తునిగ జేయును. కాని, జీవులు అంధులై యీ యుద్ధారకర్తయైన స్వరూపమును పట్టుకొనకుండ, పరబ్రహ్మ పరమాత్మయొక్క అవ్యక్తరూపమును ధ్యానముచేయుచున్నారు. ఇట్టి అవ్యక్త ధ్యానమును భగవంతు డంగీకరించడు. ఏలనన, స్వయముగ భగవంతుడే తన్నెవరు సద్గురువుద్వారా వచ్చి కలసికొందురో వారికే లభ్యముకాగల ననియు, గురుహీనులకు తనదర్బారులోనికి ప్రవేశము లభింపనేరదనియు, సెల విచ్చెను. సంతుమహాత్ముల వచనములను జీవులెందుకు మన్నించగని యెవని కైన ప్రశ్న గలుగవచ్చును, అందుకు సమాధానమేమనగా, జీవులకు భగవం

తునియెడల భయముకాని, ఆయనను కలిసికొనుట కాసక్తికాని, లేకపోవుటయే అందుకు కారణము. భగవంతునియెడల నెవనికి భయముండునో, అట్టివానికే భగవంతుని కలిసికొనవలయునను నాసక్తికూడ నుండును. కావున మొట్ట మొదట భయముండవలెను.

32. ప్రస్తుతకాలపు గురువులు జనులను శిష్యులుగ మాత్రము చేసికొను చున్నారుకాని, అటుపిమ్మట వారలను జలపాషాణాదులను పూజించుటలో లగ్నము చేయుచున్నారు. నిజమునకు వారు జీవులచే తమకే భక్తిచేయించు కొనవలయును. అయితే పాపము, ఇందులో వారు చేయగల దేమున్నది! వారెప్పుడైనను తమగురువులకు భక్తిచేసియుండినచో, తమశిష్యులకుగూడ తమయందు భక్తిచేయుట నేర్పియుందురు. అట్టివారిని గురువులని పేర్కొను టయే తప్పు.

33. పరమార్థముకొఱకు గాఢాసక్తియు, జన్మమరణచక్రమువలన భయ మును గలవారు, చేయవలసిన ప్రథమకర్తవ్య మేమనగా సద్గురువు నన్వేషించు కొనుటయే. ఏలనన, సద్గురువునందు ప్రేమ యుత్పన్నముకానిదే, అంతఃకరణ శుద్ధి కలుగ నేరదు; చిత్తశుద్ధి కలుగనంతవఱకును భగవన్నామమువలన లాభము సేకూరజాలదు. కృషికుడు భూమిలో విత్తనములు జల్లకముందు, దానిని తయారుచేయునుకదా. పొలమును సరిగా తయారుచేయకుండ విత్తనములు జల్లినచో నవి నాటుకొనవు. అటులనే హృదయరూపమైన పొలమును తయారు చేయుటకు గురువునందు ప్రేమ యత్యావసరము. గురుచరణములయందు ప్రేమ లేనిచో, భగవన్నామమువలన లాభము గలుగ నేరదు. ఈ కాలములో జనులు ఇంటగూర్చుండి నామస్మరణ చేసికొనుచుండుటయే ప్రధానముగాని సద్గురు వుతో పనిలేదనుకొనుచున్నారు. అట్టివారు రెండువిధముల నష్టపోవుదురు. అనగా వారికి గురువును లభించరు, నామస్మరణయును జయప్రదముగ సాగ నేరదు. నామదానము నిచ్చుటకు సద్గురువొక్కరే సమర్థులు. సద్గురుచరణము లందు ప్రేమ లేకుండనున్నపుడు వీరికి నామ మెట్లు లభించును ?

34. బ్రహ్మాదిదేవతలు, రామకృష్ణాద్యవతారములు, అందఱునుగూడ సంతులకన్న తక్కువతరగతికి చెందినవారే. వీరందఱికన్న సంతుపదవి ఉన్న తోన్నతమైనది. వీరందరును మంత్రులును, పనివాండ్రును, సంతులు చక్రవర్తు లునై యున్నారు.

35. సత్సంగము ప్రధానమైనది. సత్సంగములోచేరి విడవకుండ నట్లే యుండిపోయినచో జీవున కనేకలాభములు గల్గును. నీటిలోపడియున్న ఱాయి చల్లగానుండును. ఆశీతలప్రభావము ఱాతి యంతర్భాగములోనికి ప్రవేశించక పోయినను, ఆఱాయి నీటిబయటనున్న ఱాళ్ళకంటె నయమేగదా! అటులనే కొందఱు బాహ్యముగనే సత్సంగముచేసికొనుచునుండి, దాని ప్రభావము వారి యాంతర్యమున గలుగకపోయినచో నందువలన నష్టములేదు. ఏలనన, నట్టివారు కేవల ప్రాపంచికజీవులకన్న శ్రేష్ఠులే. క్రమక్రమముగా సత్సంగము వారినిగూడ నాంతర్యములో ప్రభావితులగునట్లు చేయగలదు.

36. దేహములో శ్వాస ఆడుచున్నంతవఱకు గురుభక్తి చేయుచునే యుండవలెను. గురువునకు భక్తిచేయుటయే భగవంతునికి భక్తిసేయుట యనబడును. కాని, వారివద్దనుండి యేమియు గోరరాదు. వారంతటవారే యెవరైన నధికారియైనపుడు, కనిపెట్టి, వానివాని యర్హతనుబట్టి యియ్యవలసిన దానిని దయతో నిచ్చుచుందురు.

37. సద్గురువునకు దీనత్వము ప్రియము. ఎవనికైనను హృదయపూర్వకమైన దీనత్వమున్నయెడల, నతడు మనస్సుయొక్క చంచలత్వమును గుఱించి కాని, తన కాధ్యాత్మిక ప్రయాణములో సహాయకరమగు ఆధ్యాత్మికసంపత్తు గలదా లేదా యనిగాని చింతింపబనిలేదు. సద్గురు శరణ్యమును దృఢముచేసి కొని, సద్గురుని శరణుజొచ్చినచో, భక్తునికి కార్యసిద్ధి నిశ్చయముగ చేకూరును.

38. జడ చైతన్యములగ్రంథి గట్టిగా పడియున్న వారు కామ, క్రోధ, లోభ, మోహాహంకారములలో ప్రవర్తించుచుందురు. అట్టివారు తమ ప్రవర్తనలో నెప్పుడైనను శీల క్షమా సంతోషములనుగూడ ప్రకటించినను అది కేవలము బాహ్యముగనే యుండునుకాని, వారు అంతర్యములో నెప్పుడు కామ క్రోధాదుల స్వాదమునే పొందుచుందురు. జడచైతన్యగ్రంథి విడిపోయిన వారికి కామక్రోధ లోభమోహాహంకారము లెన్నటికిని దరిజేరనేలేవు.

39. భగవంతు డెల్లపుడు నందఱితోకూడ నుండుచు, నందఱు చేయు చెడుపనులను, మంచిపనుల నన్నిటిని సహించుచునే యుండును. భగవంతుడు తనకిచ్ఛగల్గినపుడే యెవనినైన చెడుపని చేయకుండ నాపుజేయును. కాని ఒకరు నిషేధించినందువలన నెవరును తాఁబూనుకున్నపనిని మానరు. కావున నెవరైనను మఱొకని నేదేనిపని చేయవద్దనిచెప్పి కష్టపెట్టనేల? ఎవ్వరైనను తనయెడల

భక్తివిశ్వాసములుగలవానికి బోధపరచుట తప్పకాదు. అట్టివాడే చెప్పిన మాటవినును.

40 కర్మిష్ఠులు, మతగ్రంథములననుసరించువారు, (వాచక) జ్ఞానులును సంతుమహాత్ముల యుపదేశముల నెన్నడు నంగీకరించరు. వారందఱును ప్రాపంచిక వాంఛలతో నిండినవారును, వేదాంతవిషయముల తర్కవిచారణలలో నుత్సాహముగలవారును కావున, నట్టివారు సంతుల సత్సంగములోనికి వచ్చుటగూడ నయుక్తమే. నిర్మల[1] తెగకును, నిహంగ[2] తెగకును చెందిన శిఖ్ఖుసాధువులు, సన్యాసులు, జ్ఞానులు, వేదాంతులును, వ్రతములు తీర్థయాత్రలుచేయువారును, విగ్రహారాధకులును, నిజమైన పరమార్థాసక్తి లేకుండ కేవలము వేదశాస్త్రపురాణములు ఖురానునే పరమావధిగ నమ్మికొని ప్రవర్తించువారును —వీరందఱును పైనచెప్పినరకమువారే. ఇట్టివారివలన సంతు మహాత్ములకు శ్రమగల్గుటతప్ప మఱేద్దియుకలుగ నేరదు. ఏలనన, వీరికి సద్గురువు నన్వేషించవలెనను నాసక్తియేలేదు. వీరు కేవలము అంధవిశ్వాసులు.

41. కలియుగములో జీవులయుద్ధార మీక్రింది మూడుకార్యములవలననే కాగలదు- (1) పరిపూర్ణసద్గురువుయొక్క శరణ్యము, (2) సాధుసాంగత్యము (3) నామస్మరణమును, ఆంతర్యమున నామశ్రవణమును. తక్కినవిషయములన్నియు వృథాప్రయాసయే. ఈ కాలములో పై మూడువిషయములు గాక నితరకృత్యములు జీవుల కనర్థకారకములే.

42. జీవు డీప్రపంచములోనికి తమాషాచూచుటకై పంపించబడి యుండెను. కాని అత డిచ్చటకు వచ్చినపిమ్మట భగవంతుని మఱచిపోయి, వినోదవిలాసములలో చిక్కుకొనిపోయెను. ఒక పసిపిల్లవాడు ఒక పెద్ద ఉత్సవమును చూచుటకు తన తండ్రివ్రేలు పట్టుకొని బజారులో నడుచుచు, ఆ వ్రేలును వదలిపెట్టి యుత్సవమును చూచుటలో మునిగిపోయెను. పిమ్మట నా యుత్సవ సమ్మర్దములో తప్పిపోయి, ఉత్సవానందమును బొందలేకను, తన తండ్రి యగుపించకను, బెంగపడి, త్రోవ తెన్ను తెలియక తిరుగాడుచు బాధపడును. అట్లే సమకాలికసద్గురుని హస్తము పట్టుకొన్నవారికి ఐహికసుఖము లేగాకుండ పర

1. నిర్మలులు అని శిఖ్ఖుసాధువులలో నొక తెగ. వారు మహాత్మ రామదాసుగారు నిలబెట్టిన నానక్ పంథి సాంప్రదాయమునకు చెందినవారు. వీరు కాషాయవస్త్రములను ధరించి సన్యాసులవలె తిరుగుచుందురు.

2. నిహంగులుకూడ శిఖ్ఖుసాధువులలో నొక తెగ.

మార్గలాభముకూడ సిద్ధించును. వక్త్ర సద్గురు భక్తి చేయనివారు ఇహలోకములో దిక్కులేకుండ తిరుగుటయేగాక చివరకు జన్మమరణచక్రములో పడిపోవుదురు.

43. అనాహతశబ్దముయొక్క ఆనందము గావలసినచో రోజున కొక్కసారిమాత్రమే భుజించవలెను. రోజునకు రెండు, మూడు సార్లు భోజనముచేయువారికి శబ్దముయొక్క ఆనంద మెన్నటికిని లభించ నేరదు.

44. సద్గురుసేవను భగవదారాధనను చేయుచు గడపిన జీవితమే సఫలమైనది. సంతసద్గురువుయొక్కయు, సాధువులయొక్కయు, సేవార్థము వ్యయపడిన ధనమే సఫలము. పరమార్థవిషయములో తోడుగనున్నవారే నిజమైన బంధువులును సంతానము నగుదురు.

45. సద్గురువునందు భక్తియు, దృఢవిశ్వాసము నెవరికి గలదో, వారికే అనాహతశబ్దముగూడ లభించును. సద్గురువునందు విశ్వాసములేనివారికి శబ్దముకూడ లభ్యముకాదు.

46. కామక్రోధలోభమోహాహంకారములయొక్క మూలమును, ఆశయొక్కయు, ఐహికవాంఛలయొక్కయు మాలిన్యమును అంతఃకరణలోనున్నవి. ఈ మాలిన్యము సద్గురు భక్తివలననే నశించును. అప్పుడే భగవచ్చరణములందు ప్రేమకలుగును. భగవత్ప్రేమ కలిగినప్పుడే పరమార్థసిద్ధిసేకూరును.

47. సద్గురువుయొక్క శరణ్యముతప్ప తక్కినవారందరి శరణ్యమును విడిచిపెట్టుటయు, సద్గురువునే ముఖ్యముగ పట్టుకొనియుండుటయు సేవకుని ధర్మము. సేవకుడట్లు చేయనిచో సద్గురువే స్వయముగ నాతనిని పట్టుకొందురు. కాని అందువలన సేవకునికి కొంత శ్రమ గలుగగలదు.

48. ఎవరైనను చేతనస్వరూపమును సేవించినచో చైతన్యమునే పొందుదురు. జడమును సేవించినచో జడమునే పొందుదురు. కాని ఒక్కసద్గురువు తప్ప మిగిలినదంతయు జడమే. సద్గురు వొక్కరే యీ ప్రపంచములో చేతనస్వరూపులు. కావున తమ శ్రేయస్సును గోరునట్టియు చేతన స్వరూపమును పొందగోరునట్టియు జీవులందరకును సద్గురుసేవచేయుట యావశ్యకము.

49. గురుముఖత్వము మొట్టమొదట సంపాదించుకొనవలెను. పిమ్మటనే నామదానము లభించగలదు. గురుముఖత్వము లేనిచో నామదానము

నెకూడనేరదు. అందుచే ప్రతివ్యక్తియు గురుముఖత్వము సంపాదించుకొనుటకు నిమిత్తమై పరిశ్రమచేయవలెను.

50. ప్రాపంచికజీవులు తమ జీవితమంతయు నీ ప్రపంచవ్యవహారముల లోనే గడిపివేసి చివరకు మరణసమయమున నొంటరిగ వెడలిపోవుదురు. శ్మశానవాటికవఱకు నందఱును వారితో వెళ్లుదురుకాని మరణానంతరము తోడుగనుండువా రెవరునుండరు. సత్సంగులకు అట్లుగాక, సద్గురు వెల్లప్పుడు తోడునీడగ నుందురు. ఒంటరిగనుండినచో, నెవరికైనను కడుశ్రమకల్గు నను విషయము విశ్వవిదితమే; అనగా, ఇరువురునులేనిచో నీ ప్రపంచములోను శ్రమగల్గును, మరణానంతరముగూడ నట్లే శ్రమహేతువగును. ఈ ప్రపంచ ములోనైతే స్త్రీ, పుత్రుల సాంగత్యముండుటచే జీవితము సుఖశాంతులతో గడచిపోవును. మరణానంతరము సద్గురువు సహాయకులైయుందురు. నరశరీ రము ధరించినందుకు సద్గురువుతో తిరిగితిరిగి సాంగత్యమును చేసికొనుచు, నందు మూలముగా మరణసమయమున కష్టములేకుండ జేసికొనుటయే, సార్థకమైన పని. సద్గురువుతో బాహ్యముగ సాంగత్యముచేయుటకు వీలుగానిచో, వారి నాంతర్యమున నెల్లప్పుడును తోడుగ నుంచుకొనవలయును.

51. భగవత్ప్రేమ లేకపోవుటచే వాచకజ్ఞాను లెట్లుశూన్యహస్తులుగ నుండిపోవుచున్నారో, అటులనే గురుభక్తులకుగూడ భక్తిలేనిచో నేద్దియు లభించదు. కాని వీరిరువురిలో నొకవ్యత్యాసమున్నది. అదేదనగా, వాచక జ్ఞానులు ప్రేమయొక్క మూలమునే ఛేదించుకొనియుండినందున వారల కెన్న టికి నేమియు లభించుటకు సావకాశము లేదు. కాని సద్గురుభక్తులకు మాత్ర మెప్పటికైన ప్రేమదానము తప్పక సేకూరగలదు.

52. పవిత్రనామము, అనగా శబ్దము ఒక గొప్ప అమూల్యపదార్థము. కాని, యెవనికి దీనివిలువ తెలియదు. నామముయొక్క మహిమ యెట్టిదనగా, నిద్రపోవుచున్నవాని నెవరైన నతని నామముతో పిలచినచో నతడు మేలు కొనును. అట్టిస్థితిలో మెళుకువగనున్న పురుషుని ఆయననామముతో పిలచినచో నెందుకు వినకుందురు? కాని ఆ పురుషుడు నీభక్తియొక్క నిజాయితీని, దృఢత్వ మును పరీక్షించి చూచును. వారు, ముందు నీకండ్లను వారిదర్శనము చేసి కొనుటకును, నీహృదయమును వారధిష్ఠించుటకును అర్హమైనట్లుగ నీవు చేసి కొనినపిమ్మటనే నీయాంతర్యమున ప్రకటమగుదురు. ఈ పని జరుగుచుండు నంతలో నెవరైనను వ్యాకులతజెంది తమ ప్రయత్నమును విడచిపెట్టినచో,

భగవంతుడుకూడ నూరకుండును. శ్వాస ఆడుచున్నంతవఱకు నామమును విడువననెడి దృఢనిశ్చయముతో నెవరుందురో అట్టివానికే భగవంతుడు తప్పక నామదానమును ప్రసాదించును.

53. ఎవనికి సద్గురువు లభించి మహోదయుతో పవిత్రనామమును, దాని రహస్యవిషయములను ఉపదేశింతురో, అట్టివాడు ఆ నామము నభ్యాసము చేయుచు, సద్గురువునెడల భక్తివిశ్వాసములను వృద్ధిచేసికొనుచు నుండవలెను. అట్లు చేయలేనిచో నాంతర్యమున పశ్చాత్తాపపడుచు నిరంతరము ప్రయత్నమును చేయుచునే యుండవలెను. కాని, తా నితరులకు బోధింప బూనుకొనగూడదు. తాను బోధించిచెప్పదల్చినవారు వారి విషయములో వారే జాగ్రత పడగలరు. ఇతఁడు తన స్వవిషయమునుగూర్చి జాగ్రితపడవలయును.

54. పూర్వకాలములోనున్నట్టి పుణ్యక్షేత్రములకును, ఉపవాసవ్రతములకును బదులుగ సంతుమహాత్ములు కలియుగములో సద్గురుసాంగత్యమును సాధుసాంగత్యమును, పుణ్యక్షేత్రములుగను, గుర్వాజ్ఞను పాలించుట వ్రతముగను ఏర్పఱచియున్నారు. ఈ ప్రకారము ఆచరించినందువలన జీవునకు మహాలాభము చేకూరును. ప్రాచీనక్షేత్రయాత్రలు, వ్రతములు చేసినందువలన నహంకారము పెరుగుటదప్ప మఱొకలాభ ముండ నేరదు.

55. ఈ మనస్సొక మదపుటేనుఁగ వంటిది, అది తన కెట్లుతోచిన నట్లేపోవుచు జీవునిగూడ తనతో లాగుకొనిపోవును. అడవియేనుఁగును స్వాధీనముచేసికొనుటకు ఒకమావటివా డవసరము. అటులనే యీ మనస్సనెడి గజమును లొంగదీయుటకు సద్గురువు అత్యవసరము. సద్గురువుయొక్క అంకుశపుదెబ్బ తగిలిననేగాని, దీనిమదము అణఁగిపోదు. పరమపదమును పొందగోరినవారు సద్గురువు నాశ్రయించవలయును. సద్గురుసహాయములేనిదే పరమధామమునొందుట నుసాధ్యము. ఈ వచనము ముమ్మాటికి నిజమని తెలిసికొనుము. లేనిచో జన్మమరణచక్రములో పడిపోవుదువు.

56. సంతసద్గురుని మతము సగుణ,నిర్గుణములకు రెండిఁటికిని పూర్ణముగ విలక్షణమైనది. సత్యలోకములోని రచనయు సత్యమైనది. అది సృజించిన సత్యపురుషుడుకూడ సత్యము.

57. సంతులును, ఫకీర్లును, భగవంతుని ప్రత్యక్షస్వరూపములు. వారియందు భక్తివిశ్వాసములు పెట్టుకొన్నవారుగూడ భగవంతునిస్వరూపమైపోగలరు.

58. గురుముఖత్వమును సంపాదించుటెంతయు కష్టము; అనాహత శబ్దము అంతరంగమున ప్రకటమగుట అంతకష్టము కాదు. కాని శబ్దము సద్గురుని దివ్యేచ్ఛవలననే ప్రకటముకాగలదు. సద్గురుదయ లేనిదే యేమియు చేకూరనేరదు.

59. దశమద్వారము మానవశరీరములో గుప్తముగ నున్నది. దానిని తెలుచుటకు కలియుగములో సంతులు శబ్దమార్గమనెడి ఉపాయమును ప్రకటించిరి. ఇతరమతములలో చెప్పబడిన పద్ధతుల నవలంబించి దశమద్వారమును తెలుచుట ఇక్కాలమున నసాధ్యము.

60. సద్గురువునకు భక్తి చేయుదలచినచో ప్రాపంచికబంధనలను త్రెంపుకొనవలెను. ప్రపంచముతో బంధనము పెట్టుకొనిన యెడల భక్తిచేయుటలో లోపము కలుగును. ఈ రెండు కార్యములను ఒకేసమయమున సాగించుట సాధ్యము కాదు. అయిన నిది యొకతప్పుజసరియైన నియమము కాదు. ఎవనికి ఉత్తమసంస్కారములుండి సద్గురుకృపగూడ నుండునో అట్టివాని కీయుభయ కార్యములును చక్కగా సాగిపోవుచుండును. అందులో నెట్టికష్టమునుండదు. నికృష్టసంస్కారములుగలవానికి రెండిటిలో నేదోయొకకార్యము మాత్రమే సాధ్యమగును.

61. శబ్దమార్గ మవలంబించగోరువానికి శబ్దరహస్యము తెలిసిన సంతుమహాత్ములు లభించినచో నతఁడు తనశరీరమనోధనములను సంపూర్ణముగ వారి కర్పణచేయవలెను. అందుల కెట్టిసంకోచము చేయకూడదు.

62. నామరసాయనముతో తుల్యమైన రసాయనము మఱెద్దియు లేదు. ఈ రసాయనమును సాధించినవానికి సమస్తరసాయనములును దాస్యము చేయును. ఎట్లనగా, భర్త వశములోనికి వచ్చినప్పుడు, భార్య కూడ వశము లోనికి రావలసినదే.

63. ముక్తివిషయములో భిన్నభిన్నమైన యభిప్రాయములు గలవు. తీర్థయాత్రలు, ఉపవాసవ్రతములను జరుపుటలోనే మోక్షమున్నట్లు కొందఱును, జపతపములే మోక్షస్వరూపమని కొందఱును, సన్యాసములో మోక్షమున్నదని కొందఱును అనుకొనుచున్నారు. ఇవన్నియు తప్పుటభిప్రాయములే. సంతుమహాత్ములు సెలవిచ్చున దేమన, జీవాత్మ తనమూలధామమున చేరుకొననంతవఱకు మోక్షము లభించెననుకొనుట సరికాదు.

64. వేదాదిసకలశాస్త్రములును, షడ్దర్శనములును,[1] చాంద్రాయణాది[2]సమస్తవ్రతములును ఈ సమస్తప్రపంచమునుగూడ నాశమానములే. ఒక్క సంతసద్గురువును, వారిసేవకులునుమాత్రమే నాశము లేకుండ నుందురు. అందువలన ప్రాపంచిక ప్రేమను తగ్గించుకొని, సంతులయెడల ప్రీతిభావమును వృద్ధిచేసికొనవలయును. సంతులయెడల గల ప్రేమ సుఖదాయకము, ధనపుత్ర దారాదులయందును, పేరుప్రతిష్ఠలయందునుగల ప్రీతి దుఃఖదాయకము.

65. పండితులును, వేషధారులును జీవులకు ఉద్ధారమును కలిగించలేరు. దయాళురైన సంతుమహాత్ముని నాశ్రయించకుండ, మరెవ్వరిద్వారానైనను జీవునకు ఉద్ధారముగలుగుట సాధ్యముకాదు. కావున తమకు చేతనైనంత వఱకు దయాళురగు సంతుమహాత్ముల నన్వేషించుకొని వారి శరణుపొంద వలెను. అట్లయినచో నొక్కజన్మలోనే ఉద్ధారము లభించగలదు.

66. గృహస్థాశ్రమములోనున్న సంతులమూలమున ననేకజీవులు తరించ గలరు. కాషాయవస్త్రములను ధరించు వేషధారుల మూలమున నెవరికి ఉద్ధారము లభించ నేరదు. కాని, దయాళురైన సంతులు ఎప్పుడును గృహస్థాశ్రమములోనే యుందురు.

67. సాధువులును, భక్తజనులును తనదేహమనియు, తనసేవ జేయ గోరినచో తన సాధువులకును, తనభక్తులకును సేవజేయుడనియు, భగవంతుడు సెలవిచ్చియున్నాడు. కాని మూర్ఖపుజీవులు జలపాషాణములకు పూజచేయు చుందురు. ముఖ్యమైనట్టి సద్గురుభక్తి, సత్సంగము, సాధుసేవయు చేయువా రొక్కరును గానరారు.

68. ప్రస్తుతకాలపుజీవులకు మొట్టమొదట గురుభక్తియు, సత్సంగమునే ప్రధానముగ చేయవలసినవి. ఇవిలేకుండ జీవకళ్యాణము సాధ్యముకాదు.

69. సత్సంగములో కూర్చుండినంతమాత్రమున కర్మలు నిర్మూలము గానేఱవు. సత్సంగకార్యములో పాల్గొనినందువలన కర్మక్షయము కాగలదు.

---

1. సాంఖ్య, యోగ, వైశేషిక, న్యాయ, పూర్వమీమాంస, ఉత్తరమీమాంసలకు షడ్దర్శనములని పేరు; అనగా షట్ఛాస్త్రములు,

2. చాంద్రాయణవ్రతమనగా చంద్రునియొక్క వృద్ధిక్షయముల ననుసరించి ఆహారపరిమాణమును హెచ్చించుచును, తగ్గించుచును చేయునట్టివ్రతము. ఈ వ్రతము ఒకమాసమురోజులు వరుసగా జరిగించవలెను.

70. అందును పవిత్రనామమును స్మరణచేయుచున్నారు. కాని వారిలో నెట్టిమార్పును గలుగుటలేదు. ఇందుకు కారణమేమనగా, వారు గ్రంథములలో లిఖితమయిన నామమును జపముచేయుచున్నారు. సాధుమహాత్ముని వద్ద నుపదేశముపొందిననామమును జపించినచో వారికి పవిత్రనామస్మరణము యొక్క ఆనందానుభవము కలుగును. ఏలనన, సంతులు తమహృదయమనెడి క్షేత్రమును దున్ని తయారుచేసి, అందులో నామవృక్షమును నాటి, దాని ఫలములను భుజించుచుందురు కావున నామమునుగోరునట్టి జిజ్ఞాసులెవరైన నట్టిసంతులవద్దకు వెళ్లి యాచించినచో వారతనికి నామఫలమును దానముగ ననుగ్రహింతురు.

71. శబ్దస్వరూపులయిన సద్గురువు లభించినవారే అనాహతశబ్దమును వినగల్గుదురు. మఱెవరికిని శబ్దమార్గముయొక్క రహస్యము తెలియనేరదు. శబ్దమార్గమందు విశ్వాసముంచి, శబ్దాభ్యాసము చేయువారే ఈకాలములో మహాదృష్టవంతులు.

72. సంతులసత్సంగము చేసికొని వారు సెలవిచ్చు మహావచనములను విన్నపుడు ఆ విషయములను మననముకూడ చేసికొనవలయును. అట్లుచేసినచో 'నిధ్యాసనము' అనగా ధ్యానావస్థను పొందుటకు సాధ్యమగును. మననము చేయనిచో నేమియు లాభముండదు. అనగా మార్పులేకుండ నెప్పటియట్లె యుండిపోవును.

73. సద్గురువు ఎవరినైనను కోపపడినచో సత్సంగులు అతనివిషయములో సద్గురువునకు సిఫారసు చేయవలెను. సద్గురువు ఎవరినైన ఆదరించినచో సత్సంగులుకూడ అతనిని ఆదరించవలెను.

74. భక్తిభావములేకుండ నెవరయిన సాధువునకు భోజనముపెట్టినచో నతని కందువలన లాభముండునుగాని సాధువునకు నష్టముకలుగును.

75. సంతులయొక్క అకాలస్వరూపము[1] బాహ్యముగ పూజసేయు నిమిత్తము ఉపయోగించును. సంతులు ఆంతర్యమున ధ్యానముచేయునట్టి స్వరూపముగూడ అకాలపురుషుని స్వరూపమే. ప్రాపంచికజీవులు మూలమును

1. అకాలరూపమనగా కాలమునతిక్రమించినట్టియు తేజోమయమైనట్టియు స్వరూపము. సద్గురువుయొక్క మానవశరీరము, భగవంతుని తేజస్వరూపమునకు ఈ లోకములో ప్రతిబింబము కావున సద్గురుస్వరూపమును 'అకాలస్వరూపమని యందురు.

విడచి కొమ్మలను పూజించుచున్నారు. అందుచే వారిచేతికి మూలముదొరకుట లేదు, కొమ్మలుకూడ శుష్కించిపోవుచున్నవి. శాఖలను పూజించినచో నెప్పటికైన మూలమువఱకు పోగలరని మొదటిలో నుద్దేశ్యమై యుండెను. కాని జీవులు విడిపించినను కూడ విడువనంతగట్టిగ నాకొమ్మలను పట్టుకొని విడువకున్నారు. అనగా వారు పండితులబోధలకులోనై అనేకవిధములైన బాహ్యపూజలను చేయుచున్నారు; ఇంకముందుకూడ నట్లే చేయబోవుదురు. ఇందుకు కారణమేమన, నిత్యము కాలునిపక్షము వాదించు మనస్సు జీవునితోకూడ నున్నది. ఎవరయినను కాలుని మతమును బోధించినప్పుడు, ఆమతము కాలుని దేశపు హద్దులలోపలనే యుండును గావున, మనస్సుగూడ నా బోధలను దృఢపఱచును. సంతులు దయాళుని మతము నుపదేశించినప్పుడు కాలుని వకీలు అయిన మనస్సు జీవుని అపభ్రమలబాలుజేసి సంతుల ఉపదేశములందు విశ్వాసము నేర్పడనీయదు.

76. వాంఛలయొక్క మూలమును త్రుంచివేయవలయును. ఏలనన, మానవుడు కోరినవిషయ మేదియైన సిద్ధించనిచో నతనికి బహుకష్టము కలుగును. మానవు డేపనిచేసినను దానిఫలితమును భగవదేచ్ఛకు విడచివేయవలెనుకాని, తనకిష్టమయినట్లే జరుగవలెనని పట్టుపట్టకూడదు. కాని యీఉపదేశముయొక్క సూక్ష్మార్థమును బాగుగ నవగాహనచేసికొనవలయును, లేనిచో నతనికి తనకర్తవ్యములను నెఱవేర్చుటలోనే శ్రద్ధలేకుండ పోవును. భగవంతునియొక్క ప్రత్యక్షదర్శనమైనపుడే యీస్థితి గలుగునుకాని భగవద్దర్శనములేనివాని కిది సాధ్యముకాదు. ప్రపంచమందలి సమస్తకార్యములలోను భగవంతునినే ప్రేరకునిగ గుర్తింపగల్గుగతి సంతుమహాత్ములకే సిద్ధించినది. అందువలన సంతుమహాత్ములొక్కరే ఈప్రపంచముయొక్క వైచిత్ర్యమును నిర్లిప్తతతో చూడగలరు కాని, మఱెవ్వరికి నట్టిశక్తి లేదు.

77. గురునానక్ సాహబ్ వారియందుకాని మఱొక పూర్వకాలపు సంతుమహాత్మునియందుకాని విశ్వాసముగల్గి, వారిఆజ్ఞలను పాలించువారికి సద్గురువు—వారు సంతుమహాత్ములైన పూర్వపుగురువుయొక్క అనుయాయులని తెలిసియుండుటచే—వారికి విశ్వాసముగల గురునానక్ వారినిగాని లేక ఇతర సంతుమహాత్మునిగాని తమతండ్రిగ భావించుకొని వారి ఆజ్ఞలనే పాలింపుడని బోధించుదురు. తండ్రి చేయవలసిన కృత్యము పిల్లల పాలనపోషణలుమాత్రమే. తండ్రి తనకూతురును పోషించును, అనేకవిధముల సంరక్షణచేయును; కాని

ఆపిల్లకు పుత్రవాంఛగలిగినపుడు ఆమెను భర్తకు వప్పజెప్పును, తండ్రియింటనే ఉండినచో నామెకు సంతానము గలుగనేరదు. ఇటులనే గురునానక్ సాహెబ్ వారును, ఇతర సంతుమహాత్ములును తమ యనుయాయులకు సత్యలోకము, సత్యనామము కావలెనన్నచో సద్గురువును వెదకికొనుడని, ఆజ్ఞాపించుచున్నారు. “గ్రంథసాహెబ్ ను పవిత్రగ్రంథములను నమ్ముకొనుడు, మీకు సత్యలోకము లభించగల”దని యెచ్చటను చెప్పబడియుండలేదు. సంతుల సంప్రదాయము లోనివాడవై, సంతులయందు విశ్వాసముగలవాడవని చెప్పుకొనుచు నీజన్మలో నీవు వారి వాక్యములను పాలించనిచో, అనగా, సమకాలికసద్గురువు నన్వేషించుకొననిచో జననమరణచక్రములో పడిపోయెదవు. ఈ విధమైనబోధ, సంతుల సంప్రదాయములోనివారికి చేయవలయును. పండితులకు కింకరులుగనై పోయి, సంతుల సంప్రదాయమునకు చెందనట్టివారికేమియు చెప్పకూడదు. వారు సంతులయాజ్ఞలను పాలించినను, పాలించకపోయినను, వారల యిష్టమునకే విడిచిపెట్టవలయును.

78. ప్రపంచములోని జీవులు ధనదారాదులయందు ఆసక్తికలిగియుండి అందుమూలముననే రసానుభూతినొందుచుందురు. కావుననే వారు ప్రాపంచిక జీవులని పేర్కొనబడుచున్నారు. సద్గురువుయొక్క దర్శనముకొఱకును హితోపదేశముకొఱకును ఆసక్తికలిగియుండి, అందుమూలమున ఆనందమునొందువానికి గురుముఖుడని పేరు. సద్గురువునందు ప్రేమగలవారు స్వల్పముగను, ప్రాపంచికజీవు లధికముగను ఉందురు. అయినను సద్గురువు నాశ్రయించినవారి నందఱిని సద్గురు వెప్పటికైన గురుముఖులుగ చేసియే తీరుదురు.

79. సద్గురునితో కొందఱు “మేమొక గడ్డిపరకను తునకలుగా చేసెదము, మీరు పరిపూర్ణసద్గురువైనయెడల ఆ తునకలను జేర్చి తిరిగి గడ్డిపరకగా చేయుడు.” అని పలుకుదురు. వారికి సద్గురువు “మీరు పూజించునట్టి బ్రహ్మచే ఆ తునకలను కలిపి గడ్డిపరకగా చేయించుడు, అట్లు బ్రహ్మ కలిపినచో మేము గూడ కలిపివేతుము”, అని సెలవిచ్చెదరు. ఏలనన, సద్గురువును బ్రహ్మయు నొక్కరే. త్రెంపిన తునకలను తిరిగి కలుపుటకుగాని, చనిపోయినవానిని సజీవునిగ చేయుటకుగాని బ్రహ్మకు శక్తిలేదు. సద్గురువునందు భక్తిశ్రద్ధలుగల వారి విషయములో సద్గురువు తెగిపోయినగడ్డితునకలను కలిపి ఏకముచేయుదురు, మృతజీవుని సజీవునిగ గూడ జేయుదురు. ఏలనన, ప్రాపంచికజీవులే మృతజీవులును, సమకాలికసద్గురుని చరణములందు భక్తిచేయువారే సజీవు

టును. అట్టివారివే తెగిపోయిన గడ్డిపరకతునకలు తిరిగి ఒకేగడ్డిపరకగా కలిపి ఏకముచేయబడినవి.

80. 'మురీద్' (అనగా శిష్యుడు) అను పదము 'ముర్దా' (చనిపోయిన వాడు) అను పదమునకు రూపాంతరము. కావున శిష్యుడైనవాడు సద్గురువు యొక్క ఆజ్ఞలను, తన బుద్ధికెట్లుతోచినను గూడ లెక్కపెట్టక, అక్షరముల నెరవేర్చవలెను. కావున నెవరైన నీపరిస్థితికి రానంతవఱకు తన్ను తాను 'ముర్దా' (చచ్చినవాడు) అని యెంచుకొనక సజీవునిగను, ప్రాపంచికజీవునిగనే యెంచుకొనవలసియుండును. కాని అతడు నిరంతరము నందుకొఱకై దృఢప్రయత్నము జేయుచు, సద్గురుని ఆజ్ఞలను పాలించుచు, అనగా సద్గురుసేవ, సత్సంగము, భజనాభ్యాసము చేయుచు, వారి చరణములయందు భక్తివిశ్వాసములను వృద్ధిచేసికొనుచు నుండినచో, నతడు కొంతకాలమునకు 'మురీద్' అయిపోగలడు.

81. "నీకు సంతులయందు విశ్వాసమెట్లుగలిగెను, సమకాలికసద్గురువు పరిపూర్ణ సద్గురువని ఎట్లు తెలిసినది"? అని యెవరైన నొకసత్సంగిని ప్రశ్నించినచో నందుకుసమాధానము ఇవ్విధముగ చెప్పవచ్చును: "పూర్వజన్మసంస్కారములచే నాకు నిశ్చయము గలిగెను కాని నేను ప్రత్యేకసాధన యెద్దియు చేయవలసిరాలేదు. వారి హితోపదేశములను విన్నంతనే చకోరపక్షికి చంద్రునియందును, పతంగమునకు దీపమునందును కలిగినట్లే నాకు వారియందు విశ్వాసము సహజముగ కలిగినది".

82. జగత్తునంతను వశముచేసికొనినట్టి మాయను సంతులొక్కరే లొంగదీసికొనిరి. మాయనుండి తప్పించుకొనగోరువారు సంతులసత్సంగములో జేరి మానావమానములు, దూషణ, భూషణల నన్నిటిని సహించుకొని యుండవలెను. అప్పుడే అతడు సాధువు కాగలడు. సహనశక్తి బొత్తిగలేనివాడు అనగా, సంతులసత్సంగములో తన్ను ఆదరాభిమానములతో చూచినంత కాలముమాత్రమే అచ్చటనుండి, తనను తప్పులుదిద్ది సన్మార్గమునపెట్టు నిమిత్తమై కఠోరముగ నేమైన నన్నంతనే అచ్చటనుండి వెంటనే వెళ్లిపోవుటకు సిద్ధమగునట్టివాడు సాధువుగ నెన్నటికిని కానేరడు. సకలకష్టనిష్ఠూరములను సహించగలిగినపుడే ఎవరైనను సాధువుకాగలడు.

83. సంతుల ఆజ్ఞానుసారము ప్రవర్తించిననేగాని మనస్సు నిర్మలము కానేరదు. సద్గురుభక్తి, శబ్దోపాసన చేయునంతకాలము చిత్తము నిశ్చలము

కాజాలరదు. ఎవనికైన నీరెండుసోపానములును పూర్తిగ దాటిననాడే జ్ఞానము నకు అధికారము గలుగును. జ్ఞానోత్పత్తి యైనతోడనే అజ్ఞానాంధకారము తొలగిపోవును. ప్రస్తుతకాలపుజ్ఞానుల పరిస్థితి యెట్లున్నదన, వారిమనస్సు నిర్మలమును, చిత్తమునిశ్చలమును అయినవో లేవో వారికే తెలియదు. జ్ఞానగ్రంథములను చదువుటమూలమున వారు జ్ఞానులయిన ట్లనుకొనుచు, వారి వద్దకు వచ్చినజీవులకు జ్ఞానోపదేశము చేయుచున్నారు. ఈ కలియుగములో జీవులకు జ్ఞానాధికారము లేనేలేదను విషయము వారికి తెలియదు. దీనిని బట్టియే వారు అంధప్రాయులని తేటపడుచున్నది. వారు స్వయముగ జన్మ, మరణచక్రములో పడిపోవుటయేగాక వారి చెప్పుచేతలలోనుండి వారి బోధల ప్రకారము నడచుకొనువారినిగూడ జన్మమరణచక్రములోనికి లాగుకొని పోయెదరు. జన్మమరణచక్రమునుండి తప్పించుకొనగోరు వారందఱును సంతుల వచనములను పాటించి అవిశ్వధముగా తమ నరజన్మను సఫలముచేసికొనవలెను. ఏలనన, ఈ నరశరీరము బహుకష్టముమీద లభించినది. దీనిని వ్యర్థముగ పోగొట్టుకొనగూడదు. ఎవరికైన నీ వచనము హితవుగ నుండనిచో వారు తమ యిష్టానుసారము నడచుకొనవచ్చును.

84. సమకాలికులైన సద్గురుని సహాయములేనిదే యెట్టిపరమార్థలాభము సేకూరనేరదు. తన సమకాలికసద్గురుని సేవ చేసి వారిప్రసన్నత సంపాదించినపుడే యేమైనను లాభించగలదు. నామదానము కావలెనన్నచో, సద్గురువుయొక్క ప్రసన్నత సంపాదించినపుడే అది లభించును; కాని మఱొక విధముగ నెన్నిపాట్లుపడినను సేకూరజాలదు.

85. గాజు నిప్పువేడి కెట్లునిలబడలేదో, అట్లే మానవశరీరముగూడ ప్రాపంచికభోగములనెడి అగ్నిలోబడి రాత్రింబవళ్లు కరిగిపోవుచుండును.అందుచే నేజీవులు పరిపూర్ణసద్గురు శరణ్యామునుపొంది వారి సత్సంగములో తమ శరీర మనోధనములను వెచ్చించెదరో అట్టివారే మహాభాగ్యశాలులు.

86. సాధుసాంగత్యము చేసినచో పావుఘడియలో కోటిజన్మలపాపములు నశించిపోవును. కాని ఆ సాధువు పరిపూర్ణసాధువుకావలెను, మొట్టమొదట, యథార్థమైనసాధువు లభించుటయే బహుకష్టము. ఒకవేళ సదృష్టవశమున నెవనికైన నిజమైన సాధుమహాత్ములు లభించినను అతడు వారిసాంగత్యములో నిలకడగ నుండలేడు. నిజమైన సాధువుయొక్క సాంగత్యము చేయనిదే వారి యందు విశ్వాసము గలుగనేరదు. విశ్వాసములేనిదే వారియందు ప్రేమ

ఎట్లు కలుగును? ఈ రెండునుగూడ లేనప్పుడు సాధువుయొక్క దయాకటాక్ష ములు సంపాదించుట యెట్లు? సాధు సద్గురువుయొక్క దయపొందని దే జీవుని కార్య మెట్లు సఫలము కాగలదు? కావున వారియొక్క సత్సంగము చేయుట ముఖ్యా వసరము. సద్గురువు నన్వేషించుటలో నొకజన్మ పూర్తిగా గడచిపోయినను నష్టమేమియు నుండజాలదు. పైగా అందువలన చాలలాభమే కలుగును. ఏల నన, అట్టి అన్వేషకుడు తిరిగి నరదేహము పొందు నధికారము గలవాడయ్యెను; అట్లుకాక పుణ్యక్షేత్రములు, వ్రతములు, మూర్తిపూజలు, ఇంద్రజాలవిద్యలు, నాటకములు, సిద్ధులు, శక్తులు, నియమములు, ఆచారములు, కర్మకాండ, బ్రహ్మజ్ఞానము అనెడి ఝంఝాటములలో చిక్కుకొనిపోయినవానికి ప్రస్తుత నరశరీరము వ్యర్థమైపోవుటయేగాక తిరిగి జన్మమరణచక్రములో పడి దుఃఖము కూడ అనుభవింపవలసివచ్చును. ఏలనన, ఈక్రింది సృష్టినంతను వ్యాపింపజేసి నట్టి బ్రహ్మ, విష్ణు, మహాదేవులును, ముప్పదిమూడుకోట్ల దేవతలునుగూడ జన్మమరణచక్రములో పడియుండగా, అసమర్థుడైనజీవుడు దానినుండి ఎట్లు తప్పించుకొనగలడు? ఈపైన పేర్కొనబడిన దేవతలు మొదలైనవారందరును మాత్రము జన్మమరణములలోనే పడియుండిపోవుదురు. పరిపూర్ణసద్గురువు లభించినచో నతడు ఆ సద్గురుకటాక్షము సంపాదించుకొని తన నిజస్థానమును జేరుకొనగలడు. ఈ వచనమునందు నీకు నమ్మకములేనిచో సంతుమహాత్ముల వచనములను ప్రమాణముగ తీసికొనుము. నీకు ఈ వచనముమీదను సంతుల మహావాక్యములందునుగూడ విశ్వాసములేనిచో నీకు జననమరణచక్రము లోనికి గొనిపోవుమార్గము తెరచియేయున్నది. తిన్నగ నందులోనికి పొమ్ము.

87. పవిత్రగ్రంథములలోను, మతగ్రంథములలోను లిఖితమైయున్న భగవన్నామమును పఠించినందువలనగాని, జపించినందువలనగాని, ప్రయోజన మేమియు నుండజాలదు. నిజమైన సాధువుయొక్క సత్సంగము చేసినందునలననే నామము లభించునట్టి మార్గము ప్రాప్తించును. ఈ యుపదేశము నిజమైన సత్యాన్వేషుల లాభమునిమిత్తము చెప్పితిమిగాని ప్రాపంచికజీవులకొఱకు గాదు.

88. హారమునకు దానిమధ్యనున్న పెద్దపూస యెట్లో యట్లే ఐహిక బంధనములన్నిటికిని నహంకారము మూలమైనది. మధ్యపూసను చేబట్టినచో హారములోని పూసలన్నియు చేతిలోనికి వచ్చును. మధ్యపూసనుండి దారము ఊడదీసినమొదల నన్నిపూసలును జాఱిపోవును. అట్లే సద్గురుకృప ఎవరియం

దుండునో వారే అహంకారమును మొదటికి నరికివేసి ప్రాపంచికవాంఛల నన్నిటిని త్యజించి కేవలము తమ సమకాలికసద్గురు వొక్కరితోనే ఆంతర్య సంబంధ మేర్పఱచుకొనినారు. అట్టివారి జన్మయే సఫలము. అట్లుచేయనివారు ఆకారమునకు మానవులేయైనను యథార్థములో పశువులే. ఈవచనము సత్సంగుల నిమిత్తము చెప్పబడినది. ప్రాపంచికజీవులు దీనియాథార్థ్యమును గ్రహించలేక వితండవాదములు చేయుసాగుదురు.

89. లోకములోనిజీవుల పరిస్థితినిగుఱించి యేమిచెప్పదగును. వారలకేమిచెప్పిన నుపయోగమేమి? ఏలనన, ఈ ప్రపంచములోనున్న గురువులు, శిష్యులు అందఱిలో వెతకిచూచినయెడల నేయొక్కరో గురువులును, ఏయొక్కడో శిష్యుడును మాత్రమే పేరాసలేనివాడు అరుదుగ కన్పట్టును. ఈ మాట జ్ఞాపక ముంచుకొనదగినది. దీనిని మనస్సున నుంచుకొని ఎవరికివారు తమ మనోవృత్తిని పరీక్షించుకొనవచ్చును.

90. సద్గురుసేవయును, శబ్దాభ్యాససాధనయునుచేసి, అహంకారమనెడి మాలిన్యము పోగొట్టుకొనవలెను. అప్పుడే భగవంతుడు ప్రసన్నుడగును. అనగా, అహంకారమును నశింపజేసికొని దీనత్వమును సంపాదించుకొనవలెను. ఏలనన, భగవంతుడు దీనదయాళుడు, జీవుడెప్పుడు దీనుడగునో అపుడే వారు దయాళురగుదురు. అప్పుడే జన్మసాఫల్యమగును కాని, దీనత్వమును సంపాదించుట బహుకఠినము.

91. వక్తసద్గురు నాజ్ఞానుసారము కర్మలను, ఉపాసనలను చేయువారికి మేలుకలుగును. పండితుల కృత్రిమబోధల ననుసరించి వేదములు, పురాణములలో జెప్పబడిన కర్మల నాచరించువారికి నష్టమే కలుగును.

92. సద్గురువును పూజించుట భగవంతుని పూజించుటయే. ఏలనన, "నన్ను గురువుద్వారా ఎవరుపూజింతురో వారిపూజనే నేనంగీకరింతును. గురువును విడిచి ఇతరరీతులుగ పూజసేయువారికి నేను లభించ"నని స్వయముగ భగవంతుడే సెలవిచ్చెను. "గురువును గుర్తించుటకు చిహ్నాలు మాకు చెప్పినచో మాకు గురువెవరో తెలియును. అప్పుడు మేమూ గురువును పూజింతు"మని యెవరైన నన్నచో వారిని, "మీరే భగవంతుని పూజించుచున్నారో ఆ భగవంతుని గుర్తించగలచిహ్నాలు మీరుచెప్పుడు. మీరు భగవంతు నెట్లు కనుగొన్నారో చెప్పు"డని ప్రశ్నించవలెను. భగవంతునిదెల్పు లక్షణములే సద్గురువును గుర్తించుటకుగూడ లక్షణములు. ఏలనన, భగవంతునకును సద్గు

రువునకును భేదమేలేదు. వారిరువురు నొక్కరే. అయినను దేవుని పూజించి నందువలన దేవుడు లభించుట యసంభవము. కాని సద్గురువునకు పూజాసేవలు చేసినందువలన దేవుడు లభ్యమగు ననువిషయముమాత్రము బాగుగ గ్రహించవలెను. దేవుడు, గురువును ఒకరే అయినచో, దేవునినే యేల పూజచేయకూడదు? గురువును పూజింపనవసరమేమి? అని యెవరైన ననవచ్చును. కాని అది అట్లు సాధ్యముకాదు. మొట్టమొదట సద్గురువునకు భక్తిచేయవలెను, అప్పుడే భగవంతుడు లభించును. సద్గురువుద్వారా యెవరు తనను పొందుదురో వారలకే తాను లభింతుననియు, గురుహీనునకు తన సమీపమునకు వచ్చుటకు సాధ్యముకాదనియు, భగవంతుడే యేర్పఱచిన నియమము. అయితే గురువుమాత్రము పరిపూర్ణగురువు కావలెను.

93. ఏజీవునికైన పరిపూర్ణసద్గురువు లభించి అతడు వారియెడల పూర్ణవిశ్వాసముతోను సంపూర్ణదీనత్వముతోను ప్రవర్తించినచో నతనికి బ్రహ్మ, విష్ణుమహాదేవులు మొదలుకొని యెందఱు మహామహాదేవతలు, ఋషులును గలరో వారెవరికి నింతవఱకు లభించనట్టిన్ని, ఇక ముందుగూడ నెన్నడు లభింపశక్యముగానట్టిన్ని పరమపదము సులభముగ లభించగలదు.

94. నిందాస్తుతులు రెండునుగూడ పాపహేతువులే. ఏలనన, నేవ్యక్తిని గుఱించియు నున్నదున్నట్లు చెప్పుట సాధ్యముకాదు. కావున స్తుతి చేయవలెనన్న నెప్పుడు తన సద్గురువునే స్తుతిచేయవలెను. నిందించవలెనన్నచో తన్ను తానే నిందించుకొనవలెను. అట్లు చేయుటవలన జన్మ సఫలమగును. మఱి యెవరిని స్తుతిజేసినను నిందించినను కాలము వృథా వ్యయపఱచుటయే. అయిన నీ నిషేధ మొక్క పరిస్థితిలోమాత్రము వర్తించదు. అదెద్దియన నీకెవరైన నొకడు బంధువైయుండి అతడు మఱొకదుష్టుని మోసములో బడియున్నను, లేక పడిపోవనైయున్నను నీవు ఆబంధువునితో "నీ కిచ్చట లాభము లేదు, నీకు మోసము వాటిల్లగల"దని చెప్పుట యవసరము. అట్లు చేయుటలో పాపమేమియు లేదు. కాని, అట్లు ప్రతిమానవునికిని చెప్ప నావశ్యకము లేదు.

95. తన నిజస్థానమును జేఱుకొనువఱకు నాత్మకు సుఖము కలుగ నేరదు. అందువలన ప్రతిజీవుడును అనవసరమైన యితరవ్యాపారములను కట్టిపెట్టి తన నిజస్థానమైన పరమపదమును పొందువింతలో నుండవలెను. ఏలనన, ఈనరశరీరమందే నిజగృహమును చేరుకొనుమార్గము లభించగలదు కాని, ఈ సమయము తప్పిపోయినచో నాపైన చేయున దేమియు లేదు.

96. సద్గురుసేవయును పవిత్రనామముయొక్క స్మరణభజనలును చేయునంతకాలము పవిత్రనామము నాంతర్యమున పొందసాధ్యముకాదు. కావున, సమకాలికసద్గురుసేవను శరీరమనోధనములతో తనచేతనైనంత యధికముగా చేయవలయును. అట్లుచేసినచో కొంతకాలమునకు సద్గురు దయాకటాక్షములచే అన్నిటియందునుగల బంధనములు తెగిపోయి అతనిహృదయము సద్గురు చరణములందలి ప్రేమతో నిండిపోవును. అప్పు డతని కెట్టికష్టములు, నాపత్తులు వచ్చినను బాధకలుగనేరదు. ఎట్టిసుఖసామగ్రి లభించిననుగూడ మనమున హర్షము గలుగజాలదు. మానవున కట్టిపరిస్థితి గల్గినపుడే అతడు జీవన్ముక్తుడగును. అటుపిమ్మట నతనికి చేయవలసిన దేమియు నుండదు.

97. మరణమన్న భయమును, ముక్తికొఱకు అభిలాషయు నెవరికి గలవో, అట్టివారికే సత్సంగమును, సద్గురువును ప్రియముగ నుందురు. ఐహిక వాంఛలు మెండుగనుండి మరణభయములేనివారు సత్సంగమునకు రాలేరు, సద్గురుభక్తి చేయలేరు.

98. లోకములో నందఱును నామస్మరణ చేయుచునే యున్నారు, ఎవరు నూరకనుండలేదు. అయిన నెవ్వరికిని నామస్మరణవలన ఫలితము గలుగుటలేదు. దానికి కారణమేమన, వారు సద్గురువువలన నామము నుపదేశమునొందక, తమమనస్సునకు తోచిన నామములను స్మరణజేయుచున్నారు.

99. ఏ జీవుడైనను సంతుల సత్సంగమునకు వెడలి అచ్చట సంతుమతముయొక్క రహస్యవిషయములను తెలిసికొన్నను నతని కందువలన నొక వస్తుసామగ్రియొక్క జాబితా చదివించుకొన్నందువలన నెంతలాభమో అంత మాత్రమే ఫలితముండును. సద్గురువు అతనిని తమవానిగ చేసికొననంతవరకు అతనికి నామధనము సంప్రాప్తము కానేరదు.

100. ఏ జీవుడైనను సంతులసత్సంగములోనికి వచ్చినపుడు, సంతులు అతడు కాలునికి తీర్చవలసిన ఋణము ఇంకను ఎంతవరకు మిగిలియున్నదను విషయమును పరిశీలింతురు. అతడు తీర్చవలసినఋణము తక్కువగనుండి, ఒక్కజన్మలోనే తీర్చివేయగలుగునట్లున్నయెడల సంతు లతనిని తమ శరణ్యములోనికి తీసికొందురు; లేక నింక నతడు చాలకాలము కాలుని యధీనములో నుండవలసియున్నచో నతనిని తమ శరణ్యములోనికి తీసికొనరు. అయినను సంతుల దృష్టిలో పడినందువలన వానియొక్క యసంఖ్యాకమైనకర్మలు నశింపజేయబడి ముందుముం దతడు సత్సంగములో జేరుట కధికారముగలవాడగును.

101. మొట్టమొదట అహంకారమనెడి మాలిన్యమును తొలగించుట యావశ్యకము. ప్రస్తుతకాలములో కొందఱు జీవులు స్వబుద్ధినుపయోగించి అహంకారదోషమును పోగొట్టునట్టియు, నామప్రాప్తిని సాధించగలుగునట్టియు పనులను చేయుచున్నారుగాని, వారు ఆ కృత్యములను స్వతంత్రముగా, అనగా సద్గురువుపై నాధారపడకుండ స్వాభిమానముతో చేయుచున్నారు. అందుచే వారల యహంకారము మఱింత వృద్ధియగుచున్నది. అనగా తమమనస్సు చెప్పినట్లు నడచుకొనుచు, మనోముఖులై పోవుచున్నారు; సద్గురువునకు ప్రాధాన్యమిచ్చుటలేదు.

102. సంతుమతములో భగవంతుడు అంశిగను, జీవుడు అంశగను యెంచబడుదురు. అనగా జీవునికిని భగవంతునికిని అంశాంశీభావము చెప్పబడుచున్నది. వేదాంతులు బ్రహ్మమొక్కనికే అస్తిత్వము నీయుదురుగాని జీవుడను ప్రత్యేకపదార్థము వేఱుగనున్నట్లే ఒప్పరు.

103. సద్గురువునెడల భక్తిగలిగి సద్గురువునే పొందగోరునట్టివారు ఎప్పటికైన నిజధామమును పొందగలరు. అట్లుగాక, సత్యనామమును, సత్యలోకమును పొందవలెననుగోరిక కలిగియుండుచు, సద్గురువునందు భక్తిలేకుండనున్నవానికి సద్గురువును లభించరు, సత్యనామమును లభించనేరదు. అట్టివాడు సద్గురువుని సత్సంగముగూడ చేసికొనజాలడు.

104. సంతులు జ్ఞానమును ఖండనచేయరుకాని, మొట్టమొదట చిత్తశుద్ధి సంపాదించుకొనవలయుననియు పిమ్మటనే జ్ఞానమున కధికారము గల్గుననియు సెలవిత్తురు. కావున వాచకజ్ఞానులతో సాంగత్యముచేయక సంతసద్గురువునకు భక్తిచేయుచు, సురతశబ్దయోగమునభ్యసించు చుండవలెను. అందువలన చిత్తశుద్ధియుచేకూరును. నామముకూడ లభ్యముకాగలదు.

105. సద్గురుని సేవకుడెవ్వరైనను ఉత్సాహావేశములతో మాటలాడినపుడు సత్సంగులతనికి సహాయము చేయవలెనుగాని తప్పుపట్టరాదు. ఇంతియగాక అతనిమాటలు తనశక్తికి మించిపోయియున్ననుగూడ నతనికి సహాయమేచేయవలయును. సద్గురువు తమ దయాకటాక్షమహిమచే నతని యత్నములను సఫలము జేయగలరు.

106. చాతకపక్షి స్వాతివర్షముకొఱకు పరితపించినపుడెట్లు భగవంతుడు దాని దయనీయమైన అఱపులనువిని మేఘములను వెళ్ళి వర్షముకురిపించి ఆపక్షి

దాహమును దీర్చుడని యాజ్ఞాపించగా, మేఘములు వెళ్ళి వర్షము కురియునో, అట్లే అంతర్యామియైన భగవంతుడు నామామృతమునకై దప్పిగొని నామ ప్రాప్తికై బాధపడుచుండెడివారి ఆర్తనాదములను విని, సద్గురువును వెళ్ళి తమ అమృతరూపమైన వచనముల మూలముగ వారిదాహమును దీర్చవలసిన దని ఆజ్ఞాపించును. అప్పుడు సద్గురువు ప్రకటమై తమ అమృతవచనములచే జీవులదాహము తీర్చివేయుదురు. భగవంతుడే స్వయముగ వెళ్ళి వారి దాహాగ్ని చల్లార్చలేరు. కావున సద్గురువుయొక్క మహిమ అపారమైనది. ఎవనికి సమకాలిక సద్గురువు లభించి వారియందు పూర్ణ విశ్వాసమేర్పడునో, అట్టివాడు మహాదృష్టవంతుడు. అట్టివాని జన్మయే సఫలమగును.

107. శబ్దముద్వారానే జీవుడు బంధనములోబడియున్నాడు. శబ్దరహస్యము తెలిసినగురువు లభించువఱకు నతడు తిరిగి తననిజస్థానమును జేరుకొనలేడు. ఏలనన, శబ్దమార్గముద్వారానే తిరిగి పైకెక్కి ఆస్థానమును చేరుకొనవలెను. జీవున కీబంధనమునుండి విడిపించుకొనుటకు మఱొక మార్గములేదు.

108. కొందఱు సత్సంగములోనికి వత్తురుకాని, కపట హృదయముతో వత్తురు. పైకి సత్సంగమును శ్లాఘింతురేకాని వారి యాంతర్యమున భక్తిభావము లేశమైననుండదు. ఇది అయుక్తము. ప్రపంచ విషయములలో కపటవృత్తి చూపినను చూపవచ్చును కాని, సద్గురువుతో నెల్లపుడు నిష్కపటముగనే ప్రవర్తించవలెను. భక్తి కొద్దిగనేయున్నను హృదయపూర్వకముగ మాత్రముండవలెను. అప్పుడది ఒకనాటికి పరిపక్వమై భగవంతుడు ప్రసన్నుడు కాగలడు. కపటభక్తి యెంత జేసినను భగవంతుని కంగీకారము కానేరదు.

109. గాలిదుమారము వచ్చినపుడు దుమ్ములేచి కంటి కేమియు కానరాకుండును. అట్లే లోకములో మహానుభావులుగను ఉత్తమ పరమార్థులుగను ఎంచబడునట్టి పండితులకును, కాషాయవస్త్రధారులగు సన్యాసులకును ఆంతర్యమున లోభరూపమైన దుమ్ము కమ్మివేసియున్నది. అందుచే వారికి పరమార్థమన్న నేమియోగూడ కొంచెమైనను తెలియదు; వారియందు భగవంతుడెట్లు ప్రసన్నుడు కాగలడు? ఇందుచే వారును వారి శిష్యులందఱునుగూడ జన్మమరణ చక్రములోనికి పోవుదురు.

110. సంతులమతబోధల నెవరికైన వివరించిచెప్పినను చెప్పవచ్చును. కాని నిష్పక్షపాతముగా చెప్పవలెను. ఏలనన, సంతుల యుపదేశమున కెవరు అధికారులో ఎవరుకారో మొదట తెలియదు. బోధల నుపదేశించినపిదపనే తేటపడగలదు. అధికారియైనవాడు ఆ యుపదేశములను మన్నించును. అనధి

కారి వితండవాదముచేసి కలహముపెట్టుకొనును. దానినిబట్టి అతనివిషయము బోధపడిపోవును. మఱి అట్టివానిని నిర్బంధముచేయకూడదు. సంతుమతము నెవరికిని అసలే చెప్పకూడదను నిషేధములేదు. ఏలనన, బొత్తిగా చెప్పకుండినచో జగత్తులో సంతుమతము ప్రచారమెట్లగును ?

111. భగవంతునికి దీనత్వము ప్రియము. అందుచే జీవుడు దీనత్వము నుత్పన్నముచేయు పనులనే ముఖ్యముగ చేయుచుండవలయును. సంతుల సత్సంగముచేసికొనినచో, దీనత్వము లభించును. పండితులకును కాషాయ వస్త్రధారులకును ధనము భోజనము తప్ప మఱొక యాదర్శములేదు కావున నట్టివారి సాంగత్యమువలన దీనత్వము చేకూరజాలదు, భగవంతుడును ప్రసన్నుడు కానేరడు. ఇది కావలసినవారు తమ కాలములోనున్న సద్గురువు నన్వేషించుకొని వారి భక్తిచేయవలయును. అప్పుడే భగవత్ప్రసన్నతగూడ పొందశక్యమగును. దయాళువులైన సంతులు లభించువఱకు కనిపెట్టుకొని యుండవలసినదే కాని మఱెవరిని సద్గురువుగ స్వీకరించరాదు.

112. లోకములో నెవనికైనను హితోపదేశముచేసినచో నతడు తప్పు పట్టును. అందుచే యుక్తసమయమును కనిపెట్టియే మాట్లాడవలెను. చెప్పిన సలహా నెవరైన మన్నించనిచో వారితో పట్టుపట్టకూడదు. వారి నెట్లైనను ఒప్పించవలయునని యత్నించనుకూడదు.

113. ప్రపంచములోని తాపత్రయములవలన దుఃఖించుచున్నవాడే సద్గురువును గుర్తుపట్టగలడు. ప్రాపంచికతాపత్రయము లెవనికి సుఖముగ నుండునో అట్టివాడు సద్గురువు నెన్నటికి గుర్తుపట్టలేడు. సద్గురువు స్వయముగ ప్రసాదించిన సూచనయే వారిని గుర్తుపట్టుటకు ముఖ్యమైన చిహ్నము. అందుకు మించిన చిహ్నము మఱొకటి యుండజాలదు.

114. ఆదిగల ప్రతిపదార్థమునకు నంతముకూడ నుండవలయుననెడి నియమము సర్వత్ర వర్తించదని సంతులుసెలవిత్తురు. సంతులు ఆదియుండియు నంతములేనట్టి రచననుగూడ తమ దివ్యేచ్ఛచే సృజించిరి.

115. నామములు, వర్ణాత్మకములు[1], ధ్వన్యాత్మకములు[2] నని రెండు విధములు. ధ్వన్యాత్మకనామమువలన మహాఫలితము చేకూరును. వర్ణాత్మక

1. వర్ణాత్మకనామమనగా ఏదైన నొకభాషకు చెంది, ఒక అర్థముగల్గినమాట. అట్టి నామము స్వతస్సిద్ధమైన ధ్వనులను తెల్పదు.

2. ధ్వన్యాత్మకనామమనగా స్వతస్సిద్ధమైన చైతన్యధ్వనులను సూచించు నామములు. చైతన్యధార క్రియాశీలమైనపుడు తనంతటతాను ప్రకటమైన ధ్వనిని మానవు డనుకరించినపుడేర్పడు మాటను ధ్వన్యాత్మకనామమని యందురు. ఇట్టినామములు ఏ మానవభాషలోని పదములును కావు.

నామమువలనగల్గు ఫలితము స్వల్పము. జన్మ, మరణచక్రమునుండి భయపడు వారు ధ్వన్యాత్మకనామమును పొందిన సద్గురువు నన్వేషించుకొని ఆశ్రయించ వలయును. అట్లుచేసినచో వారు జన్మమరణచక్రమునుండి తప్పించుకొనగలరు. వర్ణాత్మకనామములలోనే చిక్కుకొనియున్నవారికి జన్మమరణచక్రమునుండి విముక్తిలభించనేరదు.

116. ఇతరములగు వ్యాపారములన్నియు కట్టిపెట్టి, సమకాలిక సద్గురువు యొక్క ఆజ్ఞలను శిరసావహించి, ఆప్రకారము నడచుకొనుచుండవలెను. అప్పుడే జన్మసాఫల్యము సేకూరును. సకల పరమార్థబోధలకును సారాంశ మిదియే.

117. మానవుడు ప్రాపంచిక పదార్థములు అవసరమని యెంచినంతగ పరమార్థము అవసరమని యెంచుటలేదు. మఱియు ప్రాపంచిక పదార్థములను సంపాదించుట కెంతదీనుడై ప్రవర్తించునో, పవిత్రనామసంపాదనకై అంత దీనత్వముతో ప్రవర్తించుట లేదు. ఒకవేళ అట్లు దీనుడై ప్రవర్తించినను, ఆ దీనత్వము బాహ్యాడంబరమేకాని హృదయపూర్వకముకాదు. సద్గురువు సర్వజ్ఞులు కావున నిట్టిస్థితిలో నామదానము నెట్లు ప్రసాదింతురు? నిజమైన దీనత్వము కలుగకపోవుటకు కారణము అతనికి పరమార్థవిషయములో గాఢాసక్తి లేకపోవుటయే. జీవుడు సద్గురు సన్నిధానమున సంపూర్ణదీనత్వముతో ప్రవర్తించనంతవరకు, నతనికి స్వయముగ భగవంతుడే యుద్ధారమీయ దలచినను గూడ నీయజాలడు.

118. బహిర్ముఖ కర్మలలో కాలక్షేపముసేయువారి కాంతర్యరహస్యముల జ్ఞానము గలుగనేరదు. ఆంతర్యశబ్దోపాసన చేయకుండినచో జీవకల్యాణము సేకూరనేరదు. బాహ్యమున సద్గురువుయొక్క పూజాసత్సంగములును ఆంతర్యమున శబ్దోపాసనయుగూడ నత్యావశ్యకములు. ఈరెండునుగూడ సమానముగ నావశ్యకమైన సాధనలే.

119. వేదమతమునందు విశ్వాసముగలవారు వేదప్రోక్త[1]మైన స్థానమును పొందుటగూడ సమకాలికులైన సద్గురువు నాశ్రయించనిదే సాధ్యము గాదు. అందుచే సమకాలికులైన పరిపూర్ణసద్గురువును వెదకికొని వారిని ఆశ్రయించవలెను. అట్టిసద్గురువు నెంతయెక్కువగా శ్లాఘించినను సమంజసమే.

1. వేదములు ఓంకారమును ఘోషించును. కావున వేదప్రోక్తమైన స్థానమనగా ఓంకారముయొక్క స్థానము. దీనినే త్రికుటియందురు.

అదృష్టవశమున అట్టిగురువు లభించినచో వారిమహిమ యపారము అనంతము నని తెలిసికొనవలెను. వారు బ్రహ్మాదులందఱికన్నను గూడ సర్వోత్తములని చెప్పినచో నందు దోషమేమియు లేదు. ఏలనన, సమకాలిక పూర్ణసద్గురువు సర్వవిధముల మహనీయులే. ప్రాచీనకాలపు మహాపురుషులు, పూర్ణసద్గురువులే అయినను, వారిద్వారా ఇప్పటికాలములో మనకు పరమార్థలాభమేమియు సేకూరజాలదు. ఏమిలభించినను, ఇక్కాలమున సజీవులుగనున్న సంతసద్గురువు మూలముననే లభించవలయును.

120. జీవుని మరపించునదియు కర్మయే, మేల్కొల్పునదియు కర్మయే. ఒకపసిపిల్లవానిని, ఇద్దఱుముగ్గురు ఇతరబాలురు తప్పుడుబుద్ధులుచెప్పి యింటి నుండి దూరముగ తీసికొనివెళ్ళి ఆటలలో పెట్టి, తిరిగి ఆటలైపోయినపిమ్మట వానిని వానియింటికి తీసికొనివెళ్లినట్లే జీవునుకూడ, కర్మకువశమైపోయియే తప్పుతోవను పడును, తిరిగి కర్మవశముననే మేల్కాంచును.

121. గురుభక్తియు, సురత్ శబ్దాభ్యాసమును దప్ప నిక్కాలమున జీవులకు మఱేసాధనయు సఫలముగ చేయశక్యముగాదు. పరమార్థసిద్ధికై మఱొక సాధనలను అభ్యాసములను చేయుట, పామును చంపునిమిత్తము దానిపుట్టమీద కఱ్ఱతో కొట్టినట్లు ఉండును. అట్లు చేయుటచే పాము చంపబడజాలదు. చేయవలసినదేమనగా పామును (ఇచ్చట పాము అనగా మనస్సు సూచింపబడు చున్నది) పట్టుకొనవలెను. అది సద్గురుభక్తివలనను, శబ్దోపాసనమూలము ననే లొంగివచ్చునుకాని, మఱేయుపాయమువలనను పట్టుపడదు. ఈ హితోపదేశప్రకారము ఆచరించనివా రెట్టిపరమార్థలాభము నొందలేరు. వారు స్వయముగ భగ్నాశులగుటయేగాక వారి సలహాప్రకారము నడచుకొనువారుగూడ నట్లే చెడిపోవుదురు.

122. పవిత్రనామము మధురముగ నుండునని సంతులు సెలవిచ్చు చున్నారు. ఐనను దాని నెవరు నిష్టపడుటలేదు. మిఠాయిలు పెట్టినచో నెవరైనను వెంటనే తినివేయుదురు. ఇందుకు (అనగా జగత్తునకు పవిత్రనామము రుచించకపోవుటకు) కారణమేమనగా రోగికి మిఠాయిపెట్టినచో నది యతనికి చేదుగానుండును. మిఠాయి అసలు చేదుకాకపోయినను రోగముమూలమున చేదుగా కనిపించును. కావున ప్రపంచము రోగగ్రస్తమైనట్లు స్పష్టపడు చున్నది. ఇప్పుడు మిఠాయి తియ్యగ రుచించపచేయు నుపాయము చేయవలయును. ఆ యుపాయ మొకచికిత్సకుని శరణుజొచ్చుటయే. అప్పు డతడు

కొన్నాళ్లకు ఆ రోగమును కుదిర్చినపుడు మందు చేదుగ ననిపించిన మిఠాయి ఇపుడు తియ్యగ రుచించును. పరమార్థములో నామామృతముయొక్క ఆనందమును గోరువారు ఇతరయత్నములన్నియు గట్టిపెట్టి, ఒక్కసద్గురుశరణ్యమునే దృఢముగ పొందవలెను. సద్గురువు సర్వసమర్థులు గావున జీవుని నిర్మలమైన వానినిగను, రోగవిముక్తునిగను చేసెదరు; అనగా భోగవాసనలతో నిండి కామక్రోధలోభమోహాహంకారములనెడి పంకముతో పులుముకొనిపోయి యున్నట్టి యంతఃకరణను శుద్ధిచేసి, నామామృతముయొక్క రుచిని తెలిసికొన లేకుండ చేసిన దుర్మ్మతను, కలుషమును పూర్తిగ నిర్మ్మాలించి, అటుపిమ్మట నామముయొక్క ఆనందమునుగూడ ప్రసాదింతురు. ఈ యుపాయము నవలంబించని మానవుడు జన్మమరణచక్రములో దండననే పొందుట కధికారి యగును.

123. సద్గురువుయొక్కయు, తండ్రియొక్కయు క్రోధము నీరునుపోలి యుండును. వారిరువురికిని క్రోధమువచ్చినను గూడ నది లాభకరముగనే యుండును. ఎట్లనగా, నీరు యెంత వేడెక్కినను నిప్పుమీదపడినచో నిప్పును ఆర్పి వేయును. ప్రాపంచికజీవుల కోపము అట్లుగాక, అగ్నిహోత్రమువంటిది. అది యెచ్చటపడిన నచ్చటనే నిప్పు బయల్దేరి కాల్చివేయును.

124. పసిపిల్లవానికి తల్లియందెట్టి ప్రేమయుండునో ఎవనికైనను తన సమకాలికసద్గురువునెడల నట్టిప్రేమ యుండవలెను. పసిపిల్లవాడు తన తల్లివద్ద పాలుత్రాగుచుండినపు డెవరైన నా పిల్లవానిని తల్లివద్దనుండి వేరుచేసినచో నెవ్వరు నూరడించలేనంత యెక్కువగ ఆ పసిపిల్లవాడు బాధపడిపోవును ఎవరైనను సద్గురువును విడిచి వెళ్లి పిమ్మట వారిని గురించి తలపుయే లేకుండ నుండినచో, తమ దారాపుత్రాదుల నొక్కదినమునకైనను విడిచియుండజాలక సద్గురువునుమాత్రము నెలలతరబడి చూడకుండనుండగలిగినచో అట్టివారి యొక్క సద్గురుభక్తిని గురించి యేమిచెప్పదగును? అట్టివారికి నామమెట్లు సంప్రాప్తమగును? వారికి సంసారసాగరమునుండి యుద్ధారమెట్లు కాగలదు? కావున యెవరికి తమ యుద్ధారము కావలెనని ఇచ్ఛయుండునో అట్టివారు సద్గురువునెడల సంపూర్ణప్రేమ కలిగియుండవలెను. అట్టివారికే జీవితోద్దేశము నెరవేరగలదు.

125. సద్గురుని చరణకమలములవద్దనుండి, సత్సంగము చేసికొనుచుండు సత్సంగులును, సాధువులును, కేవలము పొట్టకొఱకై యట్లుండుచున్నారని జను

లనుకొందురు. కాని, సత్సంగులును, సాధువులును దినమునకు అయిదారు గంటలు సత్సంగమును చేయుచుందురనియు, ఎవరిశక్తికొలది వారు భజనాభ్యాసముగూడ చేయుచుందురనియు, కంటినిండ నిద్రపోరనియు, చరణామృత ప్రసాదములమీద నిత్యమును ఆధారపడి యుందురనియు, జనులు తెలిసికొనుట లేదు. ఇవి యన్నియు యెంత మహాదృష్టమైన విషయములు! ఇక ప్రాపంచికజీవులో, కడుపునిండుగ తిని, కంటినిండ నిదురపోవుచు పరమార్థమన నెట్టిదోకూడ తెలియకుండ నుందురు.

126, సద్గురువునుండి ఎవరైనను దూరముగ నున్నంత కాలము దూరమై యుండినట్లు కన్పించినను, అతనికి సద్గురుని సన్నిధానము లభించినతోడనే అతని మనస్సు నిశ్చలమై ఇటునటు నెగురుచున్న తేనెటీగ తేనె దొరకినంతనే దానిని తిరిగి విడువకుండ నెట్లు అంటిపెట్టుకొనియుండిపోవునో, అట్లే దృఢముగ సద్గురుచరణములందు లగ్నమై యుండిపోవును. అట్టివానికి అవ్యర్థమైన గాఢ భక్తియొక్క ఫలితముకూడ చేకూరును. సామూలుగనైనచో నెందఱో సద్గురువు వద్దకు వచ్చుచు పోవుచు నుందురు. వారికికూడ అందువలన లాభము తప్పక కలుగును కాని, అది కొద్దిమాత్రమే.

127. సత్సంగులకొండొరులయెడల ప్రేమయుండవలెను. ఈర్ష్యాభావ ముండినచో వారికి సత్సంగముయొక్క ఆనందము ఆవంతయు లభించనేరదు. పరస్పర ప్రేమ యుండినయెడలనే సత్సంగముయొక్కయు, భజనాభ్యాసము యొక్కయు ఆనందము అందరకును లభించును.

128. సంతులకోపము శ్రేయోదాయకమును, ప్రాపంచికులకోపము హానికరమును. కాని, ప్రాపంచికజీవుల కీవిషయము తెలియదు. అందుచే వారు సంతుమహాత్ములను కోపధారులుగ నెంచుదురు. సంతుల కోపములోగూడ దయాకటాక్షములే యున్నవనియు మూర్ఖుల దయలోగూడ హానియున్నదనియు వారికి తెలియదు.

129. మిత్రునిలోను, శత్రునిలోను, ఇరువురిలోను భగవంతుడే యున్నాడు. అందుచే మిత్రుని మిత్రభావమునందుగాని శత్రుని ద్వేషభావమునందుగాని దృష్టిపెట్టుకొనగూడదు. వారిరువురిలోను భగవంతుడే ప్రేరకుడు. కాని అందఱకు నిట్టి సమదృష్టి యుండనేరదు. అంతర్యమున భగవత్సాక్షాత్కారమును పొందినవారికి మాత్రమే యీ సమదృష్టి యుండును. మీరు సత్సంగము చేయుచున్నారు కావున మీరుకూడ మీ మనస్సులలో నెవరిపైనను

క్రోధము లేకుండ నుండునట్లు అలవాటు చేసికొనవలెను. అయిన నీ విషయము తొందరగ సాధించశక్యమైనది కాదు. ప్రతిదినము సత్సంగము చేసికొనుచు నిత్యము అంతర్ముఖమైన ఆధ్యాత్మిక సాధనలను చేయుచు నుండినచో కొంత కాలమున కీసమదృష్టి చేకూరగలదు.

130. మొదటినుండి చివరవఱకు నీసృష్టియంతయు మాంసరూపమే.[1] అందులో నంతర్గతమైన యుత్తమపదార్థము పవిత్రనామము.[2] కావున సద్గురువునే ప్రధానముగ చేసికొన్నవారే సురక్షితముగ నుందురు. లేనివారికి, ఇతరజంతువుల మాంసమెట్లు నిప్పుమీద వంటచేయబడుచున్నదో, అట్లే వారల మాంసముగూడ జననమరణచక్రమనెడి అగ్నిహోత్రములో పచనమై పోవును.

131. ఇంద్రియవిషయములపైన ప్రీతి మానవునకు తిరిగితిరిగి నరక ప్రాప్తికి హేతువైనను, అట్టి ప్రీతిచేయుట కీమనస్సు పరుగులిడుచుండును; పవిత్రనామమునందును, సద్గురువునందును ప్రేమచేయుట శాశ్వతానందదాయకమైనను అట్టిప్రేమకు వెనుజూపి పారిపోవును.

132. సంతుమహాత్ములు అద్భుతములను ప్రదర్శింపరు. వారు తమ ప్రభుని దివ్యేచ్ఛకు లోబడి ప్రవర్తించుచు గుప్తముగ నుందురు. తనభక్తుని జగమున ప్రసిద్ధునిగ చేయవలయునను దివ్యేచ్ఛ ఆ ప్రభువున కుండినయెడల వారు అద్భుతములను చూపింతురు, లేక గుప్తముగ నుంచుటయే వారిదివ్యేచ్ఛ అయియున్నచో అద్భుతములను చూపించరు. ఏలనన, అద్భుతములను కన పర్చినపిమ్మట సంతులీప్రపంచమునుండి తొందరగా గుప్తము కావలసియుండును. అందువలన నిజభక్తులకు హానికలుగును, ఆడంబరులమూక పెరిగిపోవును. ఈ కాలమున నద్భుతములు, విచిత్రములు చూపుటకు భగవదాజ్ఞ లేదు. అట్టి విచిత్రములను జూడ కోరికగలవారు నిజమైన పరమార్థులుకూడ కానేరరు.

133. తీర్థయాత్రలు, ఉపవాసవ్రతములు, దేవాలయములు, మసీదులలో పూజలును, హిందువులలోను, మహమ్మదీయులలోను అంధప్రాయులైన వారికొఱకేర్పడినవి. కండ్లున్నవారు సమకాలికసద్గురుని పూజయే చేయు

1. ఇచ్చట మాంసరూపమనగా మాయతో తయారైన రూపములన్నియు నని యెంచబడు చున్నవి.

2. ప్రతివ్యక్తిలోను జీవుడున్నాడు కావున, ప్రతివ్యక్తిలోను రాధాస్వామీ నామము లేక శబ్దము ప్రతిధ్వనించుచుండును. నిజమునకు జీవుడు శబ్దస్వరూపము, నామస్వరూపమును.

దురు. ఈ యుపదేశము అందఱికి చెప్పవలసినది కాదు.సత్సంగులును, కండ్లున్న వారును మాత్రమే సద్గురుమహిమను తెలిసికొనగలరు. ఉదాహరణార్థము ఒకవ్యక్తి యెవరైనను లుకమాన్[1] అనెడి వైద్యుని నెక్కువగ పొగడుచు, తనకాలమునాటి సజీవుడైన వైద్యుని నిందించుచున్నాడనుకొనుడు. దానిని బట్టి అతనికి రుగ్మతగాని బాధగాని లేనట్లు తేటపడును. అతనికి బాధయే యుండినచో నతడు తన సమకాలికవైద్యునే శ్లాఘించును. లుకమాను చాల గొప్పవైద్యుడే అయి యుండినను ఇప్పు డెవరైనరోగి ఆవైద్యుని పేరుతో తన రోగమును పోగొట్టుకొనకోరినచో నెన్నటికి నట్లు సాధ్యముకాదు. తనకాలము నాటి వైద్యునివద్ద కేగిననేకాని యతని రోగము కుదరనేరదు. ఇదే విధముగ ప్రాపంచికసుఖములు విషతుల్యములుగ నెంచుచు, మోక్షాసక్తుడై, పరమార్థ చింతతో వ్యాకులపడువానికి తన సమయములో సజీవులైన పరిపూర్ణసద్గురువు వద్దకు వెళ్లువఱకు మనశ్శాంతి గలుగదు. అట్టివానికే సమకాలికసద్గురువు యొక్క మహిమ అవగాహన కాగలదు. ఆడంబరపరమార్థులు తీర్థయాత్రలు, వ్రతములు, విగ్రహపూజలయందును, ప్రాచీనమహాపురుషుల యెడలను విశ్వాసము పెట్టుకొని వ్యర్థకాలక్షేపము చేయుచుందురు. అట్టివారికి సమకాలిక సద్గురువుయొక్క మహిమగూడ అవగాహన కానేరదు.

134. పరమార్థియొక్క కృషియు, సద్గురుని దయయు కూడకూడ నుండును. దయలేనిదే కృషిజరుగనేరదు. మఱియు కృషిచేయనిదే దయ కలుగజాలదు. ఎవరు దయనే ముఖ్యముగ నెంచి యూరకుందురో అట్టివారు సోమరులై పోవుదురు. పిమ్మట వారెట్టికృషిని చేయజాలరు.

135. జీవునకు ఎనుబదినాలుగులక్షల జీవరాసులలోను జన్మలెత్తినపిదప గోవుజన్మ లభించి ఆపిమ్మట మానవజన్మ ప్రాప్తించును. ఈ జన్మలో నతడు సత్కార్యములు చేసినచో, నతనికి ఉద్ధారము జఱుగువరకు మానవజన్మయే లభించుచుండును. జీవునకు అన్నిటికన్న సత్కార్యమెద్దియన తన వంశమును జ్ఞాపకము చేసికొనుటయే. ఏలనన జీవుడు జన్మ యెత్తునట్టి యోనులు మాఱు చుండును కాని, అతనివంశము మారదు. అదియెప్పుడును ఒక్కటియే అనగా జీవులందఱును సత్యనామముయొక్క వంశములోనివారే. కాని, యీ విషయ మును సద్గురు భక్తిచేయుట మూలముననే గాని, మఱొకసాధనము దేనివల నను జ్ఞాపకముంచుకొనుట సాధ్యముకాదు.

---

1. లుకమాన్ అనువాడు పార్సీదేశములో పూర్వకాలములో నుండిన యొకప్రసిద్ధ వైద్యుడు.

136. ఎవరు అంతమును అనగా అంతిమస్థానమును పొంది, అచ్చటనే యుందురో అట్టివారే "బసంత్"[1] పదముచే పేర్కొనదగుదురు. అదియే సర్వోత్తమమైన బసంత్. సమస్తమునకు అంతము, అనగా అంతిమస్థానము వఱకు నెవరారోహించి అచ్చట నివసించెదరో వారికే బసంత్ (వసంత ఋతువు) శాశ్వతముగ నుండును.

137. సత్వరజస్తమోగుణములను మూడింటిని విడిచి సారగుణమైన భక్తి నవలంబించవలయును. అప్పుడే జ్ఞానోదయము గలుగగలదు. పుస్తకముల మూలమునగల్గిన జ్ఞానము విశ్వసనీయముకాదు. సద్గురువునకు భక్తిచేసినందువలన కలిగెడి జ్ఞానమే యథార్థము, పరిపూర్ణమునైన జ్ఞానము.

138. సద్గురువును సేవకుడడిగిన ప్రశ్న:- శబ్దము అన్నిచోట్ల నిండియున్నది. సంతులు శబ్దమునుండియే సృష్టియంతయు ప్రకటమైనదనియు, ఆత్మ శబ్దముయొక్క అంశయనియు సెలవిచ్చుచున్నారు. అట్లైనచో జీవాత్మ అనాహతశబ్దము నేల గ్రహించలేకున్నది ?

సద్గురువుయొక్క సమాధానము:- నిజముగా శబ్దము సర్వత్ర వ్యాపించియే యున్నది. అయినను, ఆత్మ పిండదేశములోనికి దిగినప్పటినుండియు నది బహిర్ముఖవృత్తిగలదై బాహ్యాశబ్దమునందు లీనమైపోయెను. అట్లు బాహ్యాశబ్దమందు అది లీనముకానిచో ప్రాపంచికకార్యము సాగునెట్లు? దానికిప్పుడు పరిపూర్ణసద్గురువు లభించి, అది వారిశరణు పొందువఱకు దానికి ఆంతర్యశబ్దము లభ్యముకానేరదు. జీవాత్మ తల్లిదండ్రులను శరణుపొందుటచే నీప్రపంచములోనెట్లు చిక్కువడిపోయెనో సరిగ నట్లే సద్గురువుయొక్కయు సత్సంగముయొక్కయు శరణ్యము నొందినపుడే అది ఈ ప్రాపంచికబంధనలనుండి విడుదల నొందగలదు.

139. ఈ కాలములో మనస్సును నిర్మలముచేసుకొనుటకు సద్గురువునకును, పవిత్రనామమునకును భక్తిచేయుట తప్ప మఱియేయితర యుపాయము గాని, సాధనముగాని లేదు. చిత్తశుద్ధికొఱకు తీర్థయాత్రలు,ఉపవాసములు,ఇతర

1. హిందీభాషలో "బసంత్" అనుపదమునకు వసంతఋతువు అని యర్థము. ఋతువులన్నిటిలోను వసంతఋతువు ఎట్లుత్తమమైనదో, అటులనే ఈ సృష్టిలో అన్నివిధములైన శరీరములలోను అత్యుత్తమమైన నరశరీరమును సంతుమహాత్ములు వసంతఋతువుతో పోల్చిచెప్పి, దానికి "బసంత్" అనిగూడ పేరిడినారు. "బసంత్" అనుమాటను "బస్" మరియు "అంత్" అను రెండు మాటలుగా విడదీసి, అంత్ అనగా అంతిమస్థానమును పొందినవాడని ఈ మాటకు అర్థము చెప్పినారు. "బసంత్" సుఖసంతోషములను చేకూర్చు ఋతువుగూడనై యున్నది.

యత్నములను చేయుచున్నవారికి అందువలన నేమియు లాభములేదు. పరిపూర్ణసద్గురువు లభించుట నిజముగ కష్టతరమైన విషయమే కాని సత్యాన్వేషులకును సంస్కారు[1]లకును సహజముగనే లభ్యముకాగలరు.

140, కొందఱు అజ్ఞానులైన మహమ్మదీయులు, ముర్షిద్ అనగా సద్గురువు ఇతరు లెవరిచేతను తమకు ప్రణామము చేయించుకొనకూడదని చెప్పుచున్నారు. ఏలనన సద్గురువునకు అందఱిజీవులలోను భగవంతుడు కానవచ్చును గాన భగవంతునిచే నమస్కారము చేయించుకొనినట్లగును. కావున నిది యుక్తము కాదని వారితర్కము. దీనిలో వారి తెలివితక్కువ బయల్పడుచున్నది. సద్గురువులోనున్న భగవంతుడు సర్వజ్ఞుడు; సేవకునిలోని భగవంతుడు అల్పజ్ఞుడు. అట్టి పరిస్థితిలో అల్పజ్ఞుడైన భగవంతుడు సర్వజ్ఞుడైన భగవంతునికి దండప్రణామము లాచరించుట యుక్తమే. అయినను, సద్గురు వెన్నడును తన్నుతాను భగవంతునిగ చెప్పుకొనరు. వారు తన్నుతా నొక సేవకునిగనే యెంచుకొందురు. సేవకుడు మాత్రము తనగురువు నెప్పుడు భగవంతునిగనే మన్నించవలెను. సద్గురువును సాక్షాత్ భగవంతునిగ మన్నించనంతవఱకు కార్యము సఫలముకానేరదు. మౌలానారూమ్‌వారు కూడ నిట్లు సెలవిచ్చిరి:—

చూంకి కర్దీ జాతే ముర్షిదా రా కబూల్ ।
హమ్ ఖుదా దర్ జాతశ్ ఆమద్ హమ్ రసూల్॥

అర్థము:—నీవు ఒక మహాపురుషుని సద్గురువుగ స్వీకరించితివి, గనుక నీ వామహాపురుషునిలో భగవంతుడు, ప్రవక్తయు, నిరువురునుగూడ నున్నారని యెంచుకొనవలయును.

అనగా, ప్రవక్తయు, భగవంతుడును, ఇరువురును సద్గురుస్వరూపములో నున్నారు. తరీఖత్[2] సిద్ధాంతవాదుల కొరకే ఈ యుపదేశము చెప్పితిమిగాని, శరీయత్[3] మార్గము నవలంబించినవారి నిమిత్తమై కాదు.

---

1. సంస్కారములనగా జీవులలో నేర్పడు ముద్రారూపమైన ఛాయలు. ఆ సంస్కారములే పునర్జన్మకు కారణములును, మానవుల ప్రవర్తనలలో మార్పులు గలుగజేయునవియు నైయున్నవి. సృష్టికిపూర్వ మసంఖ్యాకమైన జీవులలో జడపదార్థముతో కలిసిపోవలెననెడి ప్రవృత్తి యుండినది. ఈ ప్రవృత్తియే ఆజీవులను మాయికమండలములోనికి దిగిపోవునట్లు చేసినట్టి మొదటిసంస్కారము.

2. శరీయత్‌లోని నియమములను పాటించుట ముఖ్యముకాదనియు, భగవద్భక్తిసాధనల నభ్యాసముచేయుటయే ముఖ్యమనియు, నమ్మికగల మహమ్మదీయులు తరీఖత్ సిద్ధాంతవాదులని పేర్కొనబడుచున్నారు.

3. శరీయత్ అనగా ఖురాన్‌లోను, హదీలలోను మఱి యితరమహమ్మదీయమతగ్రంథములలోను వ్రాసియున్న నియమములను, ఆచారములను తప్పక పాటించవలయునని విశ్వసించునట్టి మహమ్మదీయులను శరీయత్ మార్గావలంబులని పేర్కొందురు.

మహమ్మద్ ప్రవక్త తా నీప్రపంచమున ప్రకటమైయున్న కాలములో జీవులను తనలోకములోనికి జేర్పించి వారికి మోక్షమును ఈయగల్గుచుండెను. కాని, యిప్పుడు వారేమియు చేయజాలరు. ప్రస్తుత మేమానవునకైనను పరిపూర్ణ సద్గురువు లభించి, అతడా సద్గురుని భగవంతునిగ మన్నించినయెడలనే, అతనికి జన్మసాఫల్యము సేకూరగలదు. మఱొక విధముగ నేమియు లభించ నేరదు గ్రంథములనుండిగాని, మౌల్వీలవద్దనుండిగాని ప్రాచీనపద్ధతులను నేర్చు కొని అవలంబించవచ్చునుకాని, అందువలన నెవనిమనస్సులోను భగవంతుని యెడల ప్రేమ యుత్పన్నము కానేరదు. భగవత్ప్రేమ జనించిననేగాని భగవ త్సాయుజ్యము సేకూరనేరదు. పరిపూర్ణ సద్గురువునందు పూర్ణ విశ్వాసముగల్గి వారిసేవ చేయుటమూలముననే అట్టిప్రేమ యుదయించగలదు. అట్టిప్రేమ సంపాదించుటకు వేఱొకయుపాయ మెద్దియులేదు.

141. మానవునకు మొట్టమొదట తిన్ననైనమార్గము లభించుట యావ శ్యకము. అప్పుడే అతడు తన గమ్యస్థానమును చేరుకొనగలడు. పరిపూర్ణ సద్గురుని సహాయము లేనిదే తిన్ననైనమార్గమును పొందుటకు సాధ్యము కాదు. అయిన నెవరును సద్గురువు నన్వేషించుటలేదు. అందఱును తీర్థ యాత్రలు, ఉపవాసవ్రతములు, మూర్తిపూజలు, నమాజ్[1], రోజా[2], హజ్[3] యాత్రలకొఱకును, విద్యావ్యాసంగము నిమిత్తమును శ్రమపడుచున్నారు. ఈ పనులవలన అహంకారము వృద్ధియగుట యొక్కటియేతప్ప మఱొక లాభ మెద్దియు సేకూరజాలదు. సత్యమార్గమును, నిజధామమును గుఱించిన రహస్య విషయములను సద్గురువువలననే తెలిసికొననగును.

142. శరీయత్ అనగా కర్మకాండకు పూర్తిగ బద్ధులైనవారు ఎల్ల పుడు నీప్రపంచములోనే బంధింపబడి యుండిపోవుదురు. భగవంతుని నెన్నటికిని పొందజాలరు. సమకాలికసద్గురువునకు శరీరమనోధనములను పూర్తిగ నర్పించి సేవచేసినవారికే భగవత్సాన్నిధ్యము లభించును. సద్గురువు స్వయముగ సాక్షా ద్భగవంతుడే. వారికి సేవచేయుట భగవంతునికి సేవచేయుటయే. సద్గురువును ఆశ్రయించకుండ, భగవంతునికొఱకు అన్వేషణచేయువారికి భగవంతు డెన్న

1. మహమ్మదీయులంచేయు భగవత్పూజాధ్యానపద్ధతిని నమాజ్ అని అందురు.

2. రమ్‌జాన్ నెలయంతయు మహమ్మదీయులు రోజు సాయంకాలమువఱకు మౌనముగ నుండి అన్నము, పానీయముగూడ పుచ్చుకొనకుండ నుపవాసము చేయుదురు. ఈ ఉపవాస మును "రోజా" అని అందురు.

3. మహమ్మదీయులు మక్కాకుచేయు తీర్థయాత్రను హజ్ యాత్ర అని చెప్పుదురు.

టికిని దొరకదు. సద్గురుసేవయందు లగ్నమైయున్నవారికి భగవంతుడు లభించియే యున్నాడు. వారు తమకన్ను తెఱచుకొనినతోడనే సద్గురునిలో భగవంతుని గుర్తించగలరు. అట్లు పూర్తిగ కన్ను వికసించనంతవఱకు సంతులయొక్కయు, సద్గురువులయొక్కయు ఉపదేశప్రకారము సద్గురువునందు పూర్ణవిశ్వాసము వహించి సేవాసత్సంగములు చేసికొనుచు, సద్గురుచరణములయందు భక్తివిశ్వాసములు వృద్ధిచేసికొనుచుండవలయును. ఇట్లుండినచో నతనికి ఒకనాటికి గుప్తరహస్యమంతయు ప్రకటము కాగలదు.

143. సమకాలికసద్గురువుయొక్క సేవయే ముఖ్యమైనది. దానివలననే అంతఃకరణశుద్ధి కాగలదు. అంతఃకరణశుద్ధియైన పిమ్మటనే నామదానము ప్రాప్తించును. కావున సద్గురుసేవయందెవరు లగ్నమైయుందురో వారికే సద్గురుకృప సిద్ధించును.

144. అనాహతశబ్దమును పొందకుండ బాహ్యాంతరశుద్ధి సిద్ధించుట యసంభవము. బాహ్యశుద్ధి మొట్టమొదట కావలెను. పిమ్మటనే ఆంతర్యశుద్ధి చేకూరును. అందుచే మొదట సద్గురువు బాహ్యముగ చెప్పిన వచనములను మన్నించవలయును. బాహ్యవచనములను మన్నించనంతకాలము ఆంతర్యశబ్దము సంప్రాప్తము కానేరదు.

145. భక్తి శరీరముతో చేయునది, మనస్సుతో చేయునది, ధనముతో చేయునది, వాక్కుచేతచేయునది అని నాలుగు విధములు. వాచాభక్తి అందఱును చేయగల్గినదే. ఎట్లనగా, పండితులు, వేషధారులైన సన్యాసులు మున్నగువారు సద్గురువు వద్దకు వచ్చి వారిని పరిపూర్ణసద్గురువనియు, వారితో సమానులీప్రపంచములో మఱొకరులేరనియు పొగడుచు, వారికి హారములను గూడ నర్పింతురు, కాని వారిచ్చినహారమును వారికి ప్రసాదముగ తిరిగి ఇచ్చినచో వారు ముఖము త్రిప్పివేయుదురు. దీనినిబట్టి వారు నోటితో నుడివినదంతయు బూటకమనియు తాము బ్రాహ్మణులు సన్యాసులు అనియెడి అహంకారము వీడలేదనియు, సద్గురువును ఒకమామూలుగృహస్థునిగనే భావించుచుండిరనియు స్పష్టపడును. అట్టి వాగ్రూపమయిన భక్తి కేవలము బూటకము. తన శరీరమనోధనములను పూర్తిగ సద్గురువునకెవ రర్పణచేయుదురో, అనగా సద్గురువునకు ముప్విధములైన సేవ చేయుదురో వారిదే నిజమైన భక్తి. మిగిలినవారందఱును కపటభక్తులే. వారి యాంతర్యమున సద్గురునియందు భక్తివిశ్వాసము లుండజాలవు. వట్టిమాటలుమాత్రము చెప్పుచుందురు.

146. జీవుడు సంత్ సద్గురుని సత్సంగములోనికి వచ్చుటయే మొదటి కష్టము. ఏ కారణముచేతనైన నట్లువచ్చినను, సత్సంగములో నిలబడియుండు టయు కష్టమే. ఏలనన, సంతులు వేదములను, పురాణములను, ఖురానును అన్నిటిని ఖండనచేయుచు తమ మతమును సర్వోత్తమమైనదిగను, విలక్షణ మైనదిగను వర్ణించినపుడు, నిజమైన సత్యాన్వేషి అనగా నిజమైన పరమార్థి యొక్కడే నిల్వగలడు కాని మఱొక మామూలుజీవుడు అచ్చట నిలువలేడు. లోకములో జీవులకు వేదమతమునందుగూడ స్వయముగ వారి కెట్టినిదర్శనము కనబడకపోయినను ఇతరులవలన విన్నదానినిబట్టియే విశ్వాసము గలుగు చున్నది. పండితులు, బ్రాహ్మణులు చెప్పినమాటలను బట్టి వేదమతము నెట్లు నమ్ముచున్నారో, అటులనే సంతుల మహావచనములందు విశ్వాసముంచి, సంతులు చెప్పెడి పరమపదమునుగూర్చి నమ్మకముంచవలయును. అయిన నీపని నిజమైన సత్యాన్వేషికే సాధ్యమగును, కాని అంధవిశ్వాసులకు సాధ్యమైనది కాదు.

147. ప్రపంచములో దుఃఖగ్రస్తుడైన మానవునకు మాత్రమే సద్గురువునందు, సత్సంగమునందు ప్రేమగల్గును. కాని ఇదియొక తప్పనిసరియగు నియమమని చెప్పుటకు వీలులేదు. లోకములో కొందఱు దుఃఖగ్రస్తులుగనే యున్ననుగూడ సత్సంగమునందు వారి కెంతమాత్రము నాసక్తియుండదు. నిజమునకు పరమార్థులయొక్క పద్ధతియే వేఱుగా నుండును. ఎవనికి ప్రాపంచికసుఖము లెన్నియున్నను, అవన్నియుకూడ సద్గురువును, సత్సంగమును లేకుండినచో దుఃఖరూపములుగనే కన్పట్టునో అతడే నిజమైన పరమార్థి. ప్రాపంచిక సుఖములనే కోరుచు నాసుఖములు దొరకనపుడును దొరికినపిమ్మట విడువవలసి వచ్చినను దుఃఖాక్రాంతులగుచు ప్రాపంచికసుఖములన్నియు దుఃఖరూపములనియు, చివరకు మోసపుచ్చునవనియు నెవరు తెలిసికొనలేరో వారే ప్రాపంచిక జీవులు.

148. జీవునిమాలిన్యమును పోగొట్టుటకు సత్సంగ మొక్కటితప్ప వేఱొక యుపాయమెద్దియు లేదు. ఎట్టి మలినవస్త్రమునుగూడ సబ్బుపెట్టి యుతికినచో వెంటనే నిర్మలమగునట్లుచేయు శక్తి సబ్బులోనున్నది. గడ్డివోఁగులో నొక యగ్నికణము పడినచో నది యొక్కక్షణములో భస్మమైపోవును. అటులనే సత్సంగమువలన జన్మజన్మాంతరములకర్మలు నశించిపోయి, మానవుని సంస్కారములు దినదినము మాఱిపోవుచుండును.

149. సంతుల మహావచనములను, వేదవాక్యములతో సరిపోల్చి చూచు వారు కేవలము అజ్ఞులు. స్వయముగ వేదకర్తకే సంతులమహిమ యగోచర మైనపుడు దానిని వేదము లెట్లు చెప్పగలవు? మఱియు సంతులేవిషయమునకు గాని, వ్యక్తికిగాని బద్ధులుకారు. ఏ సమయమున నేమార్గము జీవులకు లాభ కరము, యుక్తమునని వారికి గోచరమగునో ఆమార్గమునే వారు ప్రచలితము చేయుచుందురు. ఆమార్గము ననుసరించినవారు లాభము నొందుదురు. లేని వారు దురదృష్టవంతులుగ నుండిపోవుదురు. ఏలనన, లోకములోగూడ రాజ్య ముచేయుచున్న రాజు తన చట్టముల నమలులో పెట్టినపుడు, ఆ చట్టములను మన్నించువారు వానిలాభము నొందుచుందురు. వాని నుల్లంఘనచేయువారు నష్టమునొందుటయేగాక ఆజ్ఞోల్లంఘనశిక్షకుగూడ పాత్రులగుదురు.

150. దయామయులైన సంతుమహాత్ములు జీవునికి "నీవు సత్యపురుషుని పుత్రుడవు, యముని దండన సహింపవలసివచ్చునట్టి పనులను చేయకుము" అని రెట్టించి చెప్పుచున్నారు. కాని యీ జీవుడు సరకుసేయడు. సంతుల వచనములం దతనికి విశ్వాసముండదు. అతడు యమునివలన దండనగల్గునట్టి పనులనే చేయుచుండును. సంతులకు జీవుని నట్లుచేయకుండ బలవంతముగ నాపు చేయగల శక్తిగలదు. వారు కావలెనన్నచో యమునిగూడ పారద్రోలగలరు. కాని వారు తమ దయామయస్వభావమును విడిచిపెట్టరు. కావున జీవునికి హితోపదేశముచేయుటదప్ప మఱెవ్విధముగ నతనిని దండించరు. మహాదృష్ట వంతులైనజీవులు వారి హితోపదేశములను మన్నింతురు, దురదృష్టవంతులు మన్నించరు.

151. సంతులు జీవునికి పలువిధముల నచ్చచెప్పి బోధపఱచుటలో వారి యుద్దేశ్యమేమనగా ఒకస్త్రీ యేవిధముగ తనభర్త నాశ్రయించి, మఱెవ్వరితో జోక్యముపెట్టుకొనకుండనుండునో, జీవుడుకూడ నట్లే, అన్నిదిక్కులను విడిచిపెట్టి సద్గురువు నొక్కరిని దృఢముగ నాశ్రయించునట్లు చేయుటయే. కాని ప్రస్తుతకాలపు గురువులు చేయుచున్న దేమనగా వారు శిష్యులనైతే చేర్చుకొనుచు, వారికి తీర్థయాత్రలు, వ్రతములు, విగ్రహపూజలను చేయుటయే యుపదేశించుచున్నారు. కాని (గురువులగు) తమను పూజింపవలసినదిగా మాత్రము బోధించుటలేదు. ఇందుకు కారణమేమన, వారు గురుపదవి కర్హులు కారు. అందుచే వారిని గురువులుగ స్వీకరించకూడదు. వారు స్వయముగ త్రోవతప్పిపోయియుండుటయేగాక, నితరులనుగూడ భ్రమపెట్టి పథభ్రష్టుల

చేయుచున్నారు. సంతులొక్కరికే గురుపదవి నలంకరించుట కధికారము కలదు. జీవుని కుద్ధారమెప్పుడు కలిగినను సంతుసద్గురువువలననే కలుగవలయును. ప్రాపంచికగురువులమూలమున నుద్ధారము లభించనేరదు. బ్రహ్మ, విష్ణు, మహాదేవులు, ఈశ్వరుడునుగూడ జీవుని జన్మమరణచక్రమునుండి తప్పించ లేరు. కాని, సంతులు తప్పించగలరు. ఈ ప్రపంచమునుండి భయభీతులై నట్టియు, ఇందలి బాధలచే దుఃఖితులైనట్టియు జీవులుమాత్రమే సంతుల సత్సంగములోనికి వచ్చి చేరగలరు. మఱొకజీవు డెవ్వడును సంతులయెదుట నిల్వజాలడు. జీవునకు సంతుల మహత్తునుగుఱించి అంత దృఢవిశ్వాస మేర్పడినపుడే అతడు పండితులయొక్కయు, కాషాయవస్త్రవేషధారుల యొక్కయు మోసములకు లొంగిపోకుండ సంత్ సద్గురువొక్కరినే శ్రద్ధాభక్తులతో నాశ్రయించును. సత్యాన్వేషి పరిపూర్ణసద్గురువు లభించువఱకు నన్వేషణక్రమమును జరిగించుచునే యుండవలయును. జీవితమంతయు సద్గురువు నన్వేషించుటలోనే గతించిపోయిననుగూడ నేమియు నష్టములేదు. ఏలనన, అట్టి యన్వేషకునకు తిరిగి నరశరీరమును లభించును. సంత్ సద్గురువుకూడ తప్పక లభించెదరు. అతనికి తీవ్రమైన ఆసక్తియున్నచో సద్గురు వీజన్మలోనే లభించగలరు. అట్లుగాక నెవరైన పండితులయొక్కయు, కాషాయవస్త్రవేషధారులయొక్కయు జాలములో చిక్కుపడిపోయినచో, నతనికి దారాపుత్రధనసంపత్తులు, ప్రాపంచికాదరగౌరవములు నెన్నిలభించినను లభించవచ్చునుకాని జన్మమరణచక్రము నుండి విమోచనముమాత్రము గలుగనేరదు. అంతియగాక తిరిగి మానవజన్మ లభించునను నమ్మకముగూడ లేదు.

152. సద్గురు నాజ్ఞలను పూర్తిగ శిరసావహించుచు, నట్టిఆజ్ఞల నెంతమాత్రమతిక్రమించకుండ నుండువాడే గురుముఖుడు. అవ్విధమైన మనఃప్రవృత్తి గలుగనంతవఱకు నెవ్వరు నాపదమున కధికారులు కానేరరు. ఈవిషయము చాల దుస్సాధ్యమైనదే. కాని, సద్గురు వేపనులవలన ప్రసన్నులగుదురో అట్టిపనులనే చేయుచు, అనగా, సద్గురువునకేసేవచేసినను వారి ప్రసన్నతనే ప్రధానముగ నుంచుకొని చేయుచు, సద్గురువు ఈతని మనసునకు కష్టముతోచునను తలంపుతో నాసేవ నంగీకరించుచుండిరో, లేక నిజముగ వారికి ఇష్టమై అంగీకరించుచుండిరో అను సంశయము నెల్లపుడు గమనించుకొనుచు, సద్గురువా సేవను, తమకా సేవవలన శ్రమగలుగుచున్నప్పటికిని, సేవకుని పట్టుమూలమున నంగీకరించుచుండిరని బోధపడినపుడు తా నాసేవను వెంటనే విడచివేయునట్టి వివేకముతో నెవరు ప్రవర్తించుచుండునో, అట్టివాడే గురుముఖుడు కాగలడు.

అట్టిస్థితిని పొందనివారు నియమముగ సత్సంగముచేసికొనుచు, సద్గురుని మహా వచనములను శ్రద్ధగా వినుచు, వానిని మననముచేసికొనుచు నుండవలెను. అట్లైనచో వారి స్వభావముగూడ క్రమేణ మార్పుచెందగలదు.

153. సమస్తజీవుల హృదయములు అహంకారమనెడి మాలిన్యముతో నిండియున్నవి. ఆ మాలిన్యము తొలగిపోనంతవఱకు వారు పరమార్థమును సాధించలేరు. ఈమాలిన్యము బహిర్ముఖోపాసనలవలన తొలగనేరదు. అందుచే నంతర్ముఖోపాసన యవశ్యముగ చేయవలసియున్నది. ఈ యుపాసనావిధాన రహస్యము పరిపూర్ణసద్గురువు తప్ప మఱెవరును చెప్పజాలరు. కావున ప్రతి పరమార్థాభిలాషియగు జీవుడును మొట్టమొదట తన సమకాలిక పరిపూర్ణ సద్గురువు నన్వేషించుకొని, వారిసేవ చేయుచుండుట యవసరము. అప్పుడే అతని యుద్దేశ్యము సఫలము కాగలదు.

154. ఈ జీవున కందఱును శత్రువులేకాని మిత్రులెవరును లేరు. త్రిగుణములతో మిశ్రితమైయున్న మనస్సుకూడ, పిల్లి ఎలుకను మ్రింగునిమిత్తమై యెదురుచూచుచున్నట్లు ఈజీవునివైపు చూచుచుండును. ఇంతియగాక కాలుని జీవులైయుండి, కాలుని ఆజ్ఞలను మన్నించుచు, అనగా మనస్సుచెప్పినట్లు నడచుకొనుచున్నవారినికూడ కాలుడు బాధలుపెట్టుచునే యుండును. ఇవ్విధముగ సమస్తజీవులును దుఃఖగ్రస్తులైయే యున్నారు. కాని సద్గురువునకు చెందినజీవుల పైన, అనగా సద్గురువునందు విశ్వాసముగల జీవులపైన సద్గురువుయొక్క దయాకటాక్షము లుండును. కాలుడుకూడ వారికి భయపడుచు వారికి సహాయమునే చేయుచుండును. అందుచే నందఱును సమకాలికసద్గురువుయొక్క శరణుపొందవలెను. అట్లు చేసినచో నట్టివారల కిహపరముల రెండింటగూడ కాపుదలయు రక్షణయు నుండును.

155. ఒకటిరెండువేలమంది నేదైన నొక పదవిలోనికి భర్తీచేయదలచినపుడు వేలకొలది అభ్యర్థులు అందులో చేరుటకై వచ్చెదరు. కాని వారిలో నేబది లేక నూరుమందిమాత్రమే యోగ్యులైనవారుందురు. శేషించినవారందఱును తరతమ భేదములలో నసమర్థులుగ నుండుచు, నందులో కొందఱు పూర్తిగ నసమర్థులుగూడ తేలుదురు. అటులనే, సద్గురువు తమ సత్సంగమును జనసామాన్యమందఱకు తెఱచివైచినపుడు యెందఱో జీవు లనేకవిధములైన వాసనల గైకొని వచ్చుచుందురు. అందుండి కేవలము నిర్మలపరమార్థవాసన గలవారిని మాత్రమే సద్గురువెన్నుకొని మిగిలినవారిని భవిష్యములో గైకొన

దలచిన అభ్యర్థులుగ నుంచుదురు. పరమార్థభాగ్యము గలవారు మాత్రమే సంతుల సత్సంగములో నిలచియుండగలరు. శేషించినవారు తమంతటతామే విడచి వెడలిపోవుదురు. వారికి యథార్థమైన నిర్మలపరమార్థవాసన లేకపోవుటచే వారు అచ్చటిపరీక్షకు తాళలేరు. అందుచే సంతులుగూడ నట్టివారిని బలవంతముచేయక భవిష్యములో సత్సంగాగ్హతగలుగులాగున వారియందు దయచూపుదురు.

156. వేలకొలది బ్రహ్మలు, వేలకొలది గోరఖులు[1], వేలకొలది నాథులు[2], వేలకొలది ప్రవక్తలును తృష్ణాగ్నిలోపడి దహించుకొనిపోవుచున్నారు; ఏలనన, వారికి సద్గురువు లభించలేదు. అట్టి మహామహులకే సద్గురువుయొక్క గుర్తు దొరకకుండినపుడు, సామాన్యజీవునకు సద్గురువును గుర్తుపట్టు టెట్లు శక్యమగునని యెవ్వరైన ప్రశ్నించవచ్చును. అందుకు సమాధానమేమన, వారందఱును తమతమ హోదాల యహంకారములో నిండిపోయియుండుటచే, వారెవరికిని సద్గురువునందు విశ్వాసము కుదరలేదనియు, అందువలననే సద్గురువుకూడ తమ్ము తాము వారెవరికిని ప్రకటపఱచుకొనకుండ నుండిపోయిరనియు, నింతియగాక, వారందఱును సృష్టికార్యము జరిగించుటకు నియోగింపబడిన అధికారులు అగుటచే వారాకార్యమును సాగించుచుండుటయే యుక్తము కావున కూడ సద్గురువు వారికి తమ్ము ప్రకటపరచుకొనలేదనియు చెప్పవచ్చును. వారలకు సద్గురువునందు విశ్వాసము కుదిరినయెడల సృష్టికార్యము వారలచే సాగింపబడుట యసంభవము. ఈ ప్రపంచముయొక్క యేర్పాట్లకు ఆవిధముగా భంగముకలుగ జేయుటగూడ భగవదేచ్ఛకాదు. వీరందఱును ప్రాపంచికజీవులను కాపాడుచు నుండునిమిత్తమై సృజింపబడిరి. సద్గురువుయొక్క బోధలు అట్టి జీవుల నిమిత్తమై కాదు. అట్టి జీవులు సద్గురుని ఉపదేశములనుగూడ మన్నించరు. వారి చిత్తములో సద్గురువునందు భక్తిభావమును జనించనేరదు. ఇప్పుడు సద్గురువు రెట్టించి చెప్పునదేమనగా, వేలాదిజీవులు విశ్వాసము వహించియున్నట్టి అంతంత మహామహావ్యక్తులే జన్మమరణచక్రమునుండియు, నరకాగ్నినుండియు తప్పించుకొనలేనప్పుడు సామాన్యజీవు లెట్లుతప్పించుకొనగలరు? కాని పరమార్థభాగ్యము ఎవరికి కలదో జన్మమరణచక్రమునుండి యెవరికి ఉద్ధారముకానై

1. గోరఖనాథు 15 వ శతాబ్దములో జీవించియున్న యొక ప్రసిద్ధసన్యాసి.

2. గోరఖనాథుని గురువగు మత్స్యేంద్రనాథుడుగూడ నొక ప్రసిద్ధసన్యాసి. ఆయన అనుయాయులను నాథులని పేర్కొందురు.

యున్నదో, అనగా నిజమైన భగవంతుని పొందవలెనని యథార్థమైన నిర్మలాసక్తి యెవరికిగలదో, అట్టి జీవులకే యీ యుపదేశమునందు విశ్వాసము కలుగును. అనేకవిధములైన సాంసారికవాసనలతో నిండినవారికి సద్గురువచనములందు విశ్వాసమేర్పడనేరదు. ఒక్క విషయము అందఱును స్పష్టముగ గ్రహించవలెను. అదేమన, జన్మమరణములనుండి తప్పించగలవారును, శాశ్వతానందస్థానమును ప్రసాదించగలవారును, నిజధామమునందు జేర్పించగలవారును సంతసద్గురు వొక్కరు మాత్రమే. కాని, బ్రహ్మ, విష్ణు, మహాదేవులు, అవతారపురుషులు, దేవతలు, పీర్లు, ప్రవక్తలు, ఔలియాలును స్వయముగ గురుహీనులు అనగా, వారు సంతుసద్గురువును పొందలేదు. కావున, జన్మమరణచక్రమునుండి వారు తమ్ముతాము తప్పించుకొనలేరు, ఇతరులను తప్పించనులేరు. ఎవరెవరు ఈవచనమునందు విశ్వాసముగలిగి సద్గురువు నన్వేషణచేయుదురో వారే సద్గురువును పొందుటకధికారులు. అట్టివారికే సద్గురువు లభించి మహాదయతో వారి జీవకార్యమును నెరవేర్చుదురు. మఱియు నట్టివారే జననమరణరహితులగుదురు.

157. రెండు పెద్దపులు లీజీవుని వెంటాడించుచున్నవి:- అందొకటి కాలుడు, రెండవది మనస్సు. ఈ రెండింటిని చంపివేసిననే గాని పరమార్థసాధన సాగనేరదు. ఒక్క సద్గురువు దప్ప వీనిని చంపువారు మఱెవ్వరును లేరు. కావున సంత్ సద్గురుని శరణుజొచ్చినవానికే వీనిమీద విజయముసేకూరును. అట్టివాడే యీ యిరువురిస్థానమును దాఁటి పైకి వెడలిపోగలడు.

158. సద్గురుని గుమ్మమువద్ద యాచకులుగ నున్నవారికి పరువుప్రతిష్ఠలలో లోపమురాదు. ఏలనన, నందఱును సద్గురుని యాచకులే. సద్గురువు యొక్క యాచకులుకానివారీసృష్టిలో నెవరునులేరు సద్గురునినుండి యాచన చేయుటకు సంకోచనచేయువారును, లజ్జపడువారును కాలునిముందఱ దీనులై కాలునిదండనకు పాత్రులగుదురు, సద్గురువు వద్ద యాచకులైనవారే మహాదృష్టవంతులు.

159. వేదములు, పురాణములందును విశ్వసించువారు, ఒక్క క్షణమాత్రకాలము సత్సంగముచేసినచో జీవుని పాపములు నశించిపోవునని చెప్పుదురు. అట్టిచో సంతుమహాత్ముల సత్సంగముయొక్క ప్రభావమును గుఱించి యేమిచెప్పదగును ? వేదములు, పురాణములే దాని ప్రభావమును వర్ణింపజాలవు. ఎవరికి సంతుమహాత్ముల సత్సంగము సంప్రాప్తమయినదో, అట్టి

వారిచే దినమంతయు చేయబడిన పాపములు నశించుచునుండి యుండునవి చెప్పుటలో సందేహమావంతయు లేదు. యీ మాత్రపు ఫలితము, నిత్యము సత్సంగమునకు సామాన్యముగా వచ్చుచు నచ్చటిమహావచనములను వినువారందఱికిని గలుగును. సంతులయందు విశ్వాసముగలిగి, సమకాలికసద్గురువు నందు భక్తిచేయునట్టివారికి లభించు ఫలితమైతే వర్ణింపశక్యము కాదు.

160. సంతుమహాత్ములను శ్లాఘించువారికిని, నిందించువారికిని, ఉభయులకు నుద్ధారము గలుగును. కాని సంతులశిష్యుడైయుండి వారిని నింద చేసినయెడల నతనికి హానిజరుగును. అట్టివానిచే చేయబడునింద సహింపబడ నేరదు.

161. వచనములను శ్రద్ధగావినుచు, హృదయపూర్వకముగా మన్నించు వారికే ఫలితముదక్కును. పైపైనుంచి వినువారియొక్కయు, పైపైమాటలు చెప్పువారియొక్కయు వచనములకు ప్రభావ మేమియునుండదు. ఏలనన, అనేక పండితులు, అనేకకాషాయవస్త్రవేషధారులును గ్రంధములను పఠించుచు, బోధించుచునే యున్నారుకాని, దాని ప్రభావ మొకించుకగూడ నా చెప్పువారి యొక్కయు, వినువారియొక్కయు చిత్తములందు గలుగుట లేదు.

162. జీవునకు సద్గురువుయొక్క దయాకటాక్షములు గలుగునంతవఱకు వారి చరణములందు విశ్వాసము గలుగనేరదు. సద్గురుచరణములందు భక్తివిశ్వాసములుగలవాడే దయాపాత్రుడని తెలిసికొనవలెను. చాలమంది తమ బంధువులకును, కుటుంబీకులకును సద్గురుచరణములందు భక్తివిశ్వాసములు గలుగవలయునని కోరుచుందురు. ఇట్టికోరిక యుండుట తప్పులేదు. కాని, యేజీవునికైనను సద్గురునియొక్క దయాదృష్టి పడనంతవఱకు సద్గురువునందు భక్తివిశ్వాసములు జనించుట కష్టమనువిషయముమాత్రము గ్రహించవలయును. ఈ విషయము సద్గురువుయొక్క దివ్యేచ్ఛకు వదిలిపెట్టవలసినదే. ఏలనన, వారికిచ్ఛగలిగినపుడు వారేజీవునికైన నొక్కక్షణములో భక్తివిశ్వాసములను ప్రసాదించి, యీ ప్రాపంచికజాలమునుండి తప్పించుదురు.

163. సంతులసత్సంగికి మరణకాలమునందు కష్ట మేమియునుండదు. పైగా, అతడు మొదటినుండియు, మరణమును జ్ఞప్తియందుంచుకొని, ప్రాపంచికవిషయములలో కార్యమాత్రముగనే వ్యవహరించుచు నుండును గావున మరణసమయమున నతనికి మఱింత ధైర్యముగ నుండును. అతని ప్రాపంచిక బంధనములు ల్రదివఱకే త్రెంపివేయబడియున్నవి. కొట్టివేయబడిన చెట్టుయొక్క

పేచ్ఛాదన మొట్లు స్వల్పదినములుమాత్రమే యుండి నశించునో, సంతులసత్సంగీకీ ప్రాపంచికవ్యవహారములలో బంధనములుగూడ నట్లే నశించునవియని తెలిసి కొనవలెను.

164. సంతులసత్సంగమును సరియైనవిధముగ చేయుట చాలకష్టమైన పని. కొందఱిపరిస్థితి యెట్లుండుననగా, వారు సత్సంగముచేయుచుందురు కాని, నిజముగ సత్సంగముచేయునట్లే చెప్పవలెను. అనగా వారు సత్సంగములో కూర్చుండి సంతులయుపదేశమును వినుచున్నట్లే యుందురు, కాని, ఆ ప్రకార మాచరించు నుద్దేశ్యముతో వినరు. అట్టి పరిస్థితిలో వారికి సత్సంగమువలన లాభమేమియుండును? ఆ యుపదేశములవలన నెవరైన ప్రభావితులై, వారి ఆచరణనుగూడ కొద్దిగొప్పఆయుపదేశములప్రకారము మార్చుకొనుచున్నప్పుడే వారా వచనములు వినుటయు, నవగాహనచేసికొనుటయు సార్థకమని చెప్పదగును.

165. మతగ్రంథములలో కొద్దిగొప్ప పరస్పర విరోధార్థములుగల వచనము లన్నిచోట్ల నుండుచునే యుండును. ఏదైన నొకవిషయమున నొక చోట ఖండనమును, మఱొకచోట మండనమును కనిపించుచుండును. జీవులకు ఆఖండన మండనములలో దేనిని గ్రహించవలయునో, దేనిని పరిహరించవల యునో తెలిసికొనుట కష్టము. అందుచే పరిపూర్ణసద్గురువు లభించునఱకు నీవిషయములను నిర్ధారణచేసికొనుటకు సామాన్యజీవునకు శక్తిచాలదు. గ్రంథ ములు ప్రమాణములుగామాత్రమే యుపయోగించుకొనవచ్చును. కాని, జీవుని నవి సరియైన ఆధ్యాత్మికమార్గమున ప్రవర్తింపజేయజాలవు. సత్యమార్గ రహస్యమును తెలిసినవారు సద్గురువొక్కరే. ఆమార్గము వారివలననే లభించ వలయును, గాని మఱెవరివలనను లభించనేరదు.

166. సమస్తాశ్రయములను విడచిపెట్టి, యెవరు సద్గురువు ఒక్కరిపైననే ఆధారపడియుండునో, సంతులంరఱిమతమునకు మూలాధారమైనశబ్దము నెవరు దృఢముగ గ్రహించియుండునో, గురుభక్తికి భంగకరమైన కార్యముల నెవరు చేయకనుండునో, అట్టి యతడే సాధువు అగును. కావున, నట్టివాడే నిజమైన గురుభక్తుడును, సాధువునుకూడ.

167. జన్మమరణచక్రమునుండి భీతియు, పరమార్థముకొఱకు కాసక్తియు కలవానికే సద్గురునియందు ప్రేమయుండును. అట్టివానికే సద్గురువునందు దృఢ

విశ్వాసముగూడ కలుగును. అద్భుతములను చూపుడని కోరువారును, అట్టి అద్భుతములను చూపించనిచో సద్గురునియందు విశ్వాసము కలుగనివారును పరమార్థులు కానేరరు. వారికి సద్గురునియందు భక్తిభావ మేర్పడనేరదు. అట్టి విధముగ అద్భుతములను చూపి అందుమూలమున జీవులకు విశ్వాసము గలిగించుటకు భగవదేచ్ఛలేదు. ఏలనన, అద్భుతానుభవములమూలమున గలిగెడి విశ్వాసము నిలకడగనుండు ననుసమ్మకము లేదు. సద్గురువుయొక్క దర్శనము వచనములు నెవరికి ప్రియముగనుండి, అవి లభించనిచో మనశ్శాంతియుండదో, అట్టివారి విశ్వాసమే నిజమైనది. అట్టివారికి ఆంతర్యానుభవములుగూడ గలుగును. కాని, కేవలము అనుభవములు, అద్భుతములను మాత్రము గోరువారికి అట్టిమహిమలను చూపుటకు దివ్యేచ్ఛలేదు.

168. జీవుని తననిజస్థానమునకు జేర్చుటకు శబ్దమొక్కటిదప్ప వేఱొండు మార్గములేదు. మిగిలినమార్గములన్నియు, కాలునిమార్గములు. ప్రతివ్యక్తియాంతర్యమునను శబ్దమున్నది. కావున దానిని శ్రవణముచేయువలయును. అట్లు విననివారు అంత్యకాలమున బాధపడుదురు. బాహ్యావాయిద్యములు, గానములచే నీవిషయము సిద్ధించనేరదు. సంతుమహాత్ముల సంప్రదాయములోనివారై యుండిగూడ, శబ్దము నాంతర్యమున నన్వేషణచేయనివారికి శిక్షయధికముగ నుండును.

169. పండితులు జీవులను విగ్రహములకును, పుణ్యక్షేత్రములకును భక్తులుగ చేయుటచే తమ గణ్యతను కోల్పోయిరి. సంతులు తమ మతమును వేదశాస్త్రముల కతీతమైనదిగ సెలవీయగా, పండితులును, కాషాయవస్త్ర వేషధారులును దానివిశిష్టత తెలిసికొనలేక జీవుల నపభ్రమలలో బెట్టి తమప్రవత్తిని గూడ నశింపుజేసికొనిరి. ఇప్పుడు తీర్థయాత్రలు, శాస్త్రపాఠములు చేయువారును, విగ్రహారాధకులును, జన్మమరణచక్రములో పడిపోవుదురని సంతులు స్పష్టముగా సెలవిచ్చుచున్నారు. మఱియు కర్మకాండను, అపభ్రమలను విడచిపెట్టి సమకాలికసద్గురుని శరణ్యము పొందవలయుననియు, జన్మమరణముల నుండి విముక్తినొందుట కదితప్ప మఱొకయుపాయము లేదనియుగూడ సంతులు మహోదయతో బోధించుచున్నారు. ఎప్పుడుకావలెనన్న నప్పుడే చేసికొనుము, కాని, యెప్పుడుచేసినను, చేయువలసినసాధన యిదియే. ఈపద్ధతి నేతప్ప మఱొక పద్ధతిగా జననమరణచక్రమునుండి విమోచన గలుగనేరదు. వినుము, వినక పోందుట, మీా యిష్టము.

170. జీవుడు, బ్రహ్మయు, నిరువురును సోదరులే. అయితే బ్రహ్మ కొక కార్యాధికారము లభించినది. జీవులందఱును ఆయన ఆజ్ఞలకు అధీనులై యున్నారు. ఇరువురిలో వ్యత్యాస మింతమాత్రమే. దేహమును నిర్మించి పాలించుకార్యము బ్రహ్మ, విష్ణు, మహాదేవుల కప్పచెప్పబడినది, జీవులను ప్రపంచములో బంధించియుంచుట కూడ వారికర్తవ్యమే. కాని జీవులకు ముక్తి యిచ్చుట కధికారము సంతులకు తప్ప మఱెవరికినిలేదు. ఏలనన, జీవుడు బ్రహ్మయును భగవంతుని యంశలుమాత్రమేకాని, సద్గురువొక్కరే భగవంతునితో తద్రూపమైనవారు. అనగా సంతులు సాక్షాద్భగవంతుడే. ఏలనన, భగవంతుడు జీవుల కుద్ధారముచేయునిమిత్తమై స్వయముగ సంతుమహాత్ములరూపమును ధరించి, ఆస్వరూపముతో బ్రహ్మ, విష్ణు, మహాదేవులకుకూడ లభ్యముకానట్టి పదమును జీవునకు ప్రసాదించుచున్నారు. అయితే, సద్గురుచరణముల యందు భక్తివిశ్వాసములు దృఢముగ నుండవలెను.

171. ఆదిలో పురుషుడొకడే యుండెను. తిరిగి ఆయన ఇరువురుగ మాఱి, పిమ్మట మువ్వురుగను, ఆతరువాత అనేకులుగ వేలు, లక్షలకొలదియు, చివరకనంతసంఖ్యాకులుగను వృద్ధియయ్యెను. ఆదియందున్న ఏకైకపురుషునితో నైక్యముచెంది, ఆ ఏకైకపురుషుని భౌతికస్వరూపముగనున్న సంపూర్ణసద్గురు వెవరికైనను లభించినచో, నపుడు వారిదయవలన జీవుడనేకత్వభ్రమనుండి తొలగి తన నిజస్థానమునందు చేరుకొనగలడు.

172. జీవులందఱకును, ప్రాపంచికకార్యముల ఫలితములు ప్రత్యక్షముగ కన్పట్టును గావున వారిసంసారములో త్వరితముగ నాకర్షించబడి చిక్కుకొనిపోవుదురు. పరమార్థకార్యముల ఫలితము గోప్యముగ నుండును కావున జీవునకు పరమార్థమునందు త్వరితముగా నమ్మకము గలుగనేరదు. నమ్మికగల్గుట ప్రథమావశ్యకవిషయము. ఏలనన, విశ్వాసములేనిదే సాధన యొకించుకగూడ సాగనేరదు. సాధన ఏమియుచేయనిదే ఫల మెట్లుచేకూరును ? పారమార్థికాభివృద్ధి యెట్లుగల్గును ?

173. సత్యవస్తువు జపతపములవలనను, మౌనవ్రతమువలనను పొందశక్యము కాదు. అట్టిసాధనలు చేసినవారందఱును విసిగివేసారిపోయిరేగాని, వారిలో నొక్కరుగూడ సంతులుపొందిన సత్యవస్తువుయొక్క రహస్యమును పొందలేదు. ఆ రహస్యము సమకాలికసద్గురువుయొక్క శరణ్యమునొంది వారి

సేవ చేసినందువలననే లభించగలదు. ఏలనన, ఆ సత్యవస్తువే స్వయముగ సద్గురు స్వరూపమును ధరించియున్నది. కావున, సత్యవస్తుప్రాప్తికొఱకు ఆసక్తిగల జీవులందఱును కర్మ, భ్రమలను విడచిపెట్టి సమకాలికసద్గురువుయొక్క ప్రసన్నత సంపాదించుకొఱకై పరిశ్రమచేయవలసియున్నది. అట్లు చేసినచో ఒకనాటికి ఆ పదమును పొందగలరు.

174. బాల్యములో వైధవ్యమునొందిన స్త్రీకిని, బాల్యములో సాధువైనవానికిని జీవితము సవ్యముగా గడుపుకొనుట చాల కష్టము. అట్టివారు చాలమంది పతితులైపోవుచుందురు. కాని వారు పరిపూర్ణసద్గురువును పొంది, వారియందు విశ్వాసముగల్గియున్నచో, వారిరువురికినిగూడ జీవితములు సుఖముగనే గడచిపోవును. అట్లుగాక వారు వాచకగురువును పొందినయెడల, వారి జీవితములు విద్యావ్యాసంగము, తీర్థయాత్రలు, విగ్రహపూజలు, ఉపవాస వ్రతములలోను వ్యర్థముగ నష్టపోవును. వారికి జన్మమరణపాశమునుండిగూడ విముక్తిగలుగదు. అందుచే వారును, మిగిలినజీవులందఱునుగూడ పరిపూర్ణసద్గురువు నన్వేషించుటకై తమ యావచ్ఛక్తితో ప్రయత్నములు సేయవలయును. అట్టి యన్వేషణలోనే తమ జీవితమంతయు సమాప్తమైపోయినను గూడ నేమియు విచారించనక్కఱలేదు. ఏలనన, నతని చిత్తమునందు సద్గురువును కలిసికొనవలెననెడి వాంఛ దృఢతరమైపోయినచో, నది నిస్సంశయముగ నిజమైన పరమపురుషునికి వాస్తవభక్తి చేసినట్లేయగును. అట్టివాని కాపరమపురుషుడు సద్గురురూపమున నవశ్యముగ లభించును.

175. ఇక్కాలమున జీవులు సంతుల మహోపదేశములలో నెంతమాత్రము విశ్వాసముంచకుండ వేదశాస్త్రములు, పురాణములు, ఖురానులలో లిఖితములైన విషయముల నెక్కువవిశ్వాసముతో మన్నించుచు, అభాగ్యులైపోయిరి. ఆ గ్రంథములవిషయములో వారి కెట్టి బాహ్యాంతరానుభవములు కలుగకపోయినను, కాలుడు ఆ గ్రంథములలో తన కనుకూలమైన విషయములను జీవులు అవలంబించునట్లు చేయు పరిస్థితులను కల్పించియున్నాడు. సంతులు మహాదయతో బోధించిన విషయములను జీవులు మన్నించక, పైగా నిదర్శనములు చూపుడని యడుగుదురు. దీనిని బట్టి సంతుల యుపదేశములకు నిదర్శనములు కావలయుననుచు, కాలుని యుపదేశములను నిదర్శనము లేకుండగనే మన్నించునట్టిజీవులు కాలునిజీవులని స్పష్టపడుచున్నది. సంతులుగూడ నట్టిజీవులవిషయములో శ్రద్ధవహించరు.

176. ప్రాణాయామమునకును బుద్ధియోగము[1]నకును గమ్యస్థానము ఆకాశముమాత్రమే. శబ్దముయొక్క సహాయముతో ఆత్మ ఆకాశముదాటి పైకివెళ్లి అచ్చట నొక యద్భుతపురుషుని దర్శనము నొందగలదు. సత్య, ద్వాపర, త్రేతాయుగములలో నా పురుషుని విషయ మెవరికిని తెలియకుండ గుప్తముగ నుండిపోయెను. ఇపుడు కలియుగములో సంతు లారహస్యమును ప్రకటపరిచిరి. సంతుల మహావచనములందు విశ్వాసముగలవారే ఆ యద్భుతపురుషుని దర్శనము నొంది ముక్తిస్థానమును జేరుకొనగలరు.

177. ఈ కాలములో అనేకమంది సాధువులు, తాము పండితులవవలెనను కోరికతో కాశీకి వెడలి, అచ్చట పండితుల సాంగత్యములో జీవితమంతయు వ్యర్థపఱచుకొనుచున్నారు. ఇదిచాల విరుద్ధము. సాధువులైనపుడు వారు చేయవలసిన దేమన, పరిపూర్ణ సద్గురువు నన్వేషించుకొని, వారి సేవాసత్సంగములను చేసికొనుచు, అంతర్యాభ్యాసమును లేక సాధనను చేసికొనుచుండుటయే. అట్లు చేసినచో వారు పాండిత్యసంపాదనలో జన్మనంతను వ్యర్థపుచ్చుకొనుటకు బదులుగ సాధుగతిని పొంది నిజస్థానమును చేరుకొందురు. వేదములకు కర్తయైన బ్రహ్మయే జన్మమరణచక్రమునుండి విముక్తిపొందలేనపుడు, అందుండి తప్పించుకొనుటకు పండితుల కేమి శక్తియుండును? కావున, పండితుల సాంగత్యముచేసి యెవరును జన్మమరణరహితులు కానేరరు. ప్రస్తుతకాలములోని పండితులు, జ్ఞానులును కేవలము వాచకజ్ఞానులేకాని వారికి నిజమైన పాండిత్యముగాని, వాస్తవమైనజ్ఞానముగాని యెంతమాత్రము లేదు. వీరందఱు జన్మమరణచక్రమునం దుండుటకే అధికారులైయున్నారు. ఏలనన, ఒక్క సమకాలికసద్గురునకుదక్క మఱెవరికిని జీవులను జన్మమరణచక్రమునుండి తప్పించి నిజగృహమందు జేర్పించు శక్తిసామర్థ్యములు లేవు.

178. కాలుడు తనజాలము నీప్రపంచములో నెంతవిచిత్రముగ పన్నెనో చూడుడు. పరమార్థముచేసికొనువారిలో నెవరైతే తమ్ముతాము మహాపరమార్థులని భావించుకొనుచు, నితరులచేగూడ గొప్పపరమార్థమును సాధించుచున్నవారుగా శ్లాఘింపబడుచున్నారో, అట్టివారి స్థితిని విమర్శగా పరిశీలించి చూచినచో, వారిలో నొక అణుమాత్రము పరమార్థముగూడ కనిపించదు; అనగా, అట్టివారు తీర్థయాత్రలు, వ్రతములు, జపములు, విగ్రహారాధనలలో వృథాపరిశ్రమ చేయుచు, అనేక విధములైన ఆచారములు, నియమములు

1. బుద్ధియోగమనగా బుద్ధినుపయోగించి తద్వారా భగవంతుని తెలిసికొనుట.

మాత్రమే పాటించుచున్నారు వీనివలన నహంకారముదప్ప మఱేద్దియు లభింప జేరదు. ఈ కాలములో భగవంతుని కీకార్యకలాపము అంగీకారములేదు; వీని మూలమున నెవరును జన్మమరణచక్రమునుండి విముక్తి నొందజాలరుగూడ. అందుచే నట్టివారందఱును జననమరణచక్రములోనే పడిపోవుచున్నారు. ఈచక్రమునుండి విమోచనమును గోరువారు సమకాలికసద్గురువుయొక్క భక్తిచేయవలసినదేకాని, విమోచన నొందుటకుపాయము మఱేద్దియు లేదు. కాని జీవుల దురదృష్ట మేమనిచెప్పదగును? వారు ఇతరసాధనల నెన్నేని చేసి కష్టముల పాలగుట కిష్టపడుదురేకాని, సద్గురు భక్తిమాత్రము చేయుట కంగీకరించరు. కొందఱు పవిత్రగ్రంథములందే భక్తివిశ్వాసములను పెట్టుకొని గ్రంథములనే గురువుగా మన్నించుచున్నారు. గ్రంథములను గురువుగ స్వీకరించినందువలన ప్రయోజనమేమి, అట్లు చేయవచ్చునని యెచ్చట విధింపబడియున్నది, అను విషయము లిపుడు శ్రద్ధగ విమర్శించవలసియున్నది. ఏదియెట్లున్నను, గ్రంథములు జడపదార్థములు; వాని కెట్టిసేవయు చేయుట కవకాశములేదు. అట్టివారు ఏమిగురుభక్తిచేయగలుగుదురు? గ్రంథమునకు భక్తిచేయుట యనగా, అందులో వ్రాసిన యుపదేశప్రకారము ఆచరించుటయే. అనగా, ఆగ్రంథములో "సద్గురువు నన్వేషించుకొని వారికి సేవచేయుము, వారిశరణు పొందుము", అని వ్రాసియున్న హితోపదేశమును మన్నించవలయును. అట్లు మన్నించనపుడు గ్రంథమందు విశ్వాసమున్నదనుట బూటకమే. వీరల పరిస్థితిగూడ విగ్రహారాధకుల పరిస్థితివంటిదే యని గ్రహించవలయును. ఈ పొరపాటునకు నిజమైన కారణ మేమన, యథార్థమైనవిషయమును బోధించు మహాపురుషు డెవరును జీవులకు లభింపకపోవుటయే. అందుచేతనే జీవులందఱును అపమార్గమున బడి, అపభ్రమలపాలైపోవుచున్నారు. వారలకు దొరకిన గురువులు గూడ స్వయముగ నెన్నడు నొక గురువువద్ద శిష్యరికము చేసియుండినవారు కారు. పైగా, వారు జీవులను భ్రమింపజేసి తప్పుడుత్రోవలను బెట్టువారే. పండితులేమి, వేషధారులేమి, అందఱు నిదేవిధముగ నున్నారు. వీరిలో నెవరికినిగూడ సద్గురుమహిమగాని, సద్గురు భక్తిమహిమగాని తెలియనే తెలియదు. వీరందఱును స్వయముగ పవిత్రగ్రంథములు మున్నగువానిలోను, పురాతనాచారములలోను, పరంపరాగత మూఢవిశ్వాసములలోను చిక్కుకొనిపోయి, ఇతరులనుగూడ వానిలో చిక్కుబఱచుప్రవృత్తిలో నున్నారు. జీవునకు మోక్షదాయకమైనట్టియు, నిజగృహమును జేర్చునట్టిదియు నగు సద్గురుభక్తి నెవరు నుపదేశించుటలేదు. స్వయముగ సత్యపురుషు డీజగమున, సంతులరూపమ్ములో

ప్రకటమైనపుడు వారొక్కరే ఈ యుపదేశమును చేయుదురు. ఎందుచేతనగా, ఇదియే సర్వోత్తమమార్గము, జీవునకుద్ధారము దీనివలన నతిత్వరితముగ చేకూరును. కాని, యీ యుపదేశమును ఉత్తమసంస్కారిజీవులుమాత్రమే మన్నించుదురు, సద్గురువు నన్వేషణగూడ నట్టిజీవులే చేయుదురు. బాహ్యావినోదములు, తమాషాలతోనే సంతోషించువారికి సద్గురుభక్తి చేయుటలో శరీర మనోధనములకు కష్టనష్టములు గలుగును, కావున సద్గురుభక్తిచేయుట యసాధ్యము. సద్గురునకును, పవిత్రనామమునకును, సర్వోత్తమప్రాధాన్యమెవరిత్తురో వారే ఉత్తమ సంస్కారిజీవులు.

179. ప్రాపంచికజీవులు తియ్యని, ఉప్పని ఆహారములను తిని ప్రసన్నులగుచు మంచిమంచి వస్త్రములను ధరించి, సంతుష్టులగుచుందురు, కాని ఇదంతయు వ్యర్థము. గురుముఖునకు రుచించునట్టి తీపి కమ్మని పదార్థములను గుటింంచియు, ప్రియమైన వస్త్రములను గుటించియు సంత్ సద్గురు పీవిధముగ సెలవిచ్చుచున్నారు. ఎవనికి సంత్ సద్గురువుయొక్క సంభాషణ మధురాహారమువలెను— ఏలనన, నంతకన్న నెక్కువమధురమైన పదార్థమేదియులేదు— సద్గురు వచనశ్రవణము కమ్మని ఆహారమువలెను రుచిగనుండునో అతడే గురుముఖుడు. సద్గురువునందు విశ్వాసమే గురుముఖునకు దుస్తులు. ఇదియే అంతటికిని సారము. కాని ఇది యథార్థమైన నిర్మలపరమార్థియొక్క స్థితి. అట్టి పరమార్థికే యీ విషయములు పైనచెప్పిన విధముగ ప్రియముగ నుండును. లౌకిక జీవుల కీవిషయములు అప్రియముగ నుండును.

180. ప్రస్తుతకాలములోని జ్ఞానులు వేదములను సంతుమహాత్ముల కన్న నెక్కువ ప్రధానముగ నెంచుచున్నారు. ఇది చాలపొరపాటు. దీనికి కారణమేమన, వేదాధ్యయనముచేసి, వేదప్రోక్తమైన విషయముల నాచరణలోబెట్టి, కొంతవరకు సాధుగతిని పొందినవారిని సంతులని పీరనుకొనుచున్నారు, కాని వేదముల కర్తకుగూడ కర్తలైన సంతుమహాత్ముల విషయము వీరల కెంతమాత్రము తెలియదు. వేదాధ్యయనముచేసిన కారణమున సంతులని పేర్కొనబడుచున్నవారు సంతుమహాత్ములసేవకులకుగూడ సమానులు కాజాలరు. ఎట్లనగా, ఒకడు చక్కగ చదువుకొనియుండియు నుద్యోగములేకుండ నున్నవాడును, మఱొకడు తక్కువ చదువుకొన్నను పెద్ద ఆస్థానములో నుద్యోగమును పొంది, తనపనిని సమర్థతతో నిర్వర్తించుచున్నవాడును, వీరిరువురిలో ఎక్కువ విద్యావంతుడైన మొదటివాడు రెండవవానితో సరితూగజాలడు. ప్రస్తుతకాలపు

జ్ఞానుల పరిస్థితిగూడ నిట్లే యున్నది. వారు విద్యమాత్రము బాగుగనే అభ్యసించిరి గాని, ఉద్యోగమేమియు వారికి లభించలేదు. అనగా, సద్గురుభక్తి ప్రాప్తించలేదు. సంతుల సేవకులు మూర్ఖులే అయిననుగూడ వారికి పరిపూర్ణ సద్గురువుయొక్క భక్తిశరణ్యములు లభించినవి. కావున వారెప్పటికైన పరిపూర్ణగతిని పొందగలరు. విద్యావంతులు, యోగులు, జ్ఞానులు మాత్రము జననమరణచక్రములోబడి తిరుగుచునే యుందురు.

181. వేదాంతశాస్త్రము మిగిలిన ఐయిదుశాస్త్రములలోని దోషములను బయటపఱచినది. వేదాంతశాస్త్రముయొక్క దోషముల నిపుడు సంత్ సద్గురువు ప్రకటించి చెప్పుచున్నారు. కృతయుగ, త్రేతా, ద్వాపర యుగములలో నీశాస్త్రముల నిజస్థితి తేటపడలేదు. ఏలనన, నాయుగములలో సంతులు ప్రకటము కాలేదు. ఇప్పుడు కలియుగములో సంతులు జీవోద్ధారకార్యము సాగించునిమిత్తమై యవతరించి, అన్నిమతములలోని తప్పులు, దోషములను స్పష్టముగ ప్రకటపఱచి జీవోద్ధారమునకు సరళమైనట్టి యథార్థమార్గమును తెలియజెప్పుచున్నారు. కాని, జీవులు అతిసంకుచితబుద్ధిగలవారగుటచే వారి బోధనలను స్వీకరించుటలేదు, వారిని విశ్వసించుటయు లేదు. కొంచెము శ్రద్ధ వహించి యాలోచించినచో, వీరలకు వేదమతమందు విశ్వాసముగూడ పుస్తకపఠనమువలననో లేక ఇతరులనుండి వినుటవలననో గలిగెననియు, వీరు అందు సంబంధమైన అభ్యాసమును కొద్దిగకూడ చేసియుండనులేదనియు, చేయనులేరనియు బోధపడగలదు. ఏలనన, వేదప్రోక్తమైన అభ్యాసము లీయుగములో చేయుటకు సాధ్యముగావు. సాధనాపరులయందు వీరికి విశ్వాసముగూడ లేదు. అట్లుకానిచో వీరు సంతులపద్ధతిప్రకారము చేయవలసినసాధనల నట్టిసాధకుని వద్దనుండి తెలిసికొని అభ్యాసముచేయుచు నుండియుందురు. కేవలము గ్రంథములమీదనే ఆధారపడుచు, ఆగ్రంథములను చదువుకొనుచుండినచో, నందువలన వారికి సాధనావిధాన మెన్నటికిని తెలియనేరదు. పైగా, అందువలన, వారికి తమ విద్వత్తునుగుఱించి అహంకారము పెరిగిపోయి, వారి మనస్సును మలీమసముగచేసి, వారిని సాధనల నభ్యాసముచేయుట కసహ్యులుగ గూడ చేసివేయును. ఈ కాలములో ప్రజలందఱును ఎక్కువగా కబుర్లుచెప్పువారేగాని, కొంచెముగూడ నభ్యాసముచేయువా రెవరును గావవచ్చుటలేదు. కావున పరమార్థమే ప్రధానముగాగల జీవులు సద్గురువునకు భక్తిగాని, లేదా సద్గురువు కొఱకు అన్వేషణముగాని చేయుటతప్ప మఱొకపని చేయకూడదు. ఏలనన,

ఈ యుగములో మఱేకృత్యమువలనను చిత్తశుద్ధి గలుగనేరదు. చిత్తశుద్ధి గలుగనిచో ముక్తిలభించుటెట్లు? సంత్ సద్గురువు దప్ప మఱెవరు నామూల ధామము నొందుటకు మార్గము చెప్పలేరు; ఏలనన, ఆ నిజగృహముయొక్క రహస్యము వారొక్కరికే తెలియును, మఱెవరికిని దెలియదు. అట్టి సంతసద్గురువునకు సేవాభక్తులు చేయుటవలననే చిత్తశుద్ధి చేకూరును. మఱియు వారి యొక్క దయాకటాక్షములవలననే ముక్తిస్థానము లభించును, సాధనల యభ్యాసముగూడ సాగును. ఉద్ధారముపొందుటకు ఇదితప్ప మఱెద్దియు నుపాయము లేదు.

182. సంతసద్గురువుతప్ప మఱెవ్వరును భక్తిబీజము నాటజాలరు. దయామయులైన సంతసద్గురువొక్కరే జీవునకు సరియైన ఆధ్యాత్మికమార్గము చూపెదరు. మిగిలినవారందఱును తాము స్వయముగనే అపభ్రమలలో బడియుండి, యితరులనుగూడ అపభ్రమల పాలుచేసి, అపమార్గమున భ్రమింపజేయువారే. ఏలనన, ఒక్కవిషయ మాలోచింపుడు- వీరు ఇటికలు, ఱాళ్ళతోను నిర్మింపబడిన మందిరములలో, మానవునిచే తయారుచేయబడిన ఱాతివిగ్రహమును బెట్టి, దానినే భగవంతునిగా తాము మన్నించుచు, నితరులచేగూడ పూజింపజేయుచున్నారు. కాని యే దేవాలయమును భగవంతుడే నిర్మించుకొని, అందులో ప్రవేశించియున్నాడో, ఏమందిరములో ఘంటా, శంఖాది నానావిధములైన నాదములు నిరంతరము మాఱుమ్రోగుచు, నఖండఆరతి జరుగుచున్నదో, అట్టి మందిరముయొక్క రహస్యమును వారు జీవులకు చెప్పుటలేదు. కావున వారు స్వయముగ నంధులై యపమార్గమున బడియుండి, యితరులనుగూడ నపమార్గమున బెట్టుచు, జీవులకు జీవకళ్యాణకార్యము నెఱవేరునట్లు చేయుటకుబదులు, కార్యభంగ మొనరించుచున్నారు. ఒకగ్రుడ్డివాడు మఱొకగ్రుడ్డివానికి మార్గము నేమిజూపగలడు ? అందుచే జీవులు సంత్ సద్గురువు నన్వేషించుకొనవలయునని బోధపఱచబడుచున్నది. సద్గురువు లభించునంతకాలము ఆంతర్యరహస్యమెంతమాత్రము లభించనేరదు. శబ్దమందు ప్రేమగల్గియుండి, ఆంతర్యరహస్యమును, నిజగృహమునకు మార్గమును శబ్దసహాయముననే పొందనగునని తెలియజెప్పునట్టి మహాపురుషుడే సద్గురువు. వారి బాహ్యాప్రవర్తనను బట్టి యెవరైనను సద్గురువును గుర్తింపదలచినచో, నది యెన్నటికిని సాధ్యముకాదు. జీవులందఱును అజ్ఞానులును, అంధులును, అట్టివారికి దృష్టిగల సంతసద్గురువును గుర్తించుటకును, పట్టుకొనుటకును ఏమిశక్తియుండును ? అంధుడు దృష్టిగల

వానిని పట్టుకొనలేడు, కాని దృష్టిగలవా డెవనిచే పట్టుబడదలచిన నతనికే దొరికిపోగలడు. అందుచే ప్రాపంచికజీవులకు సద్గురువును గుర్తుపట్టగల శక్తి లేదు. కాని, సద్గురువునకు దివ్యేచ్ఛగలిగినచో, వారు జీవులకు తమ్ముగూర్చి వివిధ విధములుగా గుర్తులనిచ్చి తెలుపుకొనగలరు. ఆంతర్యరహస్యమును తెలిపి, శబ్దమార్గము నెవరుపదేశింతురో, వారే సద్గురువను చిహ్నమాత్రము మొదటలో గుర్తించిన చాలును. వారుకూడ స్వయముగ శబ్దమునందు లీనమైయుండిరా లేదా అనువిషయముగూడ గమనించవలయును. ఆంతర్య రహస్యము సంత్ సద్గురువునకును, వారెవరికి ఆ రహస్యమును ప్రసాదింతురో వారికిని దప్ప మఱెవరికిని తెలియదు. సద్గురు వెన్నడు నేపవిత్రగ్రంథము మీదకాని, వచనములు, పుస్తకములమీదకాని, ఆధారపడియుండరు. వారు స్వయముగ భగవత్స్వరూపమే. సంత్ సద్గురువుయొక్క దయాకటాక్షము లతో నాంతర్యాభ్యాసము చేసిననేకాని నిజపద మెవనికిని లభించనేరదు. ఏవ్యక్తికైనను, ఏవిధముననైనను ఉద్ధారమొసంగుట కేవలము సంత్ సద్గురుని దివ్యేచ్ఛపై నాధారపడియున్నది. అనగా, ప్రధానమైన విషయము సంత్ సద్గురువునందు భక్తివిశ్వాసములు గలిగియుండుటయే. ఆ పిమ్మట నంతయు సద్గురుని యిష్టము. వారు కావలెనన్న మొట్టమొదట సత్సంగము చేయించవచ్చును, లేదా శబ్దాభ్యాసమునుగాని, సేవనుగాని చేయించవచ్చును. వారు సర్వసమర్థులు. వారు ప్రసన్నులైనచో నొక్కక్షణకాలములో నెద్దానినైన ప్రసాదించగలరు. అయితే ముఖ్యవిషయము వారు ప్రసన్నులగుట.

183. ఎవనికైన నొకప్పుడు విరహముగలిగినను, అనగా భగవంతుని గలిసికొనవలయుననెడి ఆసక్తి యుత్పన్నమైనను, అతని కాపరిస్థితిలో పరిపూర్ణ సద్గురువు లభించనిచో, వానివిరహము నిష్ఫలమైపోవును. భగవద్దర్శనాభిలాషి యెవరైనను సద్గురు వక్కఱలేకుండగనే నిజపదమును పొందగలనని వక్కాణించినచో నది పొరపాటు. ఏలనన, సమకాలికసద్గురువు లభించనిదే నిజపదమును పొందుట యసాధ్యము. విరహియైన నౌగాక, విరహరహితుడైన నౌగాక, ఇరువురకునుగూడ సద్గురు వావశ్యకమే. విరహము కొంతవఱకు హృదయపూర్వకమైననుగూడ నాజీవునకు పరిపూర్ణసద్గురువుగాక కనిష్ఠశ్రేణి గురువు లభించినచో నది నశించిపోవును. పిమ్మట నా విరహిజీవునకు పరిపూర్ణ సద్గురువు తటస్థించిననుగూడ నతనిలో గురువుకొఱకు ఆసక్తియే యుండదు. ప్రేమ, విరహముబులేనివాడుకూడ పరిపూర్ణసద్గురుని శరణులోనికి వచ్చి

నచో నా దయామయులైన సద్గురువు వానికి మహాదయతో ప్రేమవిరహము లను వృద్ధిపఱచి యతనికార్యము సఫలము చేయుదురు. కాని తక్కువ శ్రేణి గురువు లభించినచో, నతడు తనవిరహమును గుఱించి అహంకారపూరితుడై పోవును. అతని కార్యముగూడ సఫలము కానేరదు. ఏవిధమున చూచినను ప్రాముఖ్యమంతయు పరిపూర్ణ సద్గురువునకే. కావున, నెవనికైనను పరిపూర్ణ సద్గురువును పొందిననేగాని, జన్మసాఫల్యము గలుగనేరదని తెలిసికొనవలయును.

184. సామాన్యముగా, అందఱును తాము సద్గురు శరణుపొందితిమని చెప్పుకొనుచుందురే కాని సద్గురుని శరణుజొచ్చుటయనునది బహుకష్టసాధ్యమైనట్టి మహోన్నతపదవి. పరిపూర్ణశరణ్యము నొందినవారి పరిస్థితి యెట్లుండు ననగా, వారి కొక్క సద్గురువు దప్ప మఱెవరియందును విశేషప్రీతి యుండ నేరదు. అట్టి పరిస్థితినొందినవారేమన్నను (అనగా తమ శరణాగతినిగుఱించి చెప్పుకొన్నను) అది సరియైనదే. పూర్వకాలములో సంతులు, జీవునకు శరీర మనోధనములు అర్పణచేయనంతవఱకు నుద్ధార మిచ్చెడివారుకారు. కాని, ఇప్పుడు రాధాస్వామీదయాళురు జీవులు దుఃఖాక్రాంతులుగను, బలహీనులుగను ఉండుటచూచి, కొద్దిపాటి దీనత్వమును కలిగియుండి భక్తిచేసినంత మాత్రమున తమ దయాకటాక్షప్రభావముచే నుద్ధారము నిచ్చుచున్నారు. కావున ఏజీవుడు పరిపూర్ణ సద్గురువుయొక్క సత్సంగసేవాదర్శనభాగ్యమును పొంది, శబ్దాభ్యాసమును చేయుచుండునో అట్టి జీవుడే మహాదృష్టశాలి.

సుత దారా ఔర్ లక్ష్మి సబ్ కాహూకే హోయ్ ।
సతగురు సేవా, సాధుసంగ కలిమేఁ దుర్లభ దోయ్ ॥

**తర్జుమా:—** భార్యాపుత్రులు, ధనసంపత్తులు అందఱకునున్నవే. కాని, సద్గురుసేవయు, సాధువుల సత్సంగమును,— ఈరెండును కలియుగములో దుర్లభములు.

185. త్రిలోకములకు సృష్టికర్తయు, పాలనపోషణకర్తయు, సంహారకర్తయునగు (శ్రీ) రాముడు జీవునకు శత్రువు. ఏలనన, అతడే భగవంతుని యొక్క ఆదిస్వరూపమునుండి జీవుని వేరుగజేసి, గర్భవాసమునబెట్టి, అనేక విధములైన అంతశ్శత్రువులను బహిశ్శత్రువులను జీవునికి సహచరులుగ కల్పించెను. అనగా, ఆంతర్యమున కామ, క్రోధ, లోభ, మోహాహంకారములలోను, బాహ్యమున తల్లిదండ్రులు, దారాపుత్రమిత్రులు, గృహసంపత్తులు, ఐహిక

భోగములలోను చిక్కుకొనిపోవునట్లు చేసెను. కావున, నిట్టిదుఃఖము పెట్టు వానిని భక్తిభావముతో నేల మన్నించవలెను? కావున, నిట్టి శత్రువుయొక్క జాలమునుండి విడిపించి శాశ్వతసుఖస్థానమును చేర్పించు మహాప్రభావశాలియైన సద్గురువునకే భక్తిచేయవలయును. కాలుని జాలమునుండి విడిపించువారు సద్గురువుతప్ప మఱెవ్వరు నీప్రపంచమున లేరు.

186. సంత్ సద్గురువు ప్రకటముచేసిన పవిత్రనామము వేదశాస్త్రములలో చెప్పబడలేదు. ఆ పరిపూర్ణప్రభావముగల పవిత్రనామ మాంతర్యమున విరాజమానమైయున్నవారే సంతసద్గురువు. పైపైకి ఎందఱో కాషాయవస్త్రవేషధారులు తమ్ముతాము సంతులనియు, సాధువులనియు చెప్పుకొనుచుందురు. కాని, వారు సాధుసంతులు కానేరరు. వారు పరిపూర్ణసంతుల పేరుమీద పొట్టపోసికొనుచున్నారు. సంతులకు ప్రియుముగనుండువారే సంతు పదవినొందగలరు. సంతులచరణములందు ప్రేమవిశ్వాసము లెవరు కలిగియుందురో, వారే సంతులకు ప్రియుముగనుందురు. సంతులచరణములందు ప్రేమ విశ్వాసములు, సద్గురుకటాక్షమువలనను, సేవాసత్సంగములు చేయుటవలనను సంప్రాప్తమగును. త్రిలోకీనాథుని లోకమును, వారి నామమునుగూడ, నెవరైనను, సంతులుపదేశించిన సాధనల నభ్యాసముచేయుటవలనను, సంతులకటాక్షము సంపాదించుకొనుటవలననే పొందగలరు, కాని, మఱేసాధనలవలనను వాని నీకలియుగములో పొందశక్యము కాదు.

187. సద్గురుచరణములందు భక్తిగలవానికి, సద్గురుమహిమాగానము దప్ప మఱేవిషయమును సంతోషము గలిగించనేరదు. సద్గురువునందు పూర్ణ విశ్వాసముగలవాడు సద్గురువులో నెన్నడు దోషముల నెంచజాలడు. ఏలనన, సద్గురువునందు దోషముల నెంచునెడల, అతనివిశ్వాసము నశించిపోవును. కావున సద్గురువునందు దోషములనెంచుతలంపే రానీయకూడదు. అట్టివాడే గురుముఖుడు కాగలడు. అట్టివాడే పరమపదము నెప్పటికైనను పొందగలడు.

188. ఈశ్వరుడు ఆకాశమందును, పాతాళములోను, సర్వత్రగూడ గలడని చెప్పుదురు. కాని, యెవరు నాయనను కలిసికొనలేకున్నారు. ఆయన నెవరును పొందలేనపుడు, ఆయన సర్వవ్యాపకుడైనందువలన, జీవున కేమి ప్రయోజనము? భగవంతుడు సద్గురురూపమును ధరించినపుడు, జీవులకు ఆ రూపములో దర్శనమిచ్చుటయేగాక, ఆంతర్యరహస్యమును బోధపఱచి, మహోదయములో సాధనల నభ్యాసముచేయించి నిజగృహమునకు చేర్పించి, తన నిజ

రూపదర్శనముగూడ లభింపజేయును. ఇప్పుడు, సద్గురురూపము ఎక్కువదో లేక వ్యాపకరూపమెక్కువదో యోచింపదగియున్నది. వ్యాపకరూపమువలన ఏజీవుని కార్యము నెఱవేరజాలదు. అట్లుగాక, సద్గురువుయొక్క సత్సంగము, సేవయు చేసినమీదట, వారియందు జీవునకు పూర్ణవిశ్వాసమేర్పడినపుడు, జీవకార్యము సద్గురురూపమువలన సులభముగా నెఱవేరగలదు. సమకాలికసద్గురువునిసంయోగము లభించనిచో నెవరికిని పరమపురుషునియందు పూర్ణవిశ్వాసము గలుగనేరదు. పూర్ణవిశ్వాసము గలుగనపుడు ప్రీతిప్రతీతులుగూడ సంపూర్ణముగ నుండజాలవు. ప్రీతిప్రతీతులు లేనిదే జీవుని కుద్ధార మెట్లుగలుగును? ఆ పరిస్థితిలో జీవుడు పారమార్థికకృత్యము లేమి జరిగించినను, వానివలన నతనికి ఇచ్చట వెవ్వేఱుజన్మలలో శుభకర్మఫలితముమాత్రమే లభించును గాని, నిజమైన భగవంతుని భక్తిమాత్రము, సమకాలికసద్గురువు లభించి వారి వచనములయందు సంపూర్ణవిశ్వాసము గలుగనంతవఱకు నెన్నడు సేకూరనేరదు.

189. సాధువులు, బ్రాహ్మణులు, క్షత్రియులు నీకాలమున నహంకారపూరితులైయున్నారు. సాధువునిలో సాధుత్వముగాని, బ్రాహ్మణునిలో బ్రాహ్మణలక్షణములుగాని, క్షత్రియునిలో రాజలక్షణములు, బలముగాని లేవు. వీరందఱు నొక్క యహంకారమునుమాత్రమే చూపుచున్నారు. వైశ్యులు, శూద్రులును, తమవృత్తిధర్మములను, ఇంకను గొంతవఱకు పాటించుచున్నారు. సాధుసాంగత్యము చేయుడని సంతులుపదేశించుచున్నారు. కాని, సాధువే దుర్లభమైనపుడు సాధుసాంగత్య మెక్కడలభించును? అయినను, జీవులకు సంతులు, సాధువులయొక్కయు సత్సంగము లభించనిచో నుద్ధారముగలుగనేరదు. ఇపుడు సంస్కారములులేనిదే సాధుసంతులసంయోగము లభింపనేరదని తెలిసికొనవలసియున్నది. ఎవనికి మహాభాగ్యము ఉదయించునో, అతనికి సంతసద్గురువుగాని, సాధుగురువుగాని తప్పకలభించుదురు. మంచి సంస్కారము గలవానికి సాధుసంగమే అవసరముండదని యెవరైననన్నచో నది పొరపాటు. సంస్కారియాగాక, అసంస్కారియాగాక, ఇరువురకునుగూడ సాధుసంగమావశ్యకమే. అయిన, నిరువురిలో నొక వ్యత్యాసముమాత్రముండును. ఏమనగా సాధుసంతులమహోపదేశములు, సంస్కారీజీవునియందు త్వరితముగ ప్రభావముగలుగజేయును. అందుచే నతడు వానిని సులభముగ నాచరణలో బెట్టగలుగును. అసంస్కారి ఆయుపదేశముల నంతయెక్కువగా మన్నించడు,ఆచర

కాలోగూడ నెక్కువగా పెట్టలేడు. అయినను, అతనిలోగూడ వి త్తనము నాటబడి మునుముందు, అతడుగూడ పరమార్థసాధన చేయగలుగును. ఎవనికి పూర్వజన్మలనుండియు సాధుసంతులసంయోగము లభించి, వారియందు భక్తి విశ్వాసము లేర్పడి, వారి దయాకటాక్షములచే వానిభాగ్యము నిరంతరాభివృద్ధి నొందుచుండెనో, అట్టివాడే, సంస్కారీజీవుడు. సంత్ సద్గురుకటాక్షమువలన అసంస్కారిగూడ సంస్కారిగామాఱగలడు. సంత్ సద్గురువుయొక్క మహిమా తిశయ మెట్టిదనగా, వారి దర్శనభాగ్య మెవరికి లభించిన నతనికి కొంతవఱకు వెంటనే యుద్ధారకార్యము ప్రారంభమై, జన్మమరణచక్రమునుండి విముక్తి కలిగి, అనేకవిధములైన దుఃఖక్లేశములనుండి రక్షణగలిగి, ముందుకుగూడ, సంతుల దయాకటాక్షములచే అతని యుద్ధారకార్యము చివరవఱకు సాగిపోగలదు. కావున నందఱుజీవులును, తమ సౌఖ్యముకొఱకును, లాభము నిమిత్తమును సంత్ సద్గురువు విరాజమానులైయున్న చోటికివెళ్ళి వారిసేవయు, దర్శనమును తమకు సాధ్యమైనంత యధికముగ చేసికొని తమ భాగ్యమును పెంపొందించు కొనవలయును.

190. సమకాలికసద్గురునిసేవ యెవనికి సంప్రాప్తమైనదో, అట్టివాని మానవజన్మయే సఫలమైనది. సేవయొక్క మహిమారహస్యమేమనగా, సద్గురు దర్శనమునిమిత్తమై నడచినపుడు భక్తునిపాదములు పవిత్రమగును, దర్శనముచే నేత్రములు పవిత్రములగును. సద్గురువునకు కాళ్లుపట్టుట, విసరుట మున్నగు సేవలను చేసినందువలన చేతులు పవిత్రమగును. వారినిమిత్తమై నీరు పట్టి నందువలన శరీరమంతయు పవిత్రమగును. వారి మహావచనములనువిని, చిత్తముతో అవగాహనచేసికొని శక్త్యనుసారము వాని నాచరణలో పెట్టుటచే అంతఃకరణము పవిత్రమగును. ఇదేవిధముగ, సద్గురుసేవ చేయుచుండినపుడు సద్గురుదయయు, వారి సత్సంగముయొక్క మహాలాభమును సేవకునికి సంప్రాప్తమగుచున్నట్లు, సేవకుడు తనంతటతానే అనుభవమునుపొందుచుండును. అతని కప్పుడు కలిగెడి ఆనందము, ఆధ్యాత్మికోన్నతియు వర్ణనాతీతములుగనుండును.

191. ఈకాలములో గృహస్థులుగాని, కాషాయవస్త్రధారులుగాని, ఇండ్లనుండి బయల్దేరినపుడు పుణ్యక్షేత్రములను దర్శించుగోరికతో బయల్దేరుదురు. కాని, సమస్తమునకు సారభూతమైన సత్సంగమునకై యన్వేషించు వారెవరును లేరు. దానియందు భక్తిభావముగలవారును లేరు. వారు దేనిని సత్సంగమని భావించుచున్నారో అది నిజమ్ముగ సత్సంగమున్కాదు. సత్సంగ

ము నామము సద్గురువుయొక్క సాంగత్యమునకే చెందుసుగాని, కథలు, పురాణగాథలు, దెబ్బలాటలు, వాగ్వివాదములు, విద్యాసంబంధమైన చర్చలును జరుగునట్టి స్థలములు సత్సంగమని పేర్కొనదగవు. సద్గురుస్వరూపము సాక్షాత్ సత్యపురుషుని స్వరూపమే. కావున వారి సాంగత్యమే నిజమైన సత్సంగము. శేషించినవన్నియు ఉత్తగడబిడలే, వానివలన నెన్నడు జీవోద్ధారము కానేరదు.

192. శ్రీరాముని, బ్రహ్మను సర్వవ్యాపకమైన దెంచి, వారినే భగవంతునిగ నెంచుకొని విశ్వసించెడివారు, అట్టి విశ్వాసముమూలమున తమకు జీవకళ్యాణమెన్నటికి సిద్ధించనేరదని, తెలిసికొనవలెను. ఏలనన, శ్రీరాముని అనగా బ్రహ్మయొక్క వ్యాపకరూప మొకదీపమువంటిది. ఆదీపమువలన వెల్తురు ప్రకాశించును. ఆవెల్తురులోనే చోరుడు చౌర్యముచేయుచుండును. త్రాగుబోతు మద్యము త్రాగుచుండును. కాముకుడు విషయభోగములను భోగించుచుండును. పరమార్థి పారమార్థికైశ్వర్యమును సంపాదించుచుండును.కాని ఆ వ్యాపకరూపము వీరెవరితో నేమియు మాటలాడదు. అయినచో నట్టి నామమును జపించుటచేగాని, అట్టిదైవమునందు విశ్వాసము పెట్టుకొనుటచేగాని జననమరణచక్రమునుండి విముక్తియు నసంభవము. మనస్సుకూడ అట్టివానిని తన యిష్టమువచ్చినట్లు నాట్యమాడించుచుండును. సద్గురురూపమైన భగవంతుని యందెవరైనను భక్తివిశ్వాసములనువహించి వారి సత్సంగము చేసికొనుచుండినచో నతడు విషయలంపటుడైనచో విషయభోగములను విడచిపెట్టియు, చోరుడైనచో చౌర్యమును మానివేసియు, మఱియు నిట్లే ఆరోజుకారోజుఅన్ని నీచకృత్యములను విసర్జించుచు నిర్మలమనస్కుడై చివరకు భగవంతుని నిజధామమును పొంది నిజరూపమును దర్శించగలడు. అట్లుగాక నెవరైన రామనామమునుగాని బ్రహ్మనామమునుగాని లేక మఱొక దేవతనామమునుగాని జీవితమంతయు జపించిననుగూడ నతని మనోవికారములును నశించవు, విషయభోగములకొఱకతనికిగల ఆసక్తిగాని అతని ఆశయొక్క మూలముగాని ఛేదించబడనేరవు. అట్లైనచో నతని కుద్ధారమెట్లు చేకూరగలదు?

193. ఎవరైనను తాము సర్వస్వము వదలిపెట్టితిమనిగాని, గ్రంథములను చక్కగచదివి మననముచేసికొని, సర్వసంగపరిత్యాగము చేసితిమనిగాని యనుకొనినచో నది చాలగొప్ప పొరపాటును, అపభ్రమయును. అట్టివారు తమ ఇంద్రియమనస్సులను పరికింపలేకున్నారు. నానాప్రకారములైన విషయ

భోగములను అట్టివారియెదుట పెట్టినపుడును, వారినెవరైన గౌరవమర్యాదలు చేసినపుడును, ఒక రాజోద్యోగిగాని, శ్రీమంతుడుగాని వారిక్షేమసమాచారముల నడిగినపుడును, వారిమనస్సెట్లుప్పొంగిపోయి పై వారివైపునకును ఆ విషయముల పైకి నెట్లు ఆకర్షితమగునో, ఆ విషయమును, మఱియు, వారి యిష్టమునకు వ్యతిరేకము జరిగినపుడును, వారికి నిరాదరణజరిగినపుడును, వారెంత దుఃఖపడి కోపింతురో ఆవిషయమునుగూడ గమనించవలయును. అప్పుడు వారికి ఆదరగౌరవములు, గొప్పగోటులకొఱకును వాంఛయు, దేశాటనములు చేయుటకును, వినోదములు చూచుటకును, ప్రతిష్ఠకొఱకును గోరికయు మనస్సున నింకను మహాప్రబలముగ నాటుకొనియున్నట్లు స్పష్టమగుచు. బాహ్యత్యాగము, సన్యాసము, మనన ధ్యానములు మున్నగువానియందు లగ్నమైయుండుటయు, జ్ఞానగ్రంథములు పఠించుటయు నెవరైనను పరమార్థమని యనుకొనినచో నదికూడ పొరపాటే. ఏలనన, వీనివలన మనస్సు మరణించదు. పరిపూర్ణులైన సద్గురువు లేక సాధు గురువుయొక్క సేవాసత్సంగములు చేయుటయు, ఏ స్వల్పాహారమునైనను తిని వారుచెప్పిన సాధనలో అనగా, సురత్ శబ్దాభ్యాసములో మనస్సును లగ్నము చేయుటయునే మనస్సును చంపుటకు సరియైన ఉపాయములు. ఈ విషయముల ప్రసంగమే లేనపుడు మనస్సెట్లు వశములోనికి వచ్చును, పరమార్థ మెట్లు సాధ్యమగును? నోటిమాటలచేనైతే ఈలోకములోనియు, పరలోకములోనియు విషయ భోగములు కాకవిష్టతుల్యములని చెప్పుచు మనస్సునందు మాత్రము వాటిపైననే కోరికనుంచుకొని వాటినిమిత్తమే అన్వేషణచేయునట్టి స్థితిలో నున్నవారికి ఏమి లాభము కలుగగలదు? వీరు తాముచెప్పెడి విషయములకు, చేసెడి పనులకును అసంబద్ధతకూడ గ్రహించలేనంత యవివేకులైయుండుట శోచనీయము. కాని వీరినే పరమార్థులుగ నమ్ముకొని, మునిగిపోయినవారలను పట్టుకొని మునుగుచు వెళ్ళిపోవుచున్నట్టి ప్రాపంచికజీవులు వీరికన్న నెక్కుడు అవివేకులు.

194. భోగవాంఛయు, కామక్రోధాదులును, ఇంద్రియమనస్సులయొక్క స్వాభావికలక్షణములును, జీవస్వరూపము వీనికన్న భిన్నమును, అనెడి విషయము నెవరైనను విచక్షణపూర్వకముగ తెలిసికొనినయెడల, అతనికి విషయ భోగములేమియు నష్టముగలిగించలేవని, కొందఱు విద్యావంతులు చెప్పుదురు. కాని ఇది యొక గొప్ప అపభ్రమయని తెలిసికొనవలసియున్నది. ఐహికభోగ వాంఛలు, ఇంద్రియ మనోవికారములును, ఆ ఇంద్రియమనస్సుల ప్రకృతిస్వభావమే యైనచో ప్రాపంచికజీవులకును, జ్ఞానికిని ఇక వ్యత్యాసమేమున్నది?

ప్రాపంచికజీవు లెట్లు ఆకర్మలఫలితములను వివిధజన్మలలో ననుభవింతురో జ్ఞాని కూడ నట్లె అనుభవించవలయును. ఏలనన, ఇంద్రియభోగముల ననుభవించుచున్న సమయములో నిరువురు నొకేరీతిగ వానిలో లిప్తమై మైమఱచిపోవుచుందురు. ఉదాహరణకు ఎవరైనను వీరిని నిరాదరణగాని, ఆక్షేపణగాని చేసిన యెడలను, వీరిపై నిందారోపణచేసినపుడును, లేదా వీరి సమక్షమున నితరుల కాదరసత్కారములుచేసినపుడును, వీరు అసూయాక్రోధములకు లోనగుటయు, వీరి కేదైన భోగవాంఛ పూర్తికానపుడు వీరు దుఃఖగ్రస్తులై ఆకోరికతీర్చుకొనుటకై యెన్నోప్రయత్నములు చేయుటయు, నందఱివద్దకు వెళ్ళి సహాయము కోరి యాచనచేయుటయు, జరుగుచుండుట చూచుచునేయున్నాము. ఇట్టి సందర్భములో వీరిమనస్సుయొక్క పరిస్థితి యెట్టిదైయుండు ననువిషయ మిప్పుడు యోచించవలసియున్నది; ఏలనన భోగములు కాకిరెట్టవంటివి. వానినిపొందు నిమిత్తమై వీరుకూడ జననమరణచక్రము లోనికి దారితీయునట్టి నీచాతినీచ ఘట్టములకు దిగిపోవుచున్నారు. కావుననే తమజీవోద్ధారముగోరువారు గ్రంథపాండిత్యముగల జ్ఞానులను విడచిపెట్టి తమకుశక్యమైనంతవఱకు సద్గురువు నన్వేషణచేసుకొని వారిచరణములను శరణుగజేసికొన్న యెడలనే వారి జీవకళ్యాణకార్యము నెఱవేరగలదనియు, మఱొకదైవమును నమ్ముకొన్నందువలనగాని, లేక పండితులను, కాషాయవస్త్ర వేషధారులను ఆశ్రయించినందువలనగాని, జననమరణచక్రమునుండి విముక్తిగానేరదనియు, మహోదయుతో చెప్పబడుచున్నది. కాషాయవస్త్రధారులకును, పండితులకును, అన్నపానాదులనిచ్చుటయు, చేతనైనంత ధనసహాయముగూడ చేయుటయును యుక్తమేకాని, తన శరీరమనములను సద్గురుచరణములందే అర్పణచేయుట అత్యావసరము. ఇదంతయు భగవంతునిగలిసికొనవలయుననియు, తమజీవునకుద్ధారముకావలెననియు కోరికగలవారినిమిత్తమే బోధింపబడినది. అట్టివారే దీనిని మన్నింతురుకూడ. ప్రాపంచికజీవులకును, కాషాయవస్త్రధారులకును, పండితులకును ఈ విషయములు రుచించవు.

195. విద్యావంతులును, బుద్ధిచాతుర్యముగలవారును సద్గురు సాంగత్యము చేయుటకర్హులు కారు. ఏలనన, వారహంకారపూరితులై యుందురు. సద్గురువునం దట్టివారికి భక్తిభావ మేర్పడనేరదు. సంతులు తాము స్వయముగ చూచిన విషయములు చెప్పుదురు. కాని, ఈ యజ్ఞానులు వినికిడివిషయములను వదరుచు, తమబుద్ధిచాతుర్యముచే నొకదానికొకటి సరిపెట్టజూతురు,

వారి కేదైనసాధన నుపదేశించినచో, వారిమనస్సు అహంకారపూరితము, భోగలాలసము, వినోదప్రియమునై యుండియుండును కావున నట్టిసాధనకు ఇష్టపడక, అద్భుతములను చూడగోరుచుండును. అయితే, సంతుమహాత్ములకు విచిత్రములను ప్రదర్శించు దిచ్ఛలేదు; ఏలనన, విచిత్రప్రదర్శనమూలమున గలిగిన భక్తి విశ్వాసయోగ్యముగాదు. పరమార్థసంపాదనకై తీవ్ర సంవేగముగలిగి, తమజీవోద్ధారముకొఱకై సంతుమహాత్ములందు పూర్ణవిశ్వాసము, భక్తియు గల్గినట్టివారికిమాత్రమే అద్భుతములు ప్రదర్శింపదగును, అట్టివారి కెల్లపుడు నద్భుతానుభవములు గలుగుచునే యుండును. లౌకిక ప్రతిష్ఠను, ఐహికభోగములనే నిజముగాగోరుచు, పరమార్థసంపాదనకై నిజమైన కోరిక లేనట్టివారికి అద్భుతానుభవములను పొందుటకుగాని, సత్సంగములో జేరుటకుగాని అర్హతయేలేదు. నిజమైనపరమార్థులు అట్టివారి సాంగత్య సహవాసములను చేయరాదు.

196. సంతులేవిషయములోనైనను, బాహ్యముగ క్రోధలోభములలో ప్రవర్తించినట్లగుపడినను, అందువలన జీవున కుపకారమే జరుగును. ప్రాపంచికజీవుల క్రోధలోభములు జననమరణచక్రములోనికి గొనిపోవునవి. కాని, మూర్ఖులు ఈసూక్ష్మమును తెలిసికొనలేరు. ఈవిషయముగూడ సత్సంగులకే తెలియును. మూర్ఖులు సంతుమహాత్ములను నిందించుచుందురు. కాని, సంతులు దయాసముద్రులుగావున, నట్టిమూర్ఖులకుగూడ మహోదయతో నుద్ధారము నిత్తురు.

197. ప్రాపంచికజీవులు మరణమనిన భయపడుదురు. ఏలనన, వారికి ప్రపంచమునందును, ప్రాపంచికవిషయములందు నాసక్తి మెండు. సాధువు మరణమునకు భయపడడు. ఏలనన, ఈప్రపంచమును, ఇందలివిషయములును అతనికి దుఃఖరూపములుగ కన్పట్టును; అత డీప్రపంచమును తనగృహముగ భావించుకొనక, కేవలమొక యాత్రికునివలె నిచ్చట నివాసముచేయుచు, తన సద్గురుని పూర్ణపరమానందస్వరూపముయొక్క ఆనందమును అనుభవింపగోరుచుండును. ఈకారణముచే వానికి మరణమువలన నెట్టిదుఃఖానుభవము గలుగనేరదు. ఇంతియగాక నతడు బ్రతికియుండగనే మరణానుభవమునుపొంది సద్గురువుయొక్క నిజస్వరూపములో నానందమునొందుచు తన్మయుడైయుండును.

198. సంతుమహాత్ముల సత్సంగములో సేవాసత్సంగభజనాభ్యాసములనుగుఱించి ప్రత్యేకనియమము లెవ్వియు విధింపబడలేదు. ఈవిషయములో

శంతు లెవరిపైనను బలవంతముగూడ చేయరు. హితోపదేశముమాత్రము చేసి మానవులను సన్మార్గమునబెట్టుదురు. ఉత్తమసంస్కారులైన జీవు లాయుపదేశముల నతిశీఘ్రముగ గ్రహించుకొని, ఆప్రకార మాచరింతురు. మధ్యమతరగతిజీవులు నెమ్మదినెమ్మదిగ నవగాహనజేసికొందురు. ఆయుపదేశ ముల నర్థముచేసికొని ఆచరణలోబెట్టనేరనివారు సత్సంగములో నిలువనేలేరు. కాని సత్సంగుల కెవనివిషయములోగూడ నీర్ష్యవహించుటగాని, ప్రతివ్యక్తియు తమవలెనే ప్రవర్తించవలెను, లేదా సత్సంగమునుండి వెడలిపోవలసినదే యను కోరిక పెట్టుకొనుటగాని, సమంజసముకాదు. ఏలనన, అట్లువెడలిపోవుటచే నతనికి నష్టముగలుగునేకాని సత్సంగి కెట్టిలాభము గలుగనేరదు. సత్సంగ ములో పడియుండినచో క్రమక్రమముగా కొంతకాలమున కతడుగూడ యథా ర్థము పూర్తిగ తెలిసికొని అందఱివలెనే ప్రవర్తించసాగును.

199. భక్తిమంతురాలైనపుత్రిక, విషయలోలుడైన పుత్రునికన్న మెఱుఁగు. ఏలనన, భక్తిమంతురాలైన స్త్రీమూలమున నుభయకుటుంబము లకు నుద్ధారము కలుగును. విషయలోలుడైన పుత్రుడు ఉభయకుటుంబము లకు హానియే గలుగజేయును. ఏ కుటుంబములో భక్తిమంతుడైన పుత్రుడు గాని, భక్తురాలైనపుత్రికగాని జనించునో ఆకుటుంబము మహాదృష్టవంతమైనది. భక్తిమంతుడైనపుత్రుడు జనించినకుటుంబములో నెనిమిదితరములవారి కుద్ధా రము గలుగును. విషయలోలు రెందఱుగలిగినను, నరకమునకు గొనిపోవు వారే.

200. ఏ జీవుడైనను సద్గురువు జీవోద్ధారము చేయునిమిత్తమై ధరించిన స్థూలస్వరూపమునే గుర్తింపజాలనిచో, నట్టిజీవుడు వారిసూక్ష్మస్వరూపము నెట్లు గుర్తింపగలడు? గురుముఖు డొక్కడుతప్ప మఱెవరును సద్గురువును పూర్తిగ తెలిసికొనలేరు. ఎట్లన, ఇనుమొక్కటే పరుసవేదిసంపర్కముచే బంగారముగ మాఱునుగాని, మఱేలోహముగూడ బంగారముగా మాఱజాలదు. జీవులకు గురుముఖులముగావలెనను కోరికమాత్రి ముండునుగాని, వారు గురువునకు చేయవలసినవిధముగా భక్తిచేయరు. కావున వారు సమకాలికసద్గురువునకు ఉత్తమరీతిగ భక్తిచేయవలయును. అట్లుచేసినయెడల మెల్లమెల్లగా గురుము ఖులు కాగలరు. ఏపురుషుడైనను మఱొకరిని తనవలెనే సద్గురువుగజేసినపుడే మే మాపురుషుని సద్గురువుగ నంగీకరింతుమని కొందఱు మూర్ఖజీవు లందురు. మఱొకరిని సద్గురువుగ జేసినందువలన తమ కేమిప్రయోజనము గలుగగలదను

విషయము వారు ఆలోచించుకొనవలెను. వారలకు తాము సద్గురువు కావలె నని యున్నయెడల సద్గురుభక్తి చేయవలెను. అప్పుడు దానిఫలితము తామే చూచుకొనగలరు. కాని వారికి భక్తి చేయుటచేత కాక తమ నరజన్మను వ్యర్థము చేసికొనుచున్నారు. అయిన నిందులోగూడ భగవదేచ్ఛ యున్నది. ఏలనన, అందఱును గురుముఖులైనచో నీప్రపంచసృష్టి నిలబడుటయెట్లు ?

201. ఈ ప్రపంచములో బ్రాహ్మణులకును, కాషాయవస్త్రవేషధారులకును, ఆదరగౌరవములు జరుగుచున్నవి. కాని పరమార్థసంబంధమైన తీవ్రవాంఛలేనివారుమాత్రమే వీరిని మహాత్ములుగ మన్నింతురు. ఎందుచేతనన, వీరలకు, జీవుని తన నిజస్థానమునకు జేర్పించునట్టి సాధనరహస్యము తెలియదు. వారా వేషమును ధరించుటయు, పాండిత్యము సంపాదించుటయు కేవలము తమస్వార్థము నిమిత్తమే జరిగించుచున్నారు. పరమార్థముకొఱకు తీవ్రసంవేగముగలవాని మనస్సులో నీరెండువిధముల వారియందునుగూడ గౌరవభావము ఉండనేరదు. బాహ్యముగ నతడు వారియెడల గౌరవముచూపి, వారికి ధనసత్కారముకూడ చేసినను, వారికి తనమనస్సు నీయజాలడు. కావున పండితులు, వేషధారులును అట్టి వాస్తవమైన పరమార్థుల సత్సంగములోనికి పోకూడదు. వెళ్లినను కపటముగ ప్రవర్తించకూడదు. ఏలనన, కపటము, కృత్రిమవిషయములును నిజమైన పరమార్థులయెదుట పనిచేయనేరవు. అచ్చట నిజాయితీగా ప్రవర్తించినచో వారికి లాభముగూడ గలుగును, లేనిచో నవమానము తెచ్చుకొందురు. సంతుమహాత్ము లెచ్చటనైన విరాజమానులైయుండి, సత్సంగముచేయుచున్నపుడు, అచ్చటి కెవరైనను వెళ్లి అనృతములు చెప్పుచు, కృత్రిమముగ ప్రవర్తించినచో నతనికి దుర్గతిగలుగును. ఏలనన, సంతులు సర్వసమర్థులగుటచే నట్టిప్రవర్తనను సహించుకొందురుగాని వారి సత్సంగులు సహించరు. సత్సంగులు అట్టివాని కాపట్యమును బయటపఱచెదరు. ఏలనన, సంతులసత్సంగములో కపటపరమార్థులనుండి వాస్తవపరమార్థుల వేఱుపాటు అహోరాత్రములు జరుగుచునే యుండును. అట్టిచోట కపటస్వభావులు, కృత్రిమస్వభావులు నెట్లుండగలరు ?

202. ఈశ్వరుని దర్బారునకు ద్వారపాలకులు బ్రహ్మ, విష్ణు, మహాదేవులు. సంతుల దర్బారునకు ద్వారపాలకులు వారిశిష్యులే. సంతుల శిష్యుల యొక్కపదవి యెంత మహోన్నతమైనదనిన, బ్రహ్మ, విష్ణు, మహాదేవులును వారి ప్రభువైన ఈశ్వరునునుగూడ వారి నాటంకపఱచలేరు, వారితో పోటీ

పడి నెగ్గలేరు. ఏలనన, సంతులు అందఱికన్న మహోన్నతమైనవారు. కావున వారి సేవకులకుగూడ నీశ్వరునకుగాని, దేవతలకుగాని, పోటీచేయశక్యముకానంత యుత్తమమైనపదవి లభించును.

203. సంతులవచనములకు సరియైన యర్థము సంతులే చెప్పగలరు కాని, మఱెవ్వరికిని సంతులవాణికి (రచనలకు) అర్థముచెప్పగలశక్తి లేదు. అర్థము నెవరుచెప్పినను వారి బుద్ధివికాస ననుసరించియే చెప్పుదురు. అయితే ఈ విషయములు మానవబుద్ధికి అతీతమైనవి. ఏలనన, సంతుల గ్రంథవిషయములు అనుభవవిషయములు కావున, వాని యర్థముకూడ ననుభవమూలముగ గోచరము కావలసినదే. విద్యాసంపన్నులకు వానియర్థమును యథాతథముగ నవగాహనచేసికొనుటకు శక్తి చాలదు.

204. నామములోనే శక్తియున్నచో, నామమును నిత్యము జపించుచున్న వేలాదిమందిలో నెవరికైనను దాని ప్రభావము గలిగియుండవలసినదే. కావున శక్తి నామమునందు లేదని స్పష్టమగుచున్నది. శక్తి సద్గురువులోనే యున్నది. సద్గురువునకు సేవచేయుచుండెడివారే మహాదృష్టవంతులు. పాపాత్ములుగూడ సద్గురుని శరణుజొచ్చినచో వారిపాపములు క్షమింపబడిపోవును. సద్గురుని శరణుబొందనివారు అసలు నిష్పాపులే అయిననుగూడ, మహాపాపాత్ములలోనే లెక్కకు వచ్చెదరు.

205. సత్సంగములోని కెవరైన దురభిమానులును, అహంకారపూరితులును వచ్చినను వారు సత్సంగములోగలుగు ఆనందమును అనుభవించలేరు. ఏలనన, వారు దోషములుపట్టుకొను నుద్దేశ్యముతో వత్తురు, చెప్పిన విషయముల నెంతమాత్రము నర్థముచేసికొనరు. పైకి పవిత్రగ్రంథము[1]ను చాల భక్తిభావముతో పూజింతురుకాని, అందలి యుపదేశముల నొక్కటినిగూడ మన్నించరు. ఆయుపదేశములను మన్నించి చేతనైనంతవఱ కాప్రకార మాచరణగూడ జరుపుచు సద్గురువునకే ప్రాధాన్యమిచ్చువారిని వారు నీచముగ నెంచుదురు. అట్టి దురహంకారులు సంతుల సత్సంగమువలన నెన్నడు లాభము పొందజాలరు. వారు గ్రంథసాహబ్‌నందు అంధవిశ్వాసముగలవారు. గ్రంథసాహబ్‌లో గురువు నన్వేషించుకొనుడనియు, సద్గురుసేవవలన శ్రేయోలాభ

1. ఇచ్చట పవిత్రగ్రంథమనగా శిఖులు గురుస్థానే పూజించునట్టి "గ్రంథసాహబ్" అను పవిత్రగ్రంథము. అందులో శిఖుగురువులు వ్రాసిన గద్య, పద్యాత్మకరచనలు యెత్తి వ్రాయబడియున్నవి.

ములుగల్గుననియు, సెలవిచ్చిన విధిరూపమైన హితోపదేశములను వారు మన్నిం చరు. గ్రంథమునే గురువుగా పూజింతురు. వీరు గురునానక్‌వారి ఆజ్ఞకు వ్యతి రేకముగ ప్రవర్తించుచున్నారు. ఏలనన, గ్రంథము గురువుకానేరదు; అది స్వతః జడపదార్థము, స్వయముగ మాట్లాడను లేదు, ఉపదేశించను లేదు. ఆ కృత్యములు సద్గురువుమాత్రమే చేయగలరు. పవిత్రగ్రంథము ఉపదేశము లనే ఇవ్వగలిగినచో నిర్మలులు[1], ఉదాసీలును కాశీకి వెడలి పండితులవద్ద కింకరుల వలె నుండుటయు, గ్రంథసాహబ్‌ను వేదశాస్త్రములకన్న కనిష్ఠముగా భావిం చుటయు, తీర్థయాత్రిలలోను, ఉపవాసవ్రతములలోను భ్రమించుటయు, తమ మరణానంతరము తమ అస్థికలను గయకు గొనిపొండని తమ శిష్యులను కోరు చుండుటయు జరుగనేరదు. వేదములకు కర్తయైన బ్రహ్మకుకూడ తెలియనట్టి రహస్యవిషయము పవిత్రగ్రంథములో నున్నది కాని, ఒక్క పరిపూర్ణసద్గురువు దప్ప మఱెవ్వరును ఆ రహస్యమును వర్ణింపజాలరు. కావున నందఱునుగూడ సద్గురువునే ప్రధానముగచేసికొనవలెను. సద్గురువు పవిత్రగ్రంథములోని రహస్య విషయమును తెలియజెప్పగలరు, పవిత్రగ్రంథముతో నిమిత్తములేకుండగనే జీవున కుద్ధారము నీయగలరు. సమకాలికసద్గురువు నన్వేషించుకొనకుండనున్న వారు జననమరణచక్రములోబడి భ్రమించుచుండవలసినదే.

206. వాచకజ్ఞానులు మోక్షము పొందలేరు. వారు కేవలము కబుర్లు మాత్రమే చెప్పగలరు. నిజమైన బ్రహ్మజ్ఞానులకు స్థూలకర్మలు నశించునుగాని, సూక్ష్మకర్మలు అట్లే యుండిపోవును. సంతులధామమును పొందనిచో నాసూక్ష్మ కర్మలు నశించవు. ఈ యుగములో ముక్తిగూడ సంతులద్వారానే సాధ్యము కాగలదు. ఏలనన, స్థూల, సూక్ష్మకర్మలు నశించనిదే ముక్తి యెట్లు సాధ్య మగును ? కర్మ నాశనము చేయుసాధనము జ్ఞానులవద్ద లేదు.

207. సద్గురువును సాక్షాత్తు పరమపురుషునిగ నెవరుభావింతురో, సద్గు రువుచేసిన పని నెద్దానియందుగూడ నెవరుదోషబుద్ధిపెట్టరో, వారియం దెన్నడు నవిశ్వాస మెవరికి గలుగదో, అట్టివానినే గురుముఖుడని చెప్పుదురు. ఉదా హరణకు, కుటుంబములో నెవరైన మరణించినను, యేదైనకష్టముగాని, నష్టము గాని వచ్చినను, యెండలెక్కువగా కాచినను, చలియెక్కువైనను, అతివృష్టి

1. నిర్మలులు అనియు, ఉదాసీలనియు శిఖులలో రెండు తెగలవారు. ఉదాసీలు, గురు నానక్‌వారి కుమారుడు శ్రీచంద అనువారిని గురునానక్‌వారి తరువాత వారిస్థానే ప్రకటమైన గురువుగ మన్నింతురు.

అనావృష్టులు గల్గినను, రోగమువచ్చినను, మహామారివంటి అంటువ్యాధులు, లేక మఱొక ఆపత్తులుగాని వచ్చినను అట్లు జరుగుట యుక్తముకాదనిగాని, అన్యాయము, లేక తప్పు అనిగాని చెప్పకూడదు సరికదా, జరిగినదంతయు దివ్యేచ్ఛవలన జరిగినదనియు, అదియే యుక్తమనియు, నందులోనే శ్రేయోలాభమున్నదనియు నెంచుకొనవలయును. ఒక్క పరిపూర్ణుడైన గురుముఖుడే అట్లు ప్రవర్తించగలడు. మఱెవనికి నట్టిసమర్థత యుండజాలదు.

208. అందఱిశరీరములలోను రాముడు[1] ఉన్నాడు. కాని, ఎవరు నాయనను కనుగొనలేకున్నారు. పైగా ఆయన సమక్షములోనే జీవులు పాపకృత్యములు చేయుచున్నారు. ఐనను ఆయన వారి నాపాపపుపనులు చేయకుండ నిషేధించకుండుటయేగాక వారిని జననమరణచక్రములో పడవేసి కష్టపెట్టుచున్నాడు. అట్టి రామునివలన ప్రయోజన మేమున్నది? సద్గురువు లభించి, వారు రాముడు మానవశరీరములో నిట్టి స్వరూపముగ నున్నాడని తెలియజెప్పినచో జీవునకు రాముని అస్తిత్వజ్ఞానముగల్గి అటుపిమ్మట పాపకృత్యములనుండి తప్పించుకొని జననమరణచక్రమునుండి విముక్తినొందగలడు. కావున సద్గురువు నన్వేషించుట అత్యవసరము. ఏలనన, సద్గురువు ప్రత్యక్షముగనున్న రాముడు. గుప్తముగనున్న రామునికొఱకు అన్వేషణ సద్గురువులేనిదే యసాధ్యము. సద్గురు శరణు బొందనిచో వారికి రాముడును లభించడు, జననమరణచక్రమునుండి విమోచనమును గలుగదు. దుర్లభమైన మానవజన్మకూడ వ్యర్థముగ నష్టపోవును. హృదయపూర్వకముగ నెవరైనను సద్గురువు నన్వేషణచేసినయెడల నట్టివానికి సద్గురువు తప్పక లభింతురు. ఏలనన, సద్గురువు నిత్యావతారపురుషులు[2]. వారీ ప్రపంచమున నెల్లప్పుడు విరాజమానులై యున్నారు.

209. అంతర్యమున ప్రతిధ్వనించుచున్న శబ్దమును శ్రవణముచేయుట శబ్దభక్తియగును. ఏ పురుషునిలో శబ్దము ప్రకటమైయుండునో, వారిని ప్రేమించుట, వారికి సేవచేయుటయు సద్గురుసేవయగును. అట్టి పురుషుడే సద్గురువు.

1. ఇచ్చట రాముడు అనగా బ్రహ్మాండాధిపతియైన బ్రహ్మ అని యర్థము.

2. ఈ సృష్టిలోని జీవులెల్లరికిని పరమపురుషునికిని సూక్ష్మరూపమైన అంతర్యసంబంధ మెల్లపుడు నుండుచున్నది. ఈ సూక్ష్మసంబంధములేనిచో జీవాంశ లీసృష్టిలో నిలువనేలేవు. జీవాంశలు లేనిచో సృష్టియే నిలబడనేరదు. జీవుని హృదయాంతరాళములోని ప్రార్థన లీసూక్ష్మబంధనసూత్రముద్వారానే పరమపురుషునివఱకును జేరును. ఆ ప్రార్థనలకు సమాధానముక్రిందనే పరమపురుషుడు పరమ సంత్ సద్గురువుగ మానవరూపమును ధరించుదురు. ఈ సూక్ష్మసంబంధ మీసృష్టిలో నిరంతరము నుండుచున్నది. ఇవ్విధముగా సంతులను నిత్యావతారమని చెప్పుట యుచితమే.

శబ్దము వారి నిజస్వరూపము. వారి ఆజ్ఞలను ఆదరభక్తులతో విని, ఆ ప్రకార మాచరించుట సద్గురువునకు బహిర్ముఖభక్తియగును. అంతర్యామున శబ్దశ్రవణము చేయుట సద్గురువునకు అంతర్ముఖభక్తి యగును. అయినను ఏ మానవ స్వరూపమును ధరించి, సద్గురువు ఉపదేశము నిచ్చుచున్నారో ఆ మానవ స్వరూపమునకు భక్తిచేయుట ప్రథమసోపానము. అప్పుడే శబ్దస్వరూపమునందు ప్రేమగలుగును. ఎవనికి సద్గురువుయొక్క దేహస్వరూపమునందు ప్రేమయుండదో, అతనికి శబ్దస్వరూపమునందుగూడ ప్రేమగలుగదు. అట్టివానికి అంతర్యాశబ్దము, అతడెన్నిపాట్లుపడిననుగూడ గోచరముకాదు. ఎవనికైనను సద్గురువుయొక్క దేహస్వరూపమునందు ప్రేమయుండి, శబ్దస్వరూపమునందు అంత ప్రేమలేకపోయినను సద్గురు వట్టివానికి తమ దయాకటాక్షముల ప్రభావముచే నుద్ధారము నొసంగగలరు. కాని, సద్గురువునందు ప్రేమయున్నవానికి తప్పకుండ అంతర్యాశబ్దముమీదకూడ ప్రేమయుండితీరును. మొట్టమొదట సద్గురువుయొక్క దేహస్వరూపమునందు భక్తిప్రేమలను ఉత్పన్నముచేసికొనవలెను. అట్లుకానిచో కార్యము సఫలముకానేరదు.

210. నారదముని రాముని ప్రత్యక్షదర్శనము చేసికొనెను. కాని ఆయనను జననమరణచక్రమునుండి తప్పించుటకు రామునికి శక్తిలేకపోయెను. గురువుమాత్రమే ఆయన నందుండి తప్పించెను. అట్లుండగా, ప్రస్తుతకాలములో రాముని నెన్నడు కంటితో చూచియెరుగనట్టి వారు రామనామమునుమాత్రము జపముచేయుచు, పరిపూర్ణగురువుతో సంయోగములేకుండగనే జననమరణ చక్రమునుండి ఎట్లు తప్పించుకొనగలరు? కాబట్టి యెవరైనను తమసమకాలిక సద్గురువు నన్వేషించుకొని వారిశరణు పొందవలసియున్నది.

211. నిర్మల[1]జ్ఞానుల నిట్లు ప్రశ్నించవలయును. "మీరు గురునానక్‌వారి సంప్రదాయములోనివారు గదా! గురువుచే రచింపబడిన గ్రంథసాహబ్‌లో వారుపదేశించినప్రకారము మీరేల నాచరించుటలేదు? వేదశాస్త్రముల కేల దాసులైపోయిరి, అనగా, గురువు చెప్పినప్రకారము భక్తిచేయకున్నారేమి? వారు వర్ణించిన దీనభావము నేల కలిగియుండుటలేదు? మీరు బ్రహ్మజ్ఞానుల మైతిమనుకొనుచున్నారు కాని అది గొప్పపొరపాటు. భక్తిచేయకుండగనే మీకు జ్ఞాన మెట్లుసంప్రాప్తమైనది? ఇదంతయు గ్రంథములు చదువుటవలన గలిగినజ్ఞానము. మాయయొక్క ప్రభావము ప్రబలమైనపు డిదంతయు నదృశ్య

1. నిర్మలజ్ఞానులని శిఖ్ఖులలో నొక తెగవారు.

మైపోవును. కావున పరిపూర్ణసద్గురువునకు భక్తిచేయుడు. అప్పుడే మీకు నిజమైన అనుభవజ్ఞానము లభించును. వ్యాస, వశిష్ఠులు వారి మతప్రకారము పరిపూర్ణులే అయి యుండియుగూడ, మాయయొక్క వంచనకు లోబడిపోయి యుండగా మీ రెట్లు తప్పించుకొనగలరు ? సంతుమహాత్ములును, వారి శరణు పొందినవారున్నుమాత్రమే మాయయొక్క వంచనలకు లొంగిపోకుండ తప్పించుకొనగలరుగాని, మఱెవ్వరు నట్లు తప్పించుకొనలేరు. మీకు సంతులయందు భక్తిలేనిచో కాలునిజాలములో చిక్కుగొని యుండిపోవుదురు. నరజన్మ సఫలముచేసికొనగోరినచో, విద్యాబుద్ధులవలని యహంకారమును విడచిపెట్టి సంత సద్గురుచరణములవద్ద దీనభావముతో ప్రవర్తించుడు. వారు సర్వసమర్థులు కావున కాలుడు, మాయ ఇరువురినుండియుగూడ రక్షించి తమ స్వస్థానమునకు జేర్పించగలరు. మీరు మా యీ ఉపదేశమును మన్నించినను సరే, మన్నించకపోయినను సరే మీ యిష్టము. ఇదంతయు మీ శ్రేయస్సును గోరి చెప్పడమైనది."

212. కలియుగములో సంతుమహాత్ములే రాజాధిరాజులు. వారి ఆజ్ఞలను పాలించువారికే, అనగా, వారు కలియుగములో జీవులకొఱకై ఏయుపాసనను, కర్మను నిర్దేశించి చెప్పిరో, ఆ యుపాసనను కర్మను అనుష్ఠించినవారికే ఆనందము చేకూరును, వారికి ఉద్ధారముగూడ లభించును. ఆయాజ్ఞలకు వ్యతిరేకముగ నడచుకొనువారు, అనగా, శాస్త్రములు, పురాణములలోను చెప్పబడిన పూర్వయుగములకు సంబంధించిన కర్మకాండను, జ్ఞానబోధలను, ఉపాసనా విధానములను అవలంబించువారు ఆకర్మలు వగైరాలను యథావిధిగా చేయలేకపోవుటయేగాక మీదుమిక్కిలి అహంకారపూరితు లగుదురు. ఏలనన, ప్రాచీనకాలపువిధులన్నియు నిప్పుడు రద్దైపోయినందున నవి ఇక్కాలమునకు వర్తించవు. వానియందే అంధవిశ్వాసముపెట్టుకొని అప్రకారమే ఆచరించువారికి కార్యసాఫల్యము గలుగదు. జననమరణచక్రమునుండి విముక్తియు గలుగనేరదు. కావున నందఱుజీవులకు సంతుల ఆజ్ఞలను పాలించుట ముఖ్యావశ్యకము. సంతులు కర్మలను, ఉపాసనను ఈ క్రిందివిధముగా నిర్దేశించిరి:-

1. సద్గురువుయొక్క సత్సంగము, సేవాదర్శనములు, వారి గ్రంథముల శ్రవణపఠనములు, వారి నామస్మరణయును- ఇవి కర్మలు.
2. సద్గురువుయొక్క స్వరూపమునందు ప్రేమయు, ఆ స్వరూపధ్యానము, వారుపదేశించిన శబ్దము నాంతర్యమున ఆత్మతో వినుటయు- ఇవి ఉపాసన.

213. బ్రాహ్మణులును, క్షత్రియులును వారివారి కర్మలను, ధర్మములను విడచి వేసిరికాని, అహంకారమును విడచిపెట్టలేదు. ప్రాచీనయుగములకొఱకై యేర్పాటుచేయబడియుండి, ఇప్పుడు వారు చేయుచున్న కర్మలు యథావిధిగ జరుపబడజాలవు. కలియుగార్థమై వారి యాచార్యులచే నిర్ణీతమైన కర్మలను వారు అనుష్ఠించుటలేదు. ఈకారణముచే వారు దురదృష్టవంతులై అసహాయ స్థితిలో పడియున్నారు. ఏలనన, పూర్వకాలములో జీవికోపార్జన పరమార్థ సాధన కఠినముగ నుండెడిది కాని, యీ కాలములో నట్లుగాక పరమార్థసాధనయే జీవికోపార్జన కఠినమైపోయినది. కలియుగములో నవతరించిన సంతు మహాత్ములు ప్రకటముచేసిన సాధనను అభ్యాసముచేసినచో, నా సాధకుడు నిజమైన బ్రాహ్మణుడును కాగలడు, నిజమైన క్షత్రియుడుగూడ కాగలడు. కాని వీరు అహంకారము మూలమున సంతుల యుపదేశములపై విశ్వాసము వహించుటకుబదులు నిందారోపణలు చేయుచున్నారు. ఇంతకు కారణమేమనగ, మురికిలోని పురుగుకు మురికిని విడచుట కెట్లిష్టముండదో, అటులనే వీరికిగూడ ప్రపంచమును విడచిపోవుట కిష్టములేదు. అందుచే సంతులు జగత్తులోని జీవుల శ్రేయోలాభముకొఱకే బోధలుచేయుచున్నను, ఆబోధలు ప్రాపంచిక జీవులకు అహితవుగనే యుండును.

214. భగవంతుడు జీవునికి దగ్గఱగనేయున్నాడు. కాని మూర్ఖజీవులు వారిని బాహ్యమున వెదకుచుందురు. ఎట్లనగా, కాశీప్రయాగలలోనుండువారు భగవంతునికొఱకై అయోధ్య, బృందావనము, హరిద్వారము, బద్రీనాథ క్షేత్రములకును, అయోధ్యాబృందావనముల నివాసులు ప్రయాగకును పోయి తిరుగుచు భ్రమించుచున్నారు. సద్గురువు ఒక్కరుదప్ప మఱెవ్వరు నీపర్యటనములను మాన్పించశక్తిగలవారు లేరు. కావున సద్గురువు నన్వేషణచేసికొనవలెను. పండితులు, కాషాయవస్త్రవేషధారులును స్వయముగ భ్రమలపాలై ఇతరులనుగూడ భ్రమింపజేయుచున్నారు.

215. ఈనరదేహము క్షణభంగురము. దాని యౌవనము చూచి గర్వపడనేల? ఆకురాలు కాలములో చెట్లయాకు లెట్లు రాలిపోవునో అట్లే యీ యౌవనము గూడ కొద్దికాలములో గతించిపోవును. కావున దీనిని వ్యర్థముగ పోగొట్టుకొనక తన ప్రియమైన ప్రభువును గుఱించి వివరములు తెలిసికొని వారి సేవాపూజలు సల్పుచుండవలెను. తల్లిదండ్రులు, దారాపుత్రమిత్రులు, బంధువులు, పరిచయస్థులును, ధనధాన్యములును, అన్నియు దుఃఖప్రదములే

కాని, నిజముగ ప్రేమించదగినవి కావని తెలిసికొనవలెను. కాని, ప్రాపంచిక జీవులు వీనినే సుఖరూపములుగ నెంచుదురు. అందుచే వారభాగ్యులు. పరిపూర్ణసద్గురువునందు భక్తి, విశ్వాసములు గలిగి, శరీర మనోధనములను వారి సేవనిమిత్తమై వెచ్చించునట్టివారే మహాదృష్టవంతులు. ఈ యౌవన సమయములోనే యెవరు సద్గురువు నన్వేషణచేసికొనిరో, వారే బుద్ధిశాలురు. అట్లు చేయక నిర్లక్ష్యముగ నున్నవారు పశ్చాత్తాపపడవలసివచ్చును.

216. సంతులకు, పండితులకు సామరస్యము ఎప్పుడును లేదు, ఎన్నటికిని ఉండజాలదు. ఏలనన, పండితులు జీవులను బాహ్యముగ భ్రమింపజేయుదురు. సంతు లట్లుగాక నాంతర్యమున లగ్నముచేయుదురు. పండితులు జీవులచే జల పాషాణములకు భక్తిచేయించి వారిని ధర్మభ్రష్టులుగ చేయుచున్నారు. కొందఱు వర్ణాత్మక నామముయొక్క ఉపాసనను ఉపదేశించుచున్నారు, కాని దాని రహస్యమును వారు చెప్పజాలకున్నారు. సంతులు ధ్వన్యాత్మకనామము నుపదేశించుచు, దాని రహస్యమును యథావిధిగ, అనగా, దాని స్వరూపము. శోభ, ధామమును గుఱించి విస్పష్టమైన వివరములతో తెలుపుటచేయుచున్నారు. జీవులు సంతుల యుపదేశమును మన్నించినచో వారి యుద్ధారకార్యము నెఱవేరును. లేనిచో వారిచ్చట జన్మజన్మలకు పరిభ్రమించుచు నుండిపోవుదురు.

217. తండ్రి సేవ చేయుటయే యీజీవునిధర్మము. సత్యనామ, సత్యపురుషుడు జీవునికి తండ్రియు, జీవుడు సత్యపురుషుని అంశయును. అయినను ఆయన జీవునకు లభించుటలేదు. అట్టి స్థితిలో నితడు సేవ ఎట్లుచేయగలడు? ఇప్పుడు గ్రహించవలసిన విషయమేమనగా, సంతులు సత్యపురుషునిఅవతారము. వారిసేవయే సత్యపురుషునిసేవయగును. గతించిపోయిన మూడుయుగముల లోను సంతులు ప్రకటముకాలేదు. ఇప్పుడు కలియుగములో కేవలము జీవుల యుద్ధారమునిమిత్తమై యవతరించియున్నారు. వారికి ఈ ప్రపంచమునకు వచ్చుటలో మఱేయుద్దేశ్యమును లేదు. ఉత్తమసంస్కారులైన జీవులకు సంతుల దర్శనముచేసికొని, వారియుపదేశములు విన్నతోడనే విశ్వాసముగలిగి, వారు సంతులచరణములందు లగ్నమైపోవుదురు. ఇంక నెందఱోజీవులకు మంచి సంస్కారములేర్పడి వారికికూడ, క్రమక్రమముగ జననమరణచక్రమునుండి విముక్తిగలుగును. ఏలనన, సంతులొక్కరుదప్ప మఱెవరునుగూడ జీవుని జనన మరణచక్రమునుండి తప్పించి తనస్వస్థానమును జేర్పించగల సమర్థులులేరు.

218. పవిత్రనామమునందు విశ్వాసములేనివారికి, బాహ్యమున వారు తమప్రవర్తనను బహున్యాయముగనుంచుకొని, యాంతర్యమునగూడ చిత్త నైర్మల్యము కొంతసంపాదించుకొనుచునుండినను వారెంతయధికముగ జపతప ములు, యమనియమములు, అభ్యాసములు చేసినను పూర్తియైన ఫలితము లభించదు. సద్గురువు ఉపదేశించిననామము నెవరైనను పొంది, ఆనామమందు వారికి సంపూర్ణవిశ్వాసము దృఢముగ నేర్పడినచో, నట్టివారికి జపతపసంయ మముల ఫలితమును దక్కును, ఉత్తమోత్తమధామమును లభించగలదు.

నామ లియో జిన సబ్ కియో, జోగయజ్ఞ ఆచార్ ।
జపతప సంజమ పరసరామ, సభీ నామ్ కీ లార్॥

అర్థము:— ఎవరు పవిత్రనామమును పునశ్చరణచేయుదురో వారు యోగాభ్యాసము, యజ్ఞము, ఆచారములు, జపములు, తపములు, సంయమ ములు అన్నియు చేసినట్లే. ఏలనన, జపతపసంయమములు అన్నియు నామ మున కధీనములై యున్నవని పరశురాములవారు చెప్పుచున్నారు.

ఈ పవిత్రనామము సంత్ సద్గురువువలన లభించగలదు. దానివలన సకల మనోవికారములు మొదలంట నశించి, ఇంద్రియమనస్సులుగూడ మెల్లమెల్లగా వశములోనికి వచ్చును. ఇంద్రియములను మఱేవిధముగనైన వశీకరణముచేసి కొనయత్నించినచో, చాల కష్టసాధ్యము. ఒకఇంద్రియమును అణచివేసినచో, మఱొక ఇంద్రియము తీవ్రమైపోవుచుండును. గ్రంథములలో చెప్పబడిన నామ ములను జపముచేసెడివారిస్థితి యిట్లే యుండును. అనగా, వారు నామపునశ్చ రణ చేయుచునే యుందురు. కాని వారి మనోవికారములు దూరము కాజా లవు. గురుముఖతఃపొందిన, అనగా, వారు సంతులవద్ద ఉపదేశముపొందిన నామ మును ఆరాధించినయెడల వారికి మనోవికారములు నిస్సంశయముగ క్రమేణ నశించిపోవును. ఈ నామముదప్ప, కలియుగములో మనోవికారములను నశింప చేసికొనుటకు మఱొకసాధనము లేదు.

219. సంతులమతములో వైరాగ్యమున కేమియు ప్రాధాన్యములేదు. గురుభక్తికిమాత్రమే మహిమచెప్పబడినది. సద్గురుభక్తి సంపూర్ణముగనున్న వానికి వైరాగ్యాదిసాధనలు యెట్టిసాధన చేయునక్కఱలేకుండగనే వాటంతట నవియే సిద్ధించును. ఏలనన, సద్గురువు అట్టివానికి వానిని వరదానముగ ప్రసా దింతురు. కాని చంద్రునియెడల చకోరపక్షికిని, వీణానాదమునెడల లేడికిని, దీపమునెడల పతంగమునకును, జలమునెడల మత్స్యమునకు నెట్టిప్రీతియుండునో

సద్గురువునందు అట్టితీవ్రభక్తియుండవలెను. అట్టిప్రీతి యెవనియందునో అతడే గురుభక్తుడని పేర్కొనదగును. పైనచెప్పిన మహిమావిషయములు అట్టివానికే వర్తించును.

220. కొద్దిపాటి అపవిత్రతవలననే నామముయొక్కశక్తి పోయినచో నది పవిత్రనామమనియే చెప్పదగదు. పవిత్రనామము సర్వోత్తమశక్తిమంతము. అది ఎట్టి అపవిత్రతనైనను నశింపజేసి పవిత్రముగ జేయగలదు. దాని నేస్థలమందు జపించిన నెట్టిహానినష్టములును గలుగనేరవు. నీచాతినీచమైన స్థలముగూడ నచ్చట నామస్మరణచేసినందువలన పవిత్రమైపోగలదు. అట్టినామము సంత్ సద్గురువు వద్దనుండియే లభ్యమగునుగాని, మరెచ్చటను లేదు.

221. కలియుగములో గురుభక్తియు, పవిత్రనామస్మరణమును దప్ప యితరకర్మలెవ్వియు చేయుటకు ఆజ్ఞలేదు. ఇందుకు వ్యతిరేకముగా నడచుకొనువారు అనగా, ప్రాచీనయుగములకు సంబంధించిన కర్మలలోపడి శ్రమపడుచున్నవారు, అహంకారపూరితులైపోయి నిర్మలమగుటకుబదులు మరింత యెక్కువగ మలినమైపోవుదురు. వేదశాస్త్రములలోగూడ నీవిషయమే చెప్పబడియున్నది. సంతులుగూడ నటులనే సెలవిచ్చుచున్నారు. వేదములలో చెప్పబడిననామము త్రిలోకము[1]లవఱకే పరిమితమైయున్నది. కాని, సంతులుపదేశించిన నామము నాలుగవలోకము[2]నకు గొనిపోవును.

222. జీవునకు మూడు బాహ్యరుగ్మతలును, మూడు గుప్తరుగ్మతలును గలవు. బాహ్యరుగ్మతలు కుదుర్చుకొనుట కతడెట్లైనను ప్రయత్నించునుకాని, ఆంతర్యగుప్తరోగము లతనికి తెలియనే తెలియవు. వానిని సంత్ సద్గురువే తెలియచేయగలరు. అదృష్టవశముచే వారి సంయోగము లభించినచో నతనికి ఆరుగ్మతలను గుఱించి జ్ఞానముగలిగి వానిని నివారించుకొనవలయుననెడి వాంఛకూడ బయల్దేరును. అందులో మొదటిరోగము జన్మమరణరోగము. రెండవది త్రిలోకీనాథుడైన మనస్సుతో నిరంతరము పడుచున్నట్టి బాధలు. మూడవరోగము అజ్ఞానము. అజ్ఞానమనగా, తానెవరు, తానెవరియంశ, తన యంశియైన వారెచ్చట నున్నారు అనెడి తననుగుఱించిన వివరములు తెలియకుండుట. ఏరోగమైనను తగ్గుటకాని ఏవ్యవహారమైనను పరిష్కారమగుటకాని కేవలము గ్రంథములు చదివినంతమాత్రముననే కాజాల

---

1. పిండ, అండ, బ్రహ్మాండములు త్రిలోకములని పేర్కొనబడును.
2. నాలుగవలోకమనగా త్రిలోకములపైన నున్న నిర్మలచైతన్యదేశము.

వని తేటతెల్లమే. రోగమైనచో నొకవైద్యునివద్దకు వెళ్లియు, వ్యావహారిక బాధయైనచో నొక తగినఅధికారివద్దకు వెళ్లియు, తన విషయమంతయు చెప్పి కొని రోగమునకు మందు తీసికొనవలయును, లేదా వ్యావహారికవిషయములో నా యధికారిచే తీర్మానము చేయించుకొనవలయును. సద్గురువు వర్తమాన సమయములోనున్న వైద్యులును, అధికారియుగూడ. అందుచే నీ రోగమును వారే కుదర్చగలరు. అదేవిధముగ, అజ్ఞానమనెడి రోగము ప్రాచీనపురుషుల యందంధవిశ్వాసము గలిగియున్నందువలన నశించదు. సమకాలికులైన సద్గురుని శరణుజొచ్చుటవలననే నశించును. అనగా సద్గురువు జీవునకు దృష్టిని ప్రసాదించినపుడే అతడు తన స్వరూపమును గురించియు, తన భగవంతుని గురించియు తెలిసికొనగలడు. సమకాలికులైన సద్గురుని సత్సంగము దప్ప మఱొక చికిత్సలేదు.

223. శబ్దము సూక్ష్మమైనది. జీవుని స్వరూపము స్థూలమైపోయినది. అట్లైనపుడు జీవుడు శబ్దమునందు ఒక్కపెట్టున నెట్లు లగ్నముకాగలడు? జీవుని స్థూలత్వము పోగొట్టుకొనుటకుపాయము సద్గురుభక్తియే. సద్గురువునకు సంపూర్ణముగ భక్తిచేయువఱకు, శబ్దమును పొందుట కధికారి కానేరడు.

224. సద్గురువును గుర్తించుట కష్టము. వారిని గుర్తించినవాడు నిర్భయముగ నుండును. ఏలనన, లోకములో అధికారపదవిలో నున్నవారితో పరిచయముగలవారు ఇతరుల నెవ్వరిని లెక్కచేయరుగదా! అట్లే సృష్టికంతకు నధిపతియైన సద్గురువును దెలిసికొన్నవాడు మఱొకరివలన నేల భయపడవలయును? కాని యిట్టిపరిస్థితి అరుదుగ నెవరోయొక మహాదృష్టవంతునికి మాత్రమే సంప్రాప్తమగును. సామాన్యజీవులుమాత్రము ప్రపంచములోని యధికారులకు భయపడి సద్గురువునే విడచిపెట్టుపరిస్థితిలో నుందురు. అట్టిస్థితిలో వారికి సద్గురునిమహిమ యెట్లు అవగాహనకాగలదు? నిజమునకు సామాన్యజీవునికి సద్గురువును గుర్తుపట్టగలశక్తి లేదు. ప్రపంచములోని యధికారులు తమ యధికారహోదా చూపించి అందఱను బెదరింతురు. సద్గురువుమాత్రము తమ మహత్తును గుప్తముగ నుంచుకొని ప్రపంచములో సామాన్యజీవునివలెనే ప్రవర్తించుచుందురు. ఈ కారణముచే వారెవరిపైన ప్రత్యేక దయ చూపుదురో, అట్టివారే వారి మహిమను గుర్తించగలరు. ఇతరులెవరికిని వారి మహిమను గుర్తుపట్టగలశక్తి యుండదు.

225. సద్గురువుయొక్క వచనములను లీలలును, అందఱకు ప్రియము గనే యుండును, కాని సద్గురువునే ప్రేమించువా రరుదుగ నుందురు. సద్గురువు యొక్క వచనామృతముపైనను, వారి లీలావిశేషములపైనను ఆధారపడి యేర్పడినట్టి ప్రేమ విశ్వసింపదగినదికాదు. వచనములు, లీలలునుగాక ప్రత్యేకముగ సద్గురువునే ప్రేమించువారల ప్రేమయే వాస్తవమైనప్రేమ. అయినను, వచనములు లీలలనుబట్టి ప్రేమగల్గినవారిలోనుండి కొందఱు క్రమక్రమముగ సద్గురువునే ప్రేమించువారుగ తయారుకాగలరు. సద్గురువునందు ప్రేమోత్పాదనయగుటలో నిదికూడ నొకసోపానమై యున్నది.

226. ఒక్కొక్కడు ఒక్కొకరిని గొప్పవానినిగా పొగడుచుండును. అనగా, ఏమానవుడైనను తనకెవనివలన స్వార్థలాభము గలుగుననితోచునో వానిని పొగడుచుండును. కాని అట్టిశ్లాఘ విశ్వసనీయముకాదు. ఇది గాడిద ఓండ్రించుటవంటిదే, అనగా ప్రప్రథమములో ప్రబలముగా అఱచుట ఆరంభించి క్రమక్రమముగా అఱపులు సన్నగిలుచుండును. అట్టి పరిస్థితిగలవాని ప్రేమను నమ్ముటకు వీలులేదు. మొదటినుంచి చివరవఱకు నొకేరీతిగనున్న వాని ప్రేమయే వాస్తవప్రేమయని చెప్పదగును.

227. జీవుడు ప్రపంచములో జన్మమెత్తినది మొదలు, కాలుడు జీవునితో తనకు పెండ్లియైపోయినట్లే అతనితో కలసియుండుచున్నాడు. భర్త తనభార్యను తీసుకొని వెళ్లుటకై వచ్చినప్పుడు స్త్రీకి యేడ్పుటరివాజు, అనగా, ఆమె తనను తీసికొనిపోనివ్వవద్దని మొఱపెట్టుకొనుచున్నట్లుండును. కాని యెవరు నడ్డుపెట్టజాలరు. అదేవిధముగ కాలుడేతెంచినపుడు జీవు డెంతైన నేడ్వవచ్చునుగాని యెవ్వరు నతనికి సాయముచేయలేరు. కాలుడు జీవుని తీసికొనివెళ్ళి తల వెంట్రుకకన్నను గూడ సూక్ష్మతరముగ నున్నట్టియు, చీమలుకూడ ప్రాకలేనంత కఠినమైనట్టియు మార్గములో పారవేయును. ఆ మార్గమున పోవునపుడు జీవులు ముక్కలుముక్కలుగా[1] తెగిపోయి, క్రిందనున్న నరకకుండములలో పడి పోవుచుందురు. అప్పుడు వారికిగలిగెడి బాధ వర్ణనాతీతము. అందువలన సంత సద్గురువు, ఈ మార్గము తలవెంట్రుకకన్న సూక్ష్మమైనదనియు, దానివలన

1. జీవుడు పిండదేశములో నున్నప్పుడు స్థూలములును, సూక్ష్మములును అగు ననేక భౌతికకోశములచే కప్పబడియుండును. జీవుడు ఊర్ధ్వలోకములకు ఆరోహించినపుడు ఈకోశములన్నియు తుత్తునియలుగ ఛేదింపబడి క్రిందకు జారిపోవును. ఈ వాక్యమునందు సూచితమైన విధాన మిదియే.

జీవులు భయపడుచుండినచో వారు తమ అసలుస్వరూపమును తెలిసికొనవలయు ననియు, నందుకు సాధన పరిపూర్ణసద్గురువువద్ద దప్ప మఱెవ్వరివద్దను లభ్యము గాదనియు మహాదయతో రెట్టించి బోధపఱచుచున్నారు. జీవుడు సద్గురుని శరణు పొందినపుడు వారతని కేసాధన యుక్తమగునో, దానినే అభ్యాసము చేయించి, యీ భయానకమైన మార్గమునుండి కాపాడి, తమ యొడిలో గూర్చుండబెట్టుకొని, శాశ్వతానందనిలయమగు తమ నిజధామమునకు జేర్చు దురు. మరణక్లేశమునుండి తప్పించుకొనుటకు ఇంతకన్న వేఱొక యుపాయమే లేదు.

228. నామమును పొందుట కష్టమనుమాట వాస్తవము. కాని నామ మును పొందినవారిని శరణుజొచ్చుట సులభమే. ప్రతిమానవుడును స్వయ ముగ నామమును పొందలేకుండుటయు, ఐనను అట్టివారు నామమును పొందిన వారికి శరణాగతి నొందుచుండుటయు నెల్లపుడు వాడుకగా జరుగుచునే యున్నది. అట్లు శరణుజొచ్చుటలో మహదానందమున్నది. ఈ పద్ధతి సంతులకు వర్తిం చదు. ఏలనన, వారే స్వయముగ సంతుపదవి నొందియుండిరి. అదృష్టవశాత్తు జీవులకు ఈ పద్ధతి లభించియున్నది.

229. ఎవరైనను సంతసద్గురుని గుర్తింపగోరి పురాతనగ్రంథలిఖితము లైన మహాపురుష లక్షణములనుబట్టి సరిపోల్చుకొని చూడదల్చినచో నది యెంతమాత్రము సాధ్యముకాదు. ఆ విధముగ సద్గురుని నెవ్వరు గుర్తుపట్ట లేరు. వారిని గుర్తింపవలెనన్నచో, నెవరైనను కొన్నిదినములు వారి సత్సం గము చేసికొనవలయును. అప్పుడే వారిని గుర్తింపగలరు. వారిని గుర్తుపట్టు టకై మఱొకపద్ధతి యెద్దియు లేదు.

230. నరశరీరమును పొందియు నందు విరాజమానమైయున్న సారపదార్థ మగు ఆత్మతత్త్వమును దెలిసికొనకుండ నెవడు తనజన్మను ప్రాపంచికభోగము లలో వ్యర్థముగ గడపునో, అట్టిజీవుడు పశువే. ఆకారమునకు మనుష్యుడైన నేమి, ప్రవర్తనలోమాత్రము పశువే. అయిన నీవిషయము (అనగా, ఆత్మను తెలిసికొనుట) పరిపూర్ణసద్గురువు లభించిననేగాని సిద్ధించదు. మొదట పూర్ణ సద్గురువు లభించుట కష్టము. ఒకవేళ లభించినను వారియెడల భక్తిభావము పుట్టదు. ఎందుచేతననగా, ఇక్కాలమున కాషాయవస్త్రవేషధారులు తమ్ము తామే బ్రహ్మయని చెప్పుకొనుచు, జ్ఞానబోధలుచేసి జీవుల నవభ్రమల పాలు చేయుచున్నారు. మీరు ఏసాధనచేసి బ్రహ్మనుపొందితిరని యెవరైనను వారిని

ప్రశ్నించినచో, ఆప్రశ్నకు తిరుగుసమాధానము చెప్పరు. అందుచే వారు బ్రహ్మ స్వరూపులమని చెప్పుకొనుట అసత్యప్రలాపమే. వారు చెప్పెడి జ్ఞానమార్గము గూడ విద్యావ్యాసంగముమీదను, బుద్ధిచతురతమీదను ఆధారపడియుండి, వారి మనఃకల్పితమే యైనందున అందుమూలమున జీవోద్ధారము కానేరదు. ఏజీవులకు పరిపూర్ణ సద్గురువు లభించి, వారు తమచరణములయందు భక్తివిశ్వాసములను వరదానముగ ప్రసాదించి, తమసేవయందు లగ్నముచేయుదురో ఆజీవులే మహాదృష్టవంతులు. ఏలనన, తమంతట తాము సద్గురువునందు దృఢ విశ్వాసముగలిగి యుండుటకుగాని వారిసేవలో నిలచియుండుటకుగాని జీవులకు శక్తిచాలదు. ఇవికూడ వారి దయాకటాక్షములమూలముననే సిద్ధించును.

231. పురాకృతపాపముల మాలిన్యము జీవునిపైన సహంకారరూపమున నేర్పడియున్నది. అందువలన జీవునకు సుఖదుఃఖములు గలుగుచున్నవి. సమకాలికసద్గురుని సంయోగము గలిగినచో, వారు ఆ మాలిన్యమును తమ దయారూపమైన యుదకముతో కడిగి, జీవుని నిర్మలముగజేసి, శాశ్వదానంద ధామమునకు జేర్పించుదురు. అయితే, అందుకుపరతు యేమనగా, జీవుడు వారి సత్సంగములో చివరవఱకు నిలచియుండవలెను. ఒక్కరోజుమాత్రము వచ్చి, తిరిగి ఒకనెలవఱకు సత్సంగములోనికి రాకుండనుండిపోయినచో నట్టివానికి సద్గురు వేమిచేయగలరు ? పరమార్థముకొఱకు తీవ్రసంవేగముగల జీవుని కొఱకే యీపని సాధ్యము. అట్టి సంవేగములేనివాని కీపని సాధ్యముకాదు.

232. భగవంతుడు లేడని వాదించునట్టి నాస్తికులు పొరపాటులో నున్నారు. కట్టెపుల్లలో నిప్పు గుప్తముగనున్నట్లే భగవంతుడుగూడ గుప్తముగ నుండి వారికి కనిపించుటలేదు. అందుచే వారు నాస్తికులైపోయిరి. వారు సద్గురువు నన్వేషించుకొని వారివద్దనుండి సాధనసుపదేశముపొంది, తమ మనస్సును మథనముచేసికొనినయెడల భగవత్సాక్షాత్కారము పొందగల దర్శనశక్తి వారికి లభించియుండెడిది. అప్పుడు అట్టి కృతఘ్నతాపాపమునుండి వారు రక్షింపబడియుండెడివారు.

233. మలయపర్వతముపైనున్న మంచిగంధపుచెట్లు తమసమీపముననున్న చెట్లనుగూడ తమవలెనే సుగంధముగలవాటినిగ చేయును. అటులనే సాధుసాంగత్యములోనికి వచ్చిన జీవులుగూడ ప్రాపంచికతాపత్రయములనుండి తప్పించుకొని ఒకనాటికి సాధురూపులైపోవుదురు. సాధుసాంగత్య మెవ్వారికి లభించునో, వారే మహాదృష్టశాలురు. అట్టివారికే మానవజన్మ సఫలత

నొందును. ఎవరికి సాధుసాంగత్యము సంప్రాప్తముకాలేదో, అట్టి సాంగత్యమును పొందవలెనను గోరికకూడ నుండదో, వారు పశుప్రాయులే. అట్టివారికి నరజన్మ గలిగిన ప్రయోజన మేమున్నది? దానిలాభము వారు పొందనే లేదు. వారిస్థితి యొక లుబ్ధునిపరిస్థితి వంటిది. లుబ్ధుడు వేనవేలరూపాయిలు, సంపాదించుచుండునుగాని వానిని తాను తిననుతినడు, ఖర్చుపెట్టను పెట్టడు. అట్టివాడు ధనవంతుడైన నేమిప్రయోజనము? చివరకా ధనమంతయు నెవనికిదక్కునో, యేమగునో యెవరికి తెలియును? అతడు మరణకాలమున ఆ ధనసంబంధమైన వాసనతో చనిపోయినచో, తిరిగి సర్పమైపుట్టును. అట్టి వాసనలేకుండనుండుట సంభవముకాదుగదా. కావున నతని కెట్టినీచయోనిలో జన్మగలిగెనో జననమరణచక్రములో నెట్లు చిక్కుకొనిపోయెనో చూడుడు. నరశరీరమునుపొంది, సంతుల సేవాభక్తులు సాగించుటలో నాశరీరము నెవరు వినియోగించరో వారు పైనచెప్పినవిధముగనే చివరకు జననమరణచక్రములో పడి కష్టములపాలగుదు.

234. వేదమతానుయాయులయొక్క కర్మ, ఉపాసన, జ్ఞానములు, జీవుని సంతులయొక్క కర్మస్థానమువఱకుమాత్రమే తీసికొనిపోగలవు. ఏలనన, సంతులు విధించిన కర్మ త్రికుటిస్థానములో ప్రవేశించువఱకు పూర్తి కానేరదు. సంతుల ఉపాసన త్రికుటినుంచి సత్యలోకమువఱకు జరిగించబడును. అనామీపదమునందు జేరినపుడే జ్ఞానము ప్రాప్తించును. అయినను సంతులెన్నడు తమ్ము తాము జ్ఞానులని చెప్పుకొనరు; ఎల్లపుడు భక్తిచేయుచునే యుందురు. జ్ఞానులమని చెప్పుకొనెడి వీరందఱును వాస్తవములో బూటకపుజ్ఞానులు. ఏలనన, వారికి జ్ఞాన మెట్లుకలిగినదని ప్రశ్నించినచో వారు సమాధానము చెప్పలేరు. అనగా కర్మ ఉపాసనలు చేయనిదే జ్ఞానప్రాప్తి కానేరదు. వారి కారహస్యమే తెలియదు; ఏలనన వారు అవి యేవియు చేయనేలేదు. కేవలము గ్రంథములనుమాత్రము చదివి జ్ఞానవాక్యములు నేర్చుకొనిరి. అందుచే వారు బూటకపుజ్ఞానులు. వారి యుపదేశములప్రకారము నడచుకొనువారు తమకు తాము హానిచేసికొనుచున్నారు.

235. ఎట్టి పరిస్థితులలోను సమకాలికసద్గురువునకే ప్రముఖస్థానము, మొట్టమొదట వారి చరణములందు హృదయపూర్వకమైనభక్తి చేయుటచే స్థూలపరిశుద్ధి, అనగా శరీరమనస్సులశుద్ధి గలుగును. అందువలన భక్తునకు అంతర్యమున నామశ్రవణమున కధికారము కలుగును. పిమ్మట నామము యొక్క సూక్ష్మరూపము, సద్గురువుయొక్క సూక్ష్మరూపము, తన సూక్ష్మ

రూపమును తదేకరూపముగ చివరకు గాననగును. కాని ఇది సద్గురువునందే సంపూర్ణభక్తి చేసినందువలననే సిద్ధించును.

236. నరశరీరమును ప్రస్తుతము పొందియుండి, యెవరు సద్గురువు నన్వేషణచేసికొనరో వారు జననమరణచక్రములో పడిపోవుటయేగాక, తిరిగి నరశరీరమునుగూడ పొందలేరు. అందుచే జీవితోద్దేశ్యమును సాధించుకొనుటకు సావకాశ మిప్పుడే. ఈ యవకాశమును పోగొట్టుకొనినచో ముందిట్టిసావకాశము తిరిగి లభించనేరదు.

237. సామాన్యముగ నందఱును బాహ్యసేవాశుశ్రూషలు చేయగలరు. దానివలన సేవనిభక్తియైనను వాస్తవమైనదో, లేక కపటముతో గూడినదో చెప్పుటకు శక్యముకాదు. శబ్దము నుపదేశించినపుడు దానియం దాత్మలగ్నమగుటయే నిజమైనభక్తునికి యథార్థచిహ్నం. అప్పుడే అతనిభక్తి యథార్థమైనదని గ్రహింపదగును.

238. సత్యలోకమునుగాని మఱొకలోకమునుగాని యిప్పించుడని సమకాలికసద్గురుని ప్రార్థనచేయరాదు. వారి నెల్లపుడు తమచరణములందు ఉంచుకొనుడనిమాత్రమే ప్రార్థనచేయవలయును. అంతకన్న నెక్కువ యున్నతమైనట్టిగాని మహత్తరమైనట్టిగాని స్థానము మఱొకటిలేదు.

239. ప్రాపంచికపదార్థములను స్వయముగ ననుభవించెడిజీవులు, మరణానంతరము, జననమరణచక్రములో పడిపోవుట కధికారులగుదురు. కాని ఆపదార్థములనే సంత్ సద్గురువునకును, సాధువునకును అర్పించినచో పరమపదమునొందుట కధికారులగుదురు. ఏలనన, సంతుమహాత్ములకా పదార్థములయందుగాని, తమ దేహమునందుగాని వాంఛగాని, ఆసక్తిగాని యుండదు. వారు కేవలము జీవోద్ధారము చేయునిమిత్తమే దేహమును ధరించియున్నారు. ఐనను ప్రతిదినము తమ నిజధామమునందలి మహదానందమును పొందుచుందురు. జీవులు అట్లుగాక తమ శరీరమునందును ప్రాపంచికవిషయములయందును ఆసక్తిగలిగియుందురు. అయిన నేజీవులు తమ శరీరమనోధనములను వారి సేవాశుశ్రూషలలో వెచ్చింతురో వారు మాత్రము జననమరణచక్రము నుండి విముక్తినొందుదురు. తమ ఆయుర్దాయమునంతను అన్నపానాదులలోను సుఖవిశ్రాంతుల ననుభవించుటలోను ఖర్చుపెట్టెడివారు జననమరణచక్రములో పడిపోవుదురు.

240. తత్త్వము, తత్త్వపదార్థముతో నైక్యమగువఱకు కార్యసాఫల్యము సేకూరదు. పంచస్థూలతత్త్వములకును కారణము ఆత్మ. ఆత్మకు శబ్దము కారణభూతము. అందుచే నీ పంచతత్త్వములలోబడి పాట్లుపడినందున జీవునకేమియు లాభముండనేరదు. ఆత్మతత్త్వమును శబ్దతత్త్వమునం దైక్యముచేయుటవలననే కార్యము నెరవేఱగలదు. కాని ఈపని పరిపూర్ణసద్గురువుయొక్క దయలేనిదే సిద్ధించనేరదు. కావున మొట్టమొదట సద్గురువు నన్వేషించుకొని వారికి భక్తి చేయవలయును.

241. చాతకపక్షికి స్వాతివానబిందువులవలననే కాని మఱే యితర నీటిబిందువులవలనను దాహము తీరదు. కావున నది స్వాతివానబిందువులకొఱకై అడవులన్నిటిలో తిరుగుచునే యుండునుకాని, మఱేనీటి నొకబొట్టుకూడ త్రాగనొల్లదు. భగవంతుడుగూడ దాని వాస్తవమైన తీవ్రబాధను జూచి స్వాతివర్షమును కురిపించి దాని దాహమును తీర్చును. అటులనే ఏమానవులు సద్గురువుకొఱకును, పవిత్రనామముకొఱకును వాస్తవమైనవాంఛతో నన్వేషించుచుందురో, అట్టివారికి సద్గురువును నిజనామమును లభ్యమగుదురు. ఈ మార్గమునం దడుగుపెట్టుట ప్రతిమానవునికిని సాధ్యముకాదు.

242. "నా మనస్సును గోరింటాకు నూరినట్లు మెత్తగా నూరి సద్గురుచరణములందు పట్టించగోరితిని. కాని సద్గురువు ఇంతవఱకు నంగీకరించలేదు. ఔగాక, నేను నా మనస్సును గోరింటాకువలె మెత్తగా నూరియుంటిని, వారికెప్పుడు దివ్యేచ్ఛగలిగిన నప్పుడే చరణములయందు పట్టించుకొనవచ్చును." అని సేవకుడైనవాడు చెప్పును. ఇంతశ్రమపడి మనస్సును పిండిగుండచేసినను గూడ సద్గురు వంగీకరించనిచో సేవకుడు దీనభావమును విడువకుండ దివ్యేచ్ఛకెదురుచూచుచుండుటయే సేవకుని నిజధర్మము. కాని, కొద్దిసేవచేసి అది అంగీకారముకానిచో అభావములో పడిపోవుట సేవకత్వము కాదు. అది సద్గురువునే సేవకునిగ జేసికొనుట యగును. అట్టిపరిస్థితిలో మనస్సెట్లు పిండిగుండ చేయబడగలదు ? అయినను, దయాళువైన సద్గురువు లభించుభాగ్య మబ్బినచో వారు తమ దయాకటాక్షములప్రభావముచే శిష్యుని లోపములన్నియు సరిచేయగలరు.

243. దాత దానమిచ్చునపుడు తన హస్తములను చాచును. అటులనే భగవంతుడు దయచూపినపుడు మేఘమును వర్షింపజేయును; కాని అందువలన ప్రపంచమంతకును లాభము కలుగును. భగవంతుడు పరమార్థులపై దయ

చూపినపుడు ప్రేమవర్షము కురిపించును. ఎవనిలోనైనను సకలసుగుణములు నుండి ప్రేమయొక్కటి లోపముగనుండినచో అతడువ్యర్థుడు. ఎవనిలో మఱేసుగుణమెద్దియు లేకుండినను నొక్కప్రేమయుండునో అట్టివాడే భగవత్సన్నిధానమును పొందగలడు. అందుచే ప్రేమ ముఖ్యము. ఆప్రేమ సద్గురు భక్తిచేయనిదే చేకూరదు.

244. సంతుమహాత్ములాయున్నతోన్నతధామమును అనంతమని చెప్పుటలో వారి కాధామము సాంతముగ తెలియదనికాని, వారు దానిని పొందలేదనికాని యర్థముకాదు. అభిప్రాయమేమనగ, ఆధామమునందలి ఆనందమున కంతులేదనియే. ఆధామములో సంతులు జలములో మత్స్యములవలె నుందురు. ఎవరైనను మత్స్యము జలమును చూడలేదనిగాని, జలమును సాంతముగా పొందలేదనిగాని యనినచో నది పొరపాటేగదా. జలములో జలరూపమైపోయినవారి కేమియు గొప్పలేదు. జలములో మత్స్యరూపముననుండి ఆ యానందమును పొందుచున్నవారిదే మహిమ.

245. కాలుడు మ్రింగివేసినందువలన జీవునకు మోక్షము లభించనేరదు. ఏలనన, ఆత్మ చైతన్యరూపము కావున కాలుడు దానిని కబళింపనేరడు. కాలుడు జీవుని దేహమునుమాత్రమే, ఒకరిని నీటిద్వారా, ఒకరిని అగ్నిద్వారా, మఱొకరిని పృథివిద్వారానున్ను కబళించును. కాలునికి, జీవునికి నైక్యము అసంభవము. ఏలనన, వీరిరువురును సత్యలోకమునుండి క్రిందికి దిగివచ్చినపుడు వారిమీద కోశములేర్పడుచు వచ్చినవి. కాలుడు తిరిగి వెనుకకు వెళ్లిపోలేడు. కాని, జీవునికి సద్గురువు సంప్రాప్తమైనచో వారి సేవాప్రతాపమువలనను, వారి దయాప్రభావమువలనను, అతనికోశములు దిగజారిపోవును. అప్పుడతడు తిరిగి సత్యలోకముగూడ చేరుకొనగలడు. ఆకోశములు దిగజారిననేగాని జీవుడు తన నిజగృహమును చేరుకొనలేడు. సద్గురుసేవ చేయకుండగను, సద్గురుభక్తి లేకుండగను, శబ్దమును పొందకుండగను కోశములెన్నటికి నశించిపోనేరవు.

246. జీవుడు అలఖుని[1]హద్దులు దాటి పైకిపోనంతవరకు ముక్తిపొందలేడు. అలఖుడను పదముచే మనస్సును, కాలుడును పేర్కొనబడుదురు; ఏలననగ, కాలుడు జీవుని కబళించుచునేయుండునుగాని జీవుడతనిని చూడలేడు. వాస్తవమైన పరమార్థాసక్తిగలజీవుడు ఇతరయత్నములన్నియు విడచిపెట్టి,

1. ఇచ్చట అలఖుడు అనగా అదృశ్యుడు లేక చూచుటకు శక్యముగానివాడు అని యర్థము.

పరిపూర్ణసద్గురుని శరణు పొందవలెను. అప్పుడే అతనికార్యము నెఱవేరును. ఏలనన, సంతులే అలఖుని చూచిరికావున వారే ఈయలఖుని హద్దునుదాటించి జీవుని పైకి గొనిపోగలరు. మూఁల్లోకములును అలఖునిహద్దులలోనే యున్నవి. ఇంతవఱకు నెందఱు అవతారపురుషులు, దేవతలును ఉండిరో, వారెవ్వరును గూడ అలఖుని హద్దులుదాటి పైకివెళ్లలేదు. సంతులొక్కరే ఆ హద్దులుదాటి పైకిచేరుకొనిరి. అందుచే వారి శరణుపొందినవారు కాలుని హద్దులుదాటి పైకి వెళ్లగలరు. ప్రాచీనమహాపురుషులయందు మూఢవిశ్వాసము పెట్టుకొని, సమ కాలిక సంత్ సద్గురువునందు భక్తివిశ్వాసములులేనివారు సంతుమహాత్ముల గూఢరహస్యమును తెలిసికొనలేరు. వారెన్నటికిని కాలునిజాలమునుండి బయ టకు పోనేరరు.

247. హరిచరణముల శరణుజొచ్చినయెడల జీవున కుద్ధారము గలుగు నని చెప్పుదురు. అయితే జీవుడాహరి నెచ్చట వెదకికొనవలయునో, ఇప్పుడు యోచింపుడు. హరిని దేహరహితుడనియు, అరూపుడనియు చెప్పుచున్నారు. అయితే చరణములకు శరణుజొచ్చుడని చెప్పినపుడు ఆ హరికి చరణములుండ వలెను. చరణములుండినచో శరీరముకూడ నుండవలసినదే. కావున నట్టిహరి యెవరు ? సద్గురువుయొక్క శరణుపొందవలెననియే పైనచెప్పినదానికర్థమని సంతులు సెలవిచ్చుచున్నారు. ఏలనన, హరియు గురువు నొక్కరే. కావున సమకాలికులైన సద్గురుని శరణు పొందవలయును. అప్పుడే పతితోద్ధారక మనువ్రసిద్ధిగల పవిత్రనామము లభించును. సాధుసాంగత్యములోనే ఆ నామ మును సాధనచేయుటకు వీలగును. అనగా, ఇతరదుస్సాంగత్యములన్నియు విడచి పెట్టి, మొట్టమొదట సాధుసాంగత్యము చేయవలయును. అప్పుడే అభ్యాసము సాగును. తల్లిదండ్రులు, దారాపుత్రులు, ప్రపంచికజీవులును, వీరలసాంగ త్యము దుస్సాంగత్యములోనే లెక్కకువచ్చు ననువిషయ మిచ్చట తెలిసికొన వలెను. ఏలనన, వీరి సాంగత్యములో నుండినయెడల జీవుడు సద్గురునిశరణు పొందనులేడు, నామమును అతనికి లభించదు, సాధుసాంగత్యముగూడ సాగదు. అయినను పరిపూర్ణసద్గురుని దయాకటాక్షము లున్నచో వారు సమస్త కార్యములను సాధించగలరు.

248. నిజముగా సంతుమతమునకును, వేదమతమునకును పద్ధతులలో విరోధమేమియు లేదు కాని, సంతులసిద్ధాంతస్థానము వేదములసిద్ధాంతపదము కన్న చాల యుచ్చతరమైనది. అనగా, వేదములలో కర్మను, ఉపాసనను, చేయు

వలసినదని చెప్పబడినది, సంతులుకూడ వానినే చేయవలసినదని చెప్పుచు న్నారు. మొట్టమొదట శరీరమనోధనముల నర్పించి సద్గురువునకు సేవచేయుటయు, వారి సత్సంగము చేసికొనుటయు, నివి కర్మలనియు, సద్గురువువలన శబ్దములేక నామముయొక్క గుప్తరహస్యము నుపదేశము పొంది, తనఆత్మను దానియందు లీనముచేయుట ఉపాసనయనియు, సంతులు చెప్పుచున్నారు. జీవునకు రూపములు మూడును, ఈశ్వరునకు రూపములు మూడునుగలవని వేదములలో చెప్పబడియున్నది. అనగా, విశ్వ, తైజస, ప్రాజ్ఞ[1] రూపములు మూడు జీవునిరూపములును, విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృత[2], యీ మూడును ఈశ్వరుని రూపములనియు చెప్పబడినది. ప్రస్తుతకాలపుజ్ఞాను లీశ్వరునే యొప్పుకొనుటలేదు. కొంతమంది జనుల గుంపును "సమూహ"మనియు, వేయిమంది యుద్ధభటులను "పలటన్" అనియు నెట్లందురో, ఈశ్వరుడుగూడ నట్లే యొక సంఘరూపమైన పదార్థమని వారి యభిప్రాయము. అందలి వ్యక్తులు వేఱుగా వెళ్ళిపోయినచో "సమూహము", "పలటన్" అను నామములుకూడ లుప్తమైపోవును. ఈ ప్రకారము చూచినచో, నీశ్వరు డెక్కడుండును? ఈశ్వరుడే లేనపుడు ఉపాసన యెవరికి చేయవలయును? ఏలనన, ఉపాసించు దేవతయొక్క నామము, రూపము, లీల, ధామమును తెలియకుండ ఉపాసన సాధ్యముకాదు. అందుచే వీరందఱు గొప్పపొరపాటులో పడియున్నారు. ఆ కారణముననే, వీరి జ్ఞానముకూడ వాచికజ్ఞానము, అనగా, కర్మ ఉపాసనలెవ్వియు చేయకుండగనే, కేవలము గ్రంథములను చదువుటవలనను, బుద్ధివిమర్శమూలముననుసంపాదించిన మెట్టవేదాంతజ్ఞానము. అందెవరికైనను ఉపాసనచేయుటవలన వాస్తవమైనజ్ఞానమే లభించినను గూడ నది సంతులయొక్క గణనలో కర్మయొక్క హద్దులోనిదే. సంతుల నిజదేశము అంతకన్న చాల యెక్కువదూరముగను, మహోన్నతముగను ఉన్నది. వేదములలో లిఖితమైనకర్మలు పురాతనయుగములకు చెందినవి. ఇపుడు అవి జీవులచే యథావిధిగా చేయ సాధ్యములును గావు. అట్టి ఫలితములనుగూడ గలుగచేయనేరవు. ఇప్పు డెవరైనను

1. జీవాత్మకు అవస్థాభేదమునుబట్టి మూడురూపములున్నట్లు చెప్పుదురు. జాగ్రదవస్థలో నున్నపుడు జీవునిరూపము "విశ్వ" యనియు, స్వప్నావస్థలో తైజసరూపమనియు, సుషుప్త్యవస్థలో ప్రాజ్ఞరూపమనియు పేర్కొనబడును.

2. అట్లే బ్రహ్మకుకూడ మూడు రూపములుగలవు. సహస్రదళకమలములోనున్న నిరంజనపురుషుడు బ్రహ్మయొక్క విరాట్‌స్వరూపము, త్రికుటిలోనున్న బ్రహ్మరూపము హిరణ్యగర్భస్వరూపమును, సున్నలోకములోనున్న బ్రహ్మయొక్క గుప్తస్వరూపము అవ్యాకృతమనియు చెప్పబడును.

కర్మ చేయదలచినచో సంతులద్వారానే చేయవలయును; ఉపాసనగూడ సంతుల దయాకటాక్షముల ప్రాపుమీదనే చేయవలయును. అప్పుడే యెవరికైనను కార్యసాఫల్యము చేకూరును, అనగా వేదములయొక్క సిద్ధాంతస్థానమువఱకును ఇంకను దానిని దాటి పైకినిగూడ వెళ్ళి చేరుకొనగలరు. మఱొక విధముగ నిక్కాలమున నెంతమాత్రము కార్యసిద్ధికాజాలదు.

249. భగవత్సాన్నిధ్యమునకు వెళ్ళి చేరుకొనుటకు భక్తులకుదప్ప మఱెవరికిని సాధ్యముకాదు. ఇంతవఱకు గతించిన ఋషులు, మునులు, యోగులు, యతులు, జ్ఞానులు, సన్యాసులు, పరమహంసలు, అందఱునుగూడ వారివారి మతబోధలప్రకారము పరిపూర్ణులే అయిననుగూడ భగవంతునిసాన్నిధ్యము వారికి లభించలేదు. ఏలనన, వారు అహంకారులు, గురుహీనులునై యుండిరి. అనగా, వారికి సంత్ సద్గురువు లభించలేదు. అట్లుండగా, పైనచెప్పిన మహాపురుషులు పరమార్థసిద్ధికొఱకై చేసినసాధనాభ్యాసములలో నాల్గవవంతైననుగూడ పరిశ్రమచేయకుండగనే వారు రచించిన గ్రంథములనుమాత్రము చదివి అంతటితోనే పరిపూర్ణులమైపోయితిమని తలంచుచు సంతసద్గురుని నిందించుచుండు ఈకాలపుజ్ఞానులకు భగవత్సాన్నిధ్యమున నెట్లు ప్రవేశము గలుగును ? ఇప్పుడు సంత్ సద్గురువున కెవరు భక్తిచేయుదురో వారు సాక్షాత్పరమపురుషునకే భక్తిచేయుచున్నారనువిషయము నందఱును త్రికరణయా విశ్వసించవలయును. ఏలనన, సమకాలికులైన పరిపూర్ణసద్గురువునకును పరమపురుషునకు నెట్టిభేదమును లేదు. ఇరువురికిని స్వరూపమొక్కటే.

250. ఎవరైనను పరిపూర్ణసద్గురువును పొంది, వారి సేవాసత్సంగములు భక్తివిశ్వాసములతో చేసికొనుచుండగా ఆ సద్గురువు వీనికి పరమార్థాదర్శము సిద్ధించకముందే, అనగా వీనికి అంతర్యనేత్రము ప్రఫుల్లముకాకముందే గుప్తమైనచో, నట్టివానికి తనకార్యము పూర్తిగ నెఱవేరవలెనను కోరికయుండిన యెడల పూర్వసద్గురువుచే నేర్పరచబడిన సద్గురువు లభించినయెడల నా క్రొత్త సద్గురువులోనే పూర్వసద్గురువు విరాజమానమై యున్నట్లెంచుకొని వారిసేవాసత్సంగములను వారియందు భక్తివిశ్వాసములతో మునుపటివలెనే చేయుచుండవలెను. ఏలనన, సంత్ సద్గురువును, సంతులును దేహస్వరూపములో వేఱువేఱుగ కనబడుచున్నను శబ్దస్వరూపములో నొక్కరేకాని, ఇద్దరుకారు. గుప్తమైనసద్గురువునందు విశ్వాసమును భక్తిని గలిగియుండుట నిరర్థకము. ఏలనన, వారిని చూడనులేదు, వారి సత్సంగమెన్నడును చేయనులేదు. కావున

వారియందు ప్రేమభావ ముత్పన్నమగుట యసంభవము. సద్గురువు నెన్నడు చూడకుండినపుడు వారి చరణములందు ప్రేమభావము ఉత్పన్నము కానేరదు. కావున, శ్రద్ధాళువైనభక్తుడు ప్రత్యక్షసద్గురువు అనగా సమకాలిక సద్గురునికి భక్తి చేయవలయును. ఆ ప్రత్యక్షసద్గురువునకును, పూర్వపుసద్గురువునకును కేవలము దేహస్వరూపములోదప్ప మఱెట్టిభేదముగాని, తేడాగాని లేనట్లే భావించుకొనుచు తనకార్యమును సఫలము గావించుకొనవలెను. ప్రస్తుతజన్మలో తనకు పారమార్థికాభివృద్ధి కావలెననికోరిక లేనిచో నతడు అదివరలోవలె పూర్వపు సద్గురువుసందే భక్తివిశ్వాసముల నట్లేయుంచుకొని వారిరూపము నే ధ్యానము చేయుచు వా రుపదేశించిన సాధనల నభ్యాసముచేయుచుండవచ్చును. అట్లు చేయుచుండినచో సాధకుని అంత్యసమయము వచ్చినపుడు ఆ సద్గురువు తన పూర్వపుస్వరూపములో నితనికార్యము నెంతసాధ్యమగునో అంతవఱకు నెఱ వేర్చుదురు. కాని, సాంతముగ నెఱవేర్చుటకు వీలుకాదు. అతడు తిరిగి జన్మించవలసివచ్చును. అప్పుడతడు తిరిగి సద్గురుసంయోగమునుపొంది, సద్గురువుయొక్క సత్సంగమును భక్తిపూర్వకముగ చేయుగా అతనికి కార్యము పూర్తియగును. సమకాలికసద్గురువు గతించినపుడు వారు తమస్థానే యొకయుత్తరాధికారిని నియమించి, వారిలో స్వయముగ ప్రవేశించి జీవుల యుద్ధారకార్యమును యథాప్రకారము సాగించుచుందురు. అట్లుచేయుటకు భగవదేచ్ఛలేనిచో వారు తిన్నగ స్వధామమునకు తిరిగి వెళ్లిపోవుదురు. భక్తుడైన సేవకుడు గతించిన సద్గురువునకును, క్రొత్తసద్గురువునకును వ్యత్యాసమున్నట్లెంచకూడదనుటకు కారణమిదియే. కాని సేవకుడు కేవలము అంధవిశ్వాసియైనచో ద్వితీయసద్గురువువద్దకు వెళ్లి భక్తిచేయడు. అందువలన నట్టివారికి పూర్వపుసద్గురువుకాలములో కార్య మెంతవఱకు నెఱవేరెనో అంతటితో నాగిపోవును కాని, అంతకు మించి యేమియు నభివృద్ధియుండదు.

251. ఎవనికైనను మొదట శబ్దరహస్యము తెలియనిగురువు లభించి, పిమ్మట కొంతకాలమునకు శబ్దరహస్యము తెలిసినసద్గురువు లభించినచో నతడు మొదటిగురువును విడచిపెట్టి, సద్గురుని శరణుపొందవలెను. ఇందుకు ప్రమాణము:

ఝూఠే గురు కీ టేక్ కో తజత న కీజే బార్ ।
ద్వార న పావే శబ్ద కా భటకే బారంబార్ ॥

తర్జుమా: అసత్యపుగురువును విడచిపెట్టుటలో నాలస్యముచేయకుము. అట్లుచేయనివాడు శబ్దద్వారమును పొందలేక తిరిగితిరిగి జన్మల నెత్తుచునుండును.

నిజమున కాగురువుకూడ తన శిష్యునితోపాటు సద్గురుని శరణుజొచ్చి, వారిద్వారా తనజీవోద్ధారమును కొనసాగించుకొనవలెను.

252. ఎవనికైనను శబ్దరహస్యము నెఱింగినగురువు లభించినను, ఆగురువు పరిపూర్ణుడుకాకుండినచో అనగా ఇంకను అభ్యాసముచేయుస్థితిలోనే యుండిన వాడైనచో నా తరువాత శబ్దసాధనలో పరిపూర్ణుడైన సద్గురువు లభించిన యెడల, నతడు మొదటిగురువును పరిపూర్ణసద్గురువులో నున్నట్లెంచుకొని సద్గురుని శరణు పొందవలెను. అతని గురువుకూడ శిష్యునితో గలిసి సద్గురువు వద్దకుపోయి వారి శరణుజొచ్చుట యవసరము. ఆ గురువు అసూయాపరుడుగాని, అహంకారిగాని యైనచో నట్లు సద్గురుశరణులోనికి రాలేడు. అట్లైనచో శిష్యుడు ఆ గురువుతో సంపర్కము లేకుండా చేసికొని తానొక్కడే పరిపూర్ణ గురుని శరణుపొందవలెను.

253. నీవు సద్గురువును భగవంతుడనుభావముతో నెప్పుడుస్వీకరించితివో నీకు అప్పుడిక సద్గురువుకన్న నెక్కువగ మన్నించి పూజింపదగిన భగవంతుడు మఱొక రెక్కడనుండి వచ్చిరి? నీ కయితే సద్గురువొక్కరే భగవంతుడు. దేహమును ధరించిన గురుస్వరూపమే నీకార్యమును సాధించుటలో మొదట సహాయకరముగ నుండును. వారియొక్క రెండవరూపము సాక్షాద్భగవంతుడైన సత్యపురుష రాధాస్వామీవారి స్వరూపమే. వారే నీకు యథార్థమైన ప్రభువు.

254. దక్షిణదేశములో నొకచోట నొకపూర్ణగురువైన ఫకీరుండెడివారు. ఆయనకొక గొప్పగురుముఖుడైన శిష్యుడుండెను. ఒకరోజున వారు సత్సంగము చేయుచుండగా, మక్కాకు తీర్థయాత్రకై వెళ్లుటకు సిద్ధముగానున్న ఒక మహమ్మదీయమౌల్వీ అచ్చటకు వచ్చి, మక్కా కాబాలు చాలపూజనీయ పుణ్యక్షేత్రములనియు, వారి శిష్యులుకూడ నచ్చటికిపోయి యాత్రచేసికొనవలసినదనియు చెప్పుచు, నాస్థలముల ననేకవిధముల శ్లాఘింపదొడగెను. ఫకీరువారిదగ్గఱ కూర్చుండిన వారి ప్రముఖశిష్యుడామాటలు విని అత్యంతకోపావేశముతో ఆ మౌల్వీగారిమెడ పట్టుకొని ఆయనతలను ఫకీరుగారి చరణములయందుంచి కోట్లకొలది మక్కాలు, కాబాలును, ఈ చరణములలో నున్నవని వక్కాణించి చెప్పెను. ఫకీరుగారు లేచి, దేహబాధకై కొద్దిసేపు బయటకు వెళ్లగా, ఆ సమయములో శిష్యునికి మౌల్వీకిని చాల వాగ్వాదము జరిగెను. ఫకీరుగారు తిరిగి వచ్చినపుడు మౌల్వీ ఆశిష్యునిమీద ఫిర్యాదుచేసెను. అప్పుడు గురువుగారు మౌల్వీ చెప్పినదంతయు సరియే అనియు, కాబా చాలా యుత్తమ

క్షేత్రమును దర్శనయోగ్యమును అనియు చెప్పి ఆమాల్వీతో కలిసీ తనశిష్యుని గూడ వెంటనే అచ్చటకు వెళ్ళి, యాత్రచేసుకొనిరమ్మని ఆజ్ఞాపించెను. ఆ శిష్యుడు పరిపూర్ణ గురుముఖుడగుటచే చేతులుమోడ్చి నిలబడి గురువుగారి ఆజ్ఞానుసారమే చేయుదునని విన్నవించి, వెంటనే మాల్వీతో ఓడపై నెక్కి ప్రయాణము చేయసాగెను. కొంతదూరము వెళ్లినపిమ్మట పెద్దగాలివాన వచ్చి, ఆయోడ పగిలి ముక్కలైపోగా ఫకీరుగారి శిష్యుడుదక్క మిగత నా యోడపైనున్నవారందఱును మునిగిపోయిరి. ఈ శిష్యుడుమాత్ర మొకదుంగ పైన కూర్చుండియుండెను. అతడుకూడ కొద్దిసేపటిలో మునిగిపోవుపరిస్థితిలో నుండగా, సముద్రమధ్యమునుండి యొకహస్తము పైకివచ్చెను. "నీచేతిని నీవు అందిచ్చినచో నిన్ను కాపాడెదను"అని యొక అశరీరవాణిగూడ శిష్యునకు విన వచ్చెను. అంతట నా శిష్యుడు మీరెవరని ప్రశ్నించగా "నేను మహమ్మదు ప్రవక్త"నని సమాధానము వచ్చెను. అందుపైన శిష్యుడు తనకు మహమ్మదు ప్రవక్త ఎవరో తెలియదనియు, తన గురువును దప్ప మఱెవరిని తా నెరుగ ననియు సమాధానము చెప్పెను. అంతట నాహస్త మంతర్ధానమైపోయెను. అతడు ఆ దుంగమీద నీటిలో కొట్టుకొనిపోవుచు తిరిగితిరిగి మునిగిపోవుచు తేలుచునుండగా కొంతసేపటికి మఱొకహస్తము నీటిలోనుండి పైకివచ్చి, "నా హస్తము పట్టుకొనుము నిన్ను కాపాడెద"నని తిరిగి శబ్దము వినిపించెను. అందుపై శిష్యుడు మీ రెవరని ప్రశ్నించగా తాను భగవంతుడని సమాధా నము వచ్చెను. శిష్యుడు "నా గురువే నాకు భగవంతుడు. మఱొకభగవంతుని నేనెరుగ"నని మునుపటివలెనే సమాధానము చెప్పెను. అప్పు డాహస్తము కూడ మాయమైపోయెను. కొంతసేపయినపిమ్మట మూడవసారి మఱొక హస్తము పైకివచ్చెను. ఆహస్తము అతని గురువుగారి గురువుగారిది. వారపు డిట్లు సెలవిచ్చిరి:- "నేను నీగురువునకు గురువును. నీహస్తము నిమ్ము, నిన్ను పైకి తీసివేతును". ఆశిష్యు డపుడిట్లు చెప్పెను: "నేను నాహస్తమును నాగురువు గారికి ఒక్కరికి తప్ప మఱెవరికి నీయజాలను. మీరెవరైన నౌగాక నేను మునిగిపోయినను సరే లేదా బ్రతికినను సరే. నేను నా గురువుగారి సహాయ ములో దప్ప మఱెవరు చెప్పినను పైకిరానేరను." అపుడాహస్తముకూడ మాయ మైపోయెను. అప్పుడాతని గురువుగారే స్వయముగా వచ్చి ఆ శిష్యుని కౌగ లించుకొని వెంటనే తనయింటికి తీసికొనిపోయిరి. ఇపుడు తెలిసికొనవలసిన దేమనగా, మహమ్మదుప్రవక్త, సాక్షాద్భగవంతుడు: తనగురువుగారి గురువును అనుపేర్లతో పలికిన అశరీరవాణులన్నియు నీశిష్యుని పరీక్షార్థమై వలుకబడిన

వనీయు, నతేడు వాస్తవముగ పరిపూర్ణమైన గురుముఖుడని తేలినపుడు గురువు స్వయముగనే వచ్చి యతనిని గాపాడెననియు తేటపడుచున్నది. కావున జీవులు సద్గురువునందు ఇంత దృఢతరము వాస్తవమునైన భక్తివిశ్వాసములను పెంపొందించుకొనవలయును.

255. పతివ్రతయైనస్త్రీ తనభర్తను దప్ప మఱెవరిని మగవానికిందనే యెంచక, పై వారినందఱిని నపుంసకులుగనే చూచును. ఇంతియగాక తన తల్లి దండ్రులందుగల ప్రేమనుకూడ మఱచిపోవును. అట్లే సద్గురువునకు శిష్యులైన వారు తమసద్గురువు దప్ప మఱెవరిని తమ భగవంతుడనిగాని తమకు ముక్తిదాత యనిగాని భావింపకూడదు. తమకు సమకాలికులైన పరిపూర్ణసద్గురువు లభించ నంతకాలముమాత్రమే ప్రాచీనకాలపుసంతులందు విశ్వాసముంచుకొనవచ్చును. కాని, సద్గురువు లభించినపిమ్మట పతివ్రతాస్త్రీవలెనే తమ భావమునంతను వారియందే పెట్టుకొనవలయును కాని మఱొకరియందు పెట్టుకొనగూడదు.

256. వివాహమధ్యవర్తులు, వివాహనిశ్చయము గావించి, వివాహము జరిపించినపిదప నా పెండ్లియైన స్త్రీకి, "చూడుము, నీవిటుపైన నీభర్తనుదప్ప మఱెవ్వరిని ప్రేమించకూడదు, మా పైనగూడ నీ వితరులపై నెట్టిప్రీతి చూపుదువో, అంతటి ప్రీతిభావముమాత్రమే చూపవలయు"నని బోధింతురు. ఇటులనే గురునానక్ సాహబ్ వారును, ఇతరసంతులును మధ్యవర్తులపని చేసిరి. అనగా, పరిపూర్ణసద్గురువును వెదకికొని వారిశరణు పొందవలసినదని వచనములరూప మునను వారి గ్రంథములలోను సెలవిచ్చిరి. వారి వచనములను మన్నించి, సద్గురువు నన్వేషించుకొని వారి శరణ్యము నెవరు స్వీకరించిరో, అట్టివారు తమ సద్గురువునే తమ భగవంతునిగను, భర్తగను భావించుకొనవలెను.

257. జీవుడెల్లపుడును తనసద్గురుని కృపాకటాక్షములనుగూర్చి తలంచుకొనుచు, సద్గురువు తననెట్లు జననమరణచక్రమునుండి కాపాడిరో, కర్మభ్రమల నుండి తప్పించిరో, అనగా పుణ్యక్షేత్రములకు తీర్థయాత్రలుచేయుచు నుపవాస వ్రతములు చేయుచు లోకములో పరిభ్రమించకుండ తప్పించి యథార్థమైన శబ్ద మార్గమునందు దృఢవిశ్వాసము గలుగజేసిరో ఆలోచించుకొనుచుండవలెను. అప్పుడతనికి సద్గురువునందు దృఢప్రేమ కలిగి, వృథాభ్రమలు పుట్టనేరవు. కావున సద్గురువుయొక్క దయాకటాక్షముల నెల్లపుడు మనసున జ్ఞాపకముంచుకొనవలసియున్నది.

258. విద్వత్తుగల గురువు సంయోగములో శాస్త్రార్థములు బాగుగనే జరుగవచ్చును. కాని, జీవునియొక్క పారమార్థికసంశయములు నిర్మూలము కానేరవు. ఒక శ్లోకమునకు నాలుగైదు అర్థములు చెప్పినందువలన సామాన్య జీవులకు అందేయర్థము సరియైనదో తెలిసికొనుట మఱింతయెక్కువ కష్టమై పోవుచున్నది. జీవులకు ముక్తిసాధించునిమిత్తమై ఏది అవసరమో దానిని నిర్ణయించి చెప్పనిచో, జీవులు ముక్తిమార్గము నెట్లు పొందుదురు, ఏసాధన చేయుదురు ? కావున నిష్ఠాపరుడైన గురువునే ఆశ్రయించవలయును. అట్టి గురువు లభించువఱకు కార్యసిద్ధి చేకూరదు. నీకు స్వర్ణతుల్యమైన నరశరీరము లభించినది. దానిని, విలువ తెలిసికొనకుండ రొట్టెపిండిని ఉప్పును వెచ్చించి నట్లు, పండితులు, కాషాయవేషధారులు, వాచకజ్ఞానులయొక్కయు సాంగత్య ములో వృథాచేసికొనక పరిపూర్ణసద్గురువు నన్వేషించుకొని వారిసేవాసత్సంగ ములను చేసికొనవలెను.

259. సద్గురువునందు భక్తిలేకుండ సత్యనామము, రామనామము, హరి నామములను స్మరణచేయువారి ఆ స్మరణాభ్యాసము నిరుపయోగము. ఏలనన, నామము సద్గురువున కధీనమైయున్నది. సద్గురువు నాశ్రయించినవానికి నామము రాముడుగూడ లభ్యమగుదురు. ఎవరు సద్గురువువలన నామోపదేశమును పొంది, వారియెడల భక్తిలేకుండనుందురో అట్టివారికిగూడ నామము లభించనేరదు.

260. సంతు లుపదేశించెడినామము అగోచరమును[1] వేదములలోని నామము గోచరమునై యున్నవి. గోచరమైననామము సత్యనామము కానే రదు. నామము అసత్యమైనపుడు దాని స్థానమును రూపమునుగూడ నసత్య ములే యగును. సంతులుపదేశించెడి నామమును సత్యమే; దాని స్థానము, రూపమునుగూడ సత్యమైనవే. ఏలనన, వర్ణాత్మకనామముయొక్క సహాయ ముచే చిత్తశుద్ధిగలుగవచ్చునుగాని, ఆత్మ యథార్థ్యముగ నారోహించలేదు. ధ్వన్యాత్మకనామము అట్లుగాక ఆత్మను పిండదేశమునుండి బ్రహ్మాండమున కారోహింపజేసి, అక్కడనుండి తిరిగి తన నిజస్థానమైన సత్యలోకమునకు జేర్పిం చగలదు. అట్టి ధ్వన్యాత్మకనామము సంతులవద్దనుండి పొందవలసినదేగాని, మఱెవరివలనను లభింపనేరదు. మహాదృష్టముగలవారికే యీ నామము లభించును.

---

1. ఇచ్చట గోచరమనగా మనస్సుయొక్క హద్దులో నుండునదియు, అగోచరమనగా మనస్సుయొక్క హద్దులను దాటిపోయినదియు ననియర్థము.

261. ఎట్టికష్టము వచ్చినను భక్తుడు తన ప్రభుప్రైన సద్గురువును జ్ఞాపకము తెచ్చుకొనవలయును. తోడనే సద్గురువు తన నిజచైతన్యరూపములో నాభక్తునివద్ద నుందురు. కాలుడును కర్మయు నారూపముదరికి రాలేవు. వారు కూడ ఆ రూపమును చూచి భయపడుచుందురు, దూరదూరముగ నుండియే యీ భక్తుని భయపెట్టుచుందురు. సద్గురువు నోడిలోనుండగా నెట్టి యాపద్భయములు నుండవు. సద్గురువెల్లపుడు రక్షకులై తోడుగనుండి తన భక్తుని కాపాడుచునే యుందురు. భక్తుడు వారి యుద్దేశమును, ఇచ్ఛను తెలిసికొనజాలడు, కాని, సద్గురువున కంతయు పూర్తిగ తెలిసియుండును. దివ్యేచ్ఛయుండినచో వారు తమ శిష్యునకుగూడ తెలియజేయుదురు. సద్గురువు శబ్దస్వరూపులు, ఆత్మస్వరూపులు, ప్రేమస్వరూపులు, ఆనందస్వరూపులు, హర్షస్వరూపులు నైయుండియు తిరిగి అరూపులునై యున్నారు.

262. సద్గురువు తమ సహజకటాక్షముమూలమున జీవుని నెల్లపుడు సంరక్షించుచు, శిష్యులందఱును తమ చరణకమలములందు అనన్యభక్తివిశ్వాసములు గలిగియుండవలెనని కోరుచుందురు. కాని యీ మనస్సు జీవున కట్టిపరిస్థితి గలుగుట కిష్టపడదు. అందువలన నది జీవులను భోగములవైపున కాకర్షించి తన యాజ్ఞలకు బద్ధులుగ నుంచగోరుచుండును. కావున జీవులు మనస్సుయొక్క యీ మోసమునుండి తప్పించుకొని సద్గురుచరణములను దృఢముగ నాంతర్యమున నిలుపుకొనుచు, మనస్సుయొక్క జాలములోపడిపోకుండ నుండవలయును. జీవులకు మనస్సుయొక్క ప్రవర్తనను పరిశీలనచేసికొని, ఆత్మసంరక్షణచేసికొనుటలో పరిజ్ఞానముగలుగజేయుటకై గురుముఖునియొక్కయు, మనముఖునియొక్కయు ప్రవర్తనలను గుఱించి కొద్దిగ నీక్రింద వ్రాయబడుచున్నది. దానినిబట్టి యెవరికివారు తమతమ పరిస్థితిని పరిశీలనచేసికొనుచు జాగరూకతతో ప్రవర్తించవలెను.

1. గురుముఖుడు అందఱితోను న్యాయముగ ప్రవర్తించును. చెడు విషయములలో కలుగజేసికొనడు. ఎవనిని మోసపుచ్చడు. ఏపనిచేసినను, సద్గురువు నిమిత్తమై చేయును, వారి దయమీదనే ఆధారపడి చేయును.

మనముఖుడు అట్లుగాక కాపట్యచాతుర్యములతో ప్రవర్తించుచు, స్వలాభముకొఱకై యితరులను మోసముచేయుచుండును. అతడెప్పుడు తన బుద్ధి, చాతుర్యముల మీదనే ఆధారపడుచుండును. ఇతరులకు తన గొప్పతనమును ప్రదర్శింపగోరుచుండును.

2. గురుముఖుడెల్లప్పుడును, తన మనస్సును, ఇంద్రియములను వశమున నుంచుకొనుచు, లోలోపల దీనత్వముతో నుండును; ఇతరుల హేళనలను, ఆక్షేపణలను సహించుకొనును. హితోపదేశములను ప్రేమాదరభావముతో స్వీకరించును. తనకు గొప్పరావలెనని కోరడు.

మనముఖుడు తన ఇంద్రియమనస్సులను అరికట్టుట కిష్టపడడు. మరొకరికి అణిగియుండుటకుగాని, ఇతరుల ఆజ్ఞలకు లోబడియుండుటకుగాని అంగీకరించడు. ఇతరులనుగురించి శ్లాఘూక్తులను సహించలేడు.

3. గురుముఖుడితరులెవరిపైనను బలాత్కారముచేయ నొల్లడు. ఎల్లపుడును ఇతరులకు ఆదరభావముతో సేవచేయుచు నుపకారముచేయుటకే తలంచుచుండును. అతడు ఇతరులవలన నెన్నడు నాదరసన్మానములను పొందగోరడు. అతడెల్లపుడు సద్గురువును జ్ఞాపకముంచుకొనుచు వారి దివ్యస్వరూపమునే సదా ధ్యానముచేయుచు నానందమగ్నుడై యుండును.

మనముఖుడితరులపైన అధికారము చలాయించుచు, వారిచే సేవచేయించుకొనును. తనకు మానప్రతిష్ఠలు కావలెనని కోరుచుండును. స్వార్థలాభములేనిదే ఇతరులనెవరిని ప్రేమించడు. ఇతరులవలన పూజాసత్కారములను బహుసంతోషముతో పొందుచుండును. అతడెన్నడు సద్గురుచరణములందు ప్రేమతో మగ్నుడై యుండలేడు.

4. గురుముఖుడు దీనభావము నెన్నడును వీడడు. తననెవరైనను నిందగాని నిరాదరణగాని అవమానముగాని చేసినను బాధపడడు. పైగా అందులోనే తనకు శ్రేయస్సున్నట్లెంచుకొనును.

మనముఖుడట్లుగాక నిందావమానములకు బెదరిపోవును. నిరాదరమును సంతోషపూర్వకముగ నెన్నడు సహించనేరడు. తన పేరుప్రతిష్ఠలను కోరుచుండును.

5. గురుముఖుడెన్నడు సేవచేయుటలో బద్ధకించడు. పనిలేకుండ కూర్చుండ నొల్లడు.

మనముఖుడెల్లపుడు శరీరసౌఖ్యమునే గోరుచుండును, సేవచేయుటలో బద్ధకించును.

6. గురుముఖుడు జీవితమును సామాన్యముగను, పేదతనముతోను గడపుకొనును; తనకున్నదానితోనే అనగా, తినుటకాహారము ఏ చప్పని

యుండఁ బొట్టె ముక్కలేయైనను, ధరించుటకు దుస్తులు ఏమతగ వస్త్రములే యైనను వానితోనే సంతుష్టిపడి గడపుకొనుచుండును.

మనముఖు డట్లుగాక నెల్లపుడును శ్రేష్ఠపదార్థములనే గోరుచు, వాని పైననే లగ్నచిత్తుడై యుండును. చప్పని శుష్కాహారములనుగాని తక్కువ రకమైన పదార్థములనుగాని యెన్నడు నిష్టపడడు.

7. గురుముఖుడు తన మనస్సును ప్రాపంచిక వ్యామోహములలోను ప్రాపంచిక పదార్థములలోను చిక్కుకొనసీయడు. ప్రాపంచిక లాభనష్టము లకై సంతోష విచారముల నొందడు. ఎవరైనను తన్నుగుఱించి హీనముగ మాటలాడినను కోపగించడు. అతడెల్లపుడును తన జీవకల్యాణము సాధించు కొనుటయు, సద్గురుప్రసన్నత సంపాదించుకొనుటయు, వీనియందే లక్ష్యముంచు కొని యుండును.

మనముఖుడు ప్రపంచము, అందలి పదార్థములయందే యెక్కువ దృష్టి పెట్టుకొనుచు ప్రాపంచికలాభనష్టములు గలిగినపుడు వెంటనే సుఖ, దుఃఖముల పాలగుచుండును. ఎవరైనను అప్రియవచనములు మాట్లాడినచో వెంటనే కోపగ్రస్తుడై పోవును. సద్గురువుయొక్క దయాకటాక్షములు సమర్థతలపైన విశ్వాసముగాని ధ్యానముగాని పెట్టుకొనడు.

8. గురుముఖుడు ప్రతివిషయములోను, నిజాయితీతోను, ధారాళము గను ప్రవర్తించును. ఉదారమనస్కుడుగనుండి ఇతరుల కుపకారము చేయుచు నితరుల మంచి కోరుచుండును. తాను స్వల్పములోనే సంతోషించుచు ఇతరుల నుండి ఏమియు తీసికొనగోరడు.

మనముఖుడు దురాశాపరుఁడై, యితరులవద్దనుండి పరిగ్రహమున కెప్పుడు సిద్ధముగ నుండునుగాని, తానెద్దియు నితరుల కీయగోరడు. ప్రతి విష యములోను స్వలాభమునే గోరుచు, నితరుల కష్టసుఖముల యాలోచన లేకుండ తనయాసను పెంచుకొనుచుండును. ధారాళములేకుండ ప్రవర్తించును.

9. గురుముఖుడు ప్రాపంచికజీవుల నెక్కువగా ప్రేమించడు. భోగముల కొఱకు వాంఛనుగాని, ఆశనుగాని పెట్టుకొనడు. దేశాటనము సల్పవలయునని గాని, వినోదములు చూడవలెననిగాని, కోరికతో నుండడు. అతడు భగవ చ్చరణారవిందప్రాప్తి నొక్కటేకోరుచు ఆ యానందములో మగ్నమనస్కుడై య్యుండును.

మనమ్ముఖునకు ప్రాపంచికజీవులు, పదార్థములయందును ప్రేమాసక్తులు మెండుగనుండును. అతడు ఐహికసుఖభోగములనే కోరుచు, వివిధప్రాంతము లకు పర్యటించుటలోను, వినోదములు చూచుటలోను సంతోషము నొందు చుండును.

10. గురుముఖు డేపని చేసినను సద్గురుని ప్రసన్నత కొఱకే చేయుచు, వారి దయాకటాక్షములనే కోరుచు, వారిమహిమనే గానము చేయుచు, వారి మహత్తునే సకలవిషయములలో గమనించుచుండును. అతని కైహికవాంఛ లుండవు.

మనముఖుడేపనిచేసినను అందులో నేదోయొక స్వార్థలాభమునుగాని విషయానందమునుగాని ముఖ్యముగా చూచుకొనుచుండును. ఏలనన, అత డేమిచేసినను తన స్వార్థములేకుండ చేయనేరడు. అతడెప్పుడును ఇతరులవలన పొగడ్తలను ఆదరగౌరవములను కోరుచుండును. అతనికి ప్రాపంచికవాంఛలు ప్రబలముగ నుండును.

11. గురుముఖు డెవరితోను విరోధము పెట్టుకొనకపోవుటయేగాక విరో ధులనుగూడ ప్రేమతోనే చూచుచుండును. అతడు తనకులము, కుటుంబము, బంధువుల విషయములోగాని, గొప్పవారితో తనకుగల స్నేహమునుగుఱించి గాని యెట్టి అహంకారమును పెట్టుకొనడు. అతడు భగవద్భక్తులను, నిజమైన పరమార్థిజీవులను ఎక్కువ ఆప్యాయముతో ప్రేమించును. సద్గురు చరణములం దెల్లపుడు ప్రేమాశ్రుని రగుల్కొలుపుకొనుచు ప్రతినిత్యము వారి దయాకటా క్షముల నధికాధికముగ సంపాదించుకొనవలె ననుకోరికతో నుండును.

మనముఖు డెప్పుడు తనకుటుంబము పెద్దదిగావలెననియు, తన కెక్కువ మంది బంధుమిత్రు లుండవలెననియు కోరుచుండును. ధనాఢ్యులతోను, అధి కారులతోను ఎక్కువ స్నేహముచేయుచుండును. అట్టివారిమైత్రిని గుఱించియు తన కులమును గుఱించియు నహంకారము పెట్టుకొనుచు నెక్కువగ ఆడంబర కార్యములను చేయగోరుచుండును. సద్గురుని ప్రసన్నత సంపాదించువిషయ ములో నతనికి దృష్టి తక్కువగ నుండును.

12. గురుముఖుడు లేమికిని, దారిద్ర్యమునకును భయపడడు. ఏ కష్టము వచ్చినను ధైర్యముతో సహించుచు, సద్గురువుయొక్క దయాకటాక్షముల మీదనే విశ్వాసము కలిగియుండి ఎల్లప్పుడును సద్గురువునకు ధన్యవాదము లర్పించుచునే యుండును.

మనముఖుడు కష్టములు వచ్చినపుడు అధికముగ భయభీతుడై, తోడనే దుఃఖాక్రందనములు ప్రారంభించును. దరిద్రావస్థవచ్చినపుడు ఇతరులతో చెప్పుకొనుచు దుఃఖపూరితుడై యుండును.

13. గురుముఖు డన్నివిషయములను భగవదేచ్ఛకు విడచిపెట్టి తనకు జయముకలిగినను, అపజయము గలిగిననుగూడ మనస్సున నెట్టి యహంకారము రానీయకుండ ప్రవర్తించుచుండును. తనమాట నెట్లైన నెగ్గించుకొనవలెనని మూర్ఖపు పట్టుదల పెట్టుకొనడు. ఇతరుల మాటలను, చేతలను నిందించడు, ఇతరులతో జగడములను పెట్టుకొనడు. ప్రతివిషయములోను సద్గురుని దివ్యేచ్ఛను గమనించుకొనుచు, వారి గుణగానము చేసికొనుచుండును.

మనముఖు డన్నిపనులలోను మొండిపట్టు పట్టుచుండును. స్వలాభము నిమిత్తమును, తన ఇంద్రియసుఖముల నిమిత్తమును, తంటాలు, తగాయిదాలలోనికి దిగిపోవుచుండును. తనమాట నెగ్గించుకొనుటకై క్రోధమువహించి పోట్లాడుటకుకూడ సిద్ధమగుచుండును.

14. గురుముఖుడు క్రొత్తక్రొత్తపదార్థములను విషయములను చూచినపుడు వానికొఱకై వ్యామోహపడడు. ఏలనన, అవి ప్రాపంచికబంధనములకు కారణభూతములని యతనికి తెలియును. తన సుగుణములను ప్రపంచమునుండి గోప్యముగ నుంచుకొని ప్రవర్తించుచుండును. ఇతరులచే పొగడ్తలబడయనొల్లడు. తాను కన్న విన్న విషయములన్నిటినుండియు, తనకు సద్గురుచరణములందు భక్తివిశ్వాసములను పెంపొందించునట్టి యంశములనే గ్రహించుచు సమస్తసుగుణములకు భండారమైన సద్గురునిమహిమ నెల్లపుడు గానము చేయుచుండును.

మనముఖు డట్లుగాక, నెల్లపుడు క్రొత్తక్రొత్త విషయములను వినగోరుచు, దృశ్యములను చూడగోరుచు, ప్రతివ్యక్తియొక్క గుట్టులను, రహస్యవిషయములను వాకబుచేయుచుండును. వివిధస్థలములనుండియు కబుర్లు, వార్తలు తెలిసికొని తన్మూలమున తన తెలివితేటలను, బుద్ధిచాతుర్యమును వృద్ధిచేసికొనుచు, ఆవిషయముల నందఱకుచెప్పుచు అందఱును తనను పొగడుచుండునట్లు చేసికొనజూచుచుండును. తన స్తుతిపాఠములను విన్నపుడు అమిత సంతోషము నొందుచుండును.

15. గురుముఖుడు తానుచేయు పారమార్థికకృత్యములను ఓరిమితో నొనర్చుచు, నెల్లపుడు సద్గురు దయాకటాక్షములపైననే భారమువేసి వారి చరణములందు దృఢవిశ్వాసము కలిగియుండును.

మనముఖు డెల్లపుడు తొందరపడుచు, ప్రతికార్యము బహుశీఘ్రముగ పూర్తిచేసికొనగోరును. ఆ తొందరలో నతడు సద్గురు దయాకక్షములయం దాధారపడుటయే మఱచిపోయి, వారి మహావచనములందు విశ్వాసముగూడ గోల్పోవును.

గురుముఖుని ప్రవర్తననుగుఱించి పైన వర్ణించినవిషయములన్నియు కేవలము సద్గురుకటాక్షమువలననే లభ్యము కాగలవు. వారికృపాకటాక్ష మెవని యందుపడునో వానికే వారావరదాన మిచ్చెదరు. వారి చరణములందు భక్తి విశ్వాసములుగలవారి కావరదాన మెప్పటికైన లభించితీరును. సద్గురుచరణము లందు భక్తి సమస్తసద్గుణములకును భండారము. ఎవనికి ప్రేమదానము లభిం చెనో అట్టివానిలో పైన చెప్పినసుగుణములన్నియు వాటంతటవియే వచ్చి చేరును, మనోముఖలక్షణములన్నియు నొక్క-క్షణమాత్రకాలములో నశించి పోవును.

263. సంతుమహాత్ములు జీవకళ్యాణార్థమై సద్గురుభక్తియు, శబ్దభక్తియు దప్ప కలియుగములో మఱొకమార్గమునుగాని పద్ధతినిగాని వివరించియుండలేదు. వేదములందును, పురాణములందునుగూడ కలియుగములో నిదేసాధనగా చెప్ప బడియున్నది. అనగా కలియుగములో గురువుయొక్క-యు, నామముయొక్క-యు ఉపాసనలవలన జీవునికార్యము నెఱవేఱగలదని విధించబడియున్నది. ఇందుకు ప్రమాణములు అనేకములు గలవు. విగ్రహాపూజలు, తీర్థయాత్రలు, ఉపవాస వ్రతములు, జపతపములు, హోమయజ్ఞములు, ఆచారములును, వివిధజాతు లకు వర్ణస్తులకు చెప్పబడిన కర్మలును, హఠయోగ అష్టాంగయోగములును ఇవన్నియు పూర్వయుగములకు వర్తించునట్టి ధర్మములు. ఈ యుగములో నివి యెవరికిని యథావిధిగ చేయుటకును శక్యముగావు, వీనివలన జీవకళ్యాణసిద్ధి యగునంతటి ఫలితముగూడ గలుగ నేరదు. అందుచే నివన్నియు నిక్కాలమున పూర్తిగ నిషిద్ధములు. ఈ కర్మలను మొండిపట్టుదలతో చేయుచుండెడి జీవుల పరిస్థితిని పరికించిచూచినయెడల మొదటివిషయము, వారు ఈ కర్మలను చేయ వలసినవిధముగా చేయజాలకుండిరనియు, రెండవది, వారాకర్మలకు సంబంధించిన బాహ్యకృత్యములను అనుష్ఠించుచున్నట్లు కనపడినను, ఆ యనుష్ఠానమువలన

వారికి అహంకారమెక్కువగా ప్రబలి, అంతఃకరణశుద్ధికి బదులుగ మఱింత యెక్కువపాపము, మాలిన్యము పెరుగుచున్నదనియు తేటపడును. కావున జీవులు ఈ కర్మలలో తమ శరీరమనోధనములను వ్యర్థముగ వ్యయపరచి మోస పోకుండుట యుక్తము. బాగుగ విక్షచణచేసినయెడల నిట్టికర్మలను చేయుటకై హితోపదేశముల నిచ్చువారు జీవికోపార్జనాపరులుగాని, అహంకారప్రధానులు గాని అయియుండి, తమపొట్ట పోసుకొనునిమిత్తముగాని, లేక తమ పేరుప్రతి ష్ఠల నిమిత్తముగాని అట్లుచేయుచున్నారని తెలియగలదు. జీవుని కళ్యాణమును గురించిన ఆలోచనయే వారికిలేదు. అందుచే వారి మాటలను వినకూడదు. ఈవిషయమైగూడ సంతుల మహావాక్యప్రమాణము లెన్నియో గలవు. వానిని బట్టి పైనవివరింపబడిన కర్మలెవ్వియు కలియుగమున చేయుటకు ఎంతమాత్రము నాజ్ఞలేదని విస్పష్టమగుచున్నది. ఆ ప్రమాణములను కేవలము ప్రాపంచికజీవు లును, పరమార్థము పేరుతో జీవికోపార్జన చేసికొనువారును, లేదా, అహం కారపూరితులును మాత్రమే తిరస్కరించువారు. అందుచే నీ యుపదేశము గూడ నట్టివారినిమిత్తమై కాదు. వివేకశాలియైన పరమార్థికి కొంచెము జాగ్ర త్తగ విమర్శించినయెడల సంతులు, మహాత్ములును ప్రాచీన కర్మధర్మములను ఖండనచేయుచు చెప్పిన యీ మహావచనములు యథార్థమైనవో కావో బోధ పడగలదు. ఉదాహరణకు విగ్రహారాధనయొక్క ఉద్దేశ్యము మనస్సును, చిత్తమును ఏకాగ్రముగ చేసికొనుటకొఱకు అయియుండెను; కాని, ప్రస్తుత కాలములో నదియొక వినోదవిషయమైపోయినది. అనగా విగ్రహమును భక్తి శ్రద్ధలతో ఒకటిరెండు గంటలసేపైనను దృష్టినిలిపి దర్శనము చేసికొనువా రొకరునుకూడ నిపుడులేరు. అట్టి పరిస్థితిలో ప్రాచీనమహాపురుషులిక్కార్యము నకు చెప్పినఫలితము వీరి కెట్లు లభించగలదు? పైగా ఈపనివలన వారి మన స్సును చిత్తవృత్తులును చెదరి బాహ్యాడంబరములలో సంలగ్నమైనచో లాభ మునకు బదులు నష్టమే సంభవించును. ఇదేవిధముగ ప్రాచీనకాలములో సంతు మహాత్ములు పుణ్యక్షేత్రములలో నివసించుచుండెడివారు. కాన నచ్చటికి వెళ్లిన వారు సంతుమహాత్ముల దర్శనమును సత్సంగమును చేసికొని, అంతఃకరణ శుద్ధిని పొందుచుండెడివారు. కాని యిపుడట్లుగాక, జనులు గంగ, యమున, లేక మరేయితర నదీజలములలోగాని స్నానముచేసి, మిగత కాలమంతయు బజార్లలో తిరుగుచు, బహువిధ వస్తువుల క్రయవిక్రయములు జరుపుటలోను సంతర్పణల కేర్పాట్లుచేయుటలోను, అన్నపానాదులలోను వ్యయపఱచు చున్నారు. ఇదియునుగాక జనసమర్థములోను యెక్కువ అల్లరి చప్పుళ్ళు గల

స్థలములలోను, సరిగ సత్సంగముగాని, అంతర్ముఖాభ్యాసముగాని చేయుటకే వీలుండదు. అందుచే తీర్థయాత్రల ఫలితముగూడ తలక్రిందై పోయినది. పుణ్య క్షేత్రములు వినోదములకును, ఉత్సవములకును కార్యస్థానములుగ మాఱి పోయినవి. అదేతీరున జపతపములనుగూడ జనులు కేవలము గతానుగతిక ముగగాని బాహ్యాడంబరముకొఱకుగాని చేయుచున్నారే తప్ప అవిచేయు నపుడు వారికి కొంచెముగూడ చిత్తవృత్తుల నిరోధమునుగుఱించిన ఆలోచనయే లేదు. అందుచే నీకృత్యములవలనగూడ లాభమునకుబదులు హానియే గలుగు చున్నది. ఏలనన, సంవత్సరములకొలది జపతపములలో గడచిపోవుచున్నవి కాని, పరిస్థితిచూడగ అట్టివారిలో సాంసారికవాసనలు మఱింత యధికమగుటయే తప్ప, పారమార్థికాభివృద్ధి యేమియు కానరాకున్నది. ఈ జీవికోపార్జనాపరుల యొక్కయు, ప్రాపంచిక జీవులయొక్కయు సహవాసములోబడి అమాయకు లైన వాస్తవపరమార్థులుగూడ తమభక్తిని పోగొట్టుకొని, ఈ నిష్ఫలక్రియల లోనే తమ కాలమును వ్యర్థపుచ్చుకొనుచున్నారు. ఇక క్రియాయోగము[1] నష్టాంగయోగము లన్ననో, అవి ఇక్కాలమునకు తగినవికావు. ఏలనన, ప్రస్తుతకాలములో జీవుల శరీరములకు ఆ సాధనలలోని కష్టములను సహించు కొనగల శక్తి లేదు; ఆ సాధనలుకూడ జయప్రదముగ చేయగలిగినవి కావు. కారణమేమన వాని యమనియమములను పాటించుట బొత్తిగ నసాధ్యము. అందుచే నాసాధనల ఫలితములుగూడ నీ కాలములో తాఱుమాఱై పోయినవి. అదేతీరున ఉపవాసవ్రతములు మున్నగునవిగూడ పండుగపర్వములుగ మాఱి పోయినవి. ఎట్లనగ జనులు ఆ వ్రతదినములలో మామూలుకన్న నధికస్వాదిష్ఠ పదార్థములను భుజించుచు, నందుమూలమున నెక్కుడు నిద్రాబద్ధకములను పుట్టించుకొనుచున్నారు. కాని భగవదారాధనోపాసనల ప్రసక్తియే యుండుట లేదు. పైగా సకలపాపములకు మూలమైనట్టి అహంకారముమాత్ర మీకర్మల ఫలితముగ పెరిగిపోవుచున్నది. ఈ విధముగనే మిగత అన్నికర్మల పరిస్థితి గూడ బాగుగ నాలోచించి చూచినయెడల నాకర్మలు చేసినందువలన నిక్కా లమున పరమార్థలాభ మొకించుకగూడ కలుగదు సరికదా, మీదుమిక్కిలి వీటిమూలమున మనస్సు, చిత్తమును మఱింతయెక్కువ అహంకారభూయిష్టమై మలినమై పోవుచున్నవని బోధపడును. కొందఱు వేదాంతశాస్త్రమున కంగ ములుగ చెప్పబడు జ్ఞానగ్రంథములను చదివి మననముచేసి తమ్ముతాము జ్ఞానులుగను బ్రహ్మస్వరూపులుగను భావించుకొనుచున్నారు. ఈ కాలములో

1. క్రియాయోగమనగా హఠయోగము.

ప్రచారములో నున్న మార్గములన్నిటికన్న నెక్కువ వికృతిరూపమైన మార్గ మిదియే. మొదటివిషయ మేమనగ, ప్రస్తుతకాలములో వ్యాపించియున్నట్టి జ్ఞానము వేదాంతశాస్త్రములో నుదహరించిన యథార్థజ్ఞానము కాదు. వేదాంత శాస్త్రముయొక్క అంగముల నన్నిటిని సాధించిననాడే వేదాంతమార్గమును అనుసరించినట్లు చెప్పుకొనుట యుక్తము. అనగా మొదట కర్మ, ఉపాసనలను చేసి సాధనచతుష్టయము సంపాదించిన పిదపనే జ్ఞానముపొందుట కధికారము గలుగును. ప్రస్తుతకాలములో ప్రచలితమైయున్న జ్ఞానగ్రంథములలో కర్మో పాసనల ప్రసక్తి కొంచెముగూడ కానవచ్చుటలేదు. నేటికాలపు జ్ఞానులు కర్మోపాసనల నెంతమాత్రము ననుష్ఠించుటయులేదు. అట్టి స్థితిలో వీరికి జ్ఞాన మెవ్విధముగ నెచ్చటినుండి సంప్రాప్తము కాగలదు? జ్ఞానగ్రంథములను పఠించి వానియర్థము నవగాహనచేసికొని మననము చేయుటయే కర్మయు నుపాసనయు నని వారు చెప్పుదురు. అట్లైనచో, యోగాభ్యాసము చేసినపిమ్మట జ్ఞానపదవిని పొందిన వ్యాస వశిష్ఠాది ప్రాచీనజ్ఞాను లందరును మూర్ఖులై యుండిరనియు తమ జీవితకాలమంతయు ననవసరముగ మహాప్రయాసలు పడుచు పాటుచేసు కొని యుండిరనియునా? ప్రస్తుతకాలములో ప్రచలితమైన యీ జ్ఞానమును ప్రతిమానవుడును చాల సులువుగ కొద్దిరోజులలోనే సంపాదించగలుగును. ఏలనన, ఈ పద్ధతిలో మూడునాలుగు గ్రంథములు చదువుటయు, నవగాహన చేసికొనుటయునే సాధనముగను, సిద్ధాంతముగను పరిగణింపబడుచున్నవి. మనస్సును నిశ్చలముగను, నిర్మలముగను చేసికొనవలసిన యావశ్యకతయే గుర్తింపబడలేదు. అట్లైనచో జ్ఞానికిని, అజ్ఞానికిని వ్యత్యాసమేమున్నది? ఈజ్ఞాని ముఖతః జ్ఞానవచనములు చెప్పుచుండుననువిషయ మొక్కటి దప్ప ప్రవర్తనలో నిరువురు నొకే విధముగ నున్నారు. అయితే నోటిమాటలతో జీవోద్ధారము కానేరదు. ఏలనన, ఎల్లపుడును యోగాభ్యాసము చేయుటమూలముననే విప్ప బడగలిగినట్టి జడచైతన్యములయొక్క గ్రంథి కేవలము నోటిమాటలతో నెన్న టికిని విడిపోనేరదు. ఎవరైనను తమ మనస్సులో బాగుగ విమర్శచేసికొనినచో నీ జ్ఞానమార్గమువలన జీవకళ్యాణమెన్నటికిని సిద్ధించనేరదనియు, ఇంద్రియమన స్సులను వశీకరణముచేసికొనుటగూడ సాధ్యముకాదనియు, స్పష్టముగ తెలియ గలదు. ప్రాచీనయుగములయొక్క కర్మలుగాని, అష్టాంగయోగాభ్యాసము గాని యిక్కాలమున సాధనచేయుటకు శక్యముకానపుడు, ఆకర్మలయొక్క ఫలి తముగ పొందవలసిన జ్ఞానముమాత్ర మిపుడెట్లు లభించగలదు? దీనినిబట్టి,

ప్రస్తుతకాలపుజ్ఞానులు చెప్పుచున్నదియు, చేయుచున్నదియు నంతయు కేవలము వాచకజ్ఞానమని తేలపడుచున్నది. ఎట్లనగా ఒక క్షుధార్తుడు వేవేలు మధురపదార్థములపేర్లు వివరముగా నోటితో పేర్కొని వానిని వర్ణించినంత మాత్రమున నతనికి జిహ్వాయు తియ్యబడదు, పొట్టయు నిండదు. కావున సంతులు జ్ఞానమతమును కలియుగములో పూర్తిగ నిషేధించి, జీవునికి ముక్తి, ఉద్ధారము కావలెనన్నచో సద్గురుభక్తియు, శబ్దారాధనయు ముఖ్యమని నిర్ణయించిరి. విద్యావంతులు, అహంకారులు, పరమార్థముపేరుతో జీవికోపార్జన చేసికొనువారును, ఈ హితోపదేశమును విని కోపోద్రిక్తులై దీనిని ఖండించెదరు. న్యాయమైన పారమార్థికజీవులుమాత్రము ఈ వచనమును చక్కగ బోధపఱచుకొని ఆ ప్రకారమాచరింతురు.



R. S.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 24 | 23 | దాన్ జీ | దాస్ జీ |
| 24 | 24 | హరిదాన్ జీ | హరిదాస్ జీ |
| 57 | ,, | ప్రాపంచిజీకవుల | ప్రాపంచికజీవుల |
| 62 | 10 | గురుపులని | గురువులని |
| 119 | 26 | గ్రధసాహబ్ | గ్రంధసాహబ్ |

R. S.

# రాధాస్వామీ సత్సంగసభ, దయాల్బాగ్ వారిచే
# ప్రచురింపబడిన గ్రంథములు

పరమగురు స్వామీజీ మహారాజ్ వారు రచించినవి.

| | | | పుటలు | వెల |
|---|---|---|---|---|
| 1. | సారబచన్ (శబ్దములు) | హింది | 938 | (అచ్చులోనున్నది) |
| 2. | సారబచన్ (వచనము) | ,, | 197 | 3-00 |

పరమగురు హుజూర్ మహారాజ్ వారు రచించినవి.

| | | | | |
|---|---|---|---|---|
| 3. | రాధాస్వామీ మతప్రకాశ్ | ఆంగ్లము | 106 | 1-50 |
| 4. | పిల్గ్రిమ్స్ పాత్ | ,, | 80 | 1-00 |
| 5 | రాధాస్వామీ మత సందేశ్ | హింది | 80 | 1-00 |
| 6. | రాధాస్వామీ మత ఉపదేశ్ | ,, | 68 | 1-00 |
| 7. | నిజ ఉపదేశ్ | ,, | 70 | 1-00 |
| 8. | ప్రేమ్ ఉపదేశ్ | ,, | 80 | 1-00 |
| 9, | సార ఉపదేశ్ | ,, | 125 | 1-25 |
| 10. | ప్రశ్నోత్తర్ | ,, | 54 | 1-00 |
| 11. | జుగత్ ప్రకాశ్ | ,, | 122 | 1-25 |
| 12 | ప్రేమ్‌బాణి 1వ భాగము | ,, | 454 | (అచ్చులోనున్నది) |
| 13. | ప్రేమ్‌బాణి 2వ ,, | ,, | 429 | 4-50 |
| 14. | ప్రేమ్‌బాణి 3వ ,, | ,, | 420 | 4-50 |
| 15. | ప్రేమ్‌బాణి 4వ ,, | ,, | 180 | 3-00 |
| 16. | ప్రేమ్‌పత్ర 1వ ,, | ,, | 455 | 4-50 |
| 17. | ప్రేమ్‌పత్ర 2వ ,, | ,, | 441 | (అచ్చులోనున్నది) |

పరమగురు మహారాజ్ సాహెబ్ వారు రచించినవి

| | | | | |
|---|---|---|---|---|
| 18. | డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీఫెయిత్ | ఆంగ్లము | 190 | 4-00 |

పరమగురు సర్కార్ సాహెబ్ వారు రచించినవి

| | | | | |
|---|---|---|---|---|
| 19. | ప్రేమ్ సమాచార్ | హింది | 66 | 1-00 |

పరమగురు సాహబ్జీ మహారాజ్ వారు రచించినవి.

| | | | |
|---|---|---|---|
| 20. | యథార్థ ప్రకాశ్ (పూర్తి గ్రంథము) | ఉర్దూ | 2-25 |
| 21 | ,, ,, (1,2 భాగములు) | ,, | 1-00 |
| 22. | ,, ,, (3వ భాగము) | ,, | 1-25 |
| 23. | ,, ,, ( ,, ) | హిందీ | 1-50 |
| 24. | సత్సంగ్ కే ఉపదేశ్ (1వ భాగము) | ఉర్దూ | 1-00 |
| 25. | అమృత బచన్<br>(పరమగురు మహారాజ్ సాహబ్ వారు రచించిన "డిస్కోర్సెస్ ఆన్ రాధాస్వామీ ఫెయిత్" అను గ్రంథమునకు అనువాదము) | ,, | 1-50 |
| 26 | అమృత బచన్ | బెంగాలీ | 2-00 |
| 27. | భగవద్గీతా కే ఉపదేశ్ | ఉర్దూ | 0-75 |
| 28. | రాధాస్వామీ మతదర్శన్ | తమిళము | 0-30 |
| ✓29. | ,, ,, | తెలుగు | 0-50 |
| 30. | జిజ్ఞాస | ఉర్దూ | 0-40 |
| 31. | ,, | బెంగాలీ | 0-20 |
| 32. | ,, | తమిళము | 0-20 |
| ✓33. | ,, | తెలుగు | 0-50 |
| 34. | ముక్తావళి | ,, | 0-75 |
| 35. | మిశ్రిత వచనములు | ,, | 0-75 |
| 36. | ప్రేమ్ సందేశ్ | హిందీ | 0-25 |
| 37. | దీన్ - వ - దునియా | ఉర్దూ | 0-25 |
| 38. | సంసారచక్ర | ,, | 0-25 |
| 39. | రోజానా వాకఆత్ | ,, | 0-40 |
| 40. | ,, ,, | హిందీ | 0-50 |
| 41. | ప్రేమ్ బిలాస్ | ,, | 3-00 |
| 42. | బాణీ సంగ్రహ్ (1వ భాగము) | ,, | 1-50 |
| 43. | ,, (2వ ,, ) | ,, | 2-00 |

## రాధాస్వామీ సత్సంగసభవారి ఆధ్వర్యమున అనువదింపబడిన గ్రంథములు

| | | పుటలు | వెల |
|---|---|---|---|
| 44. రాధాస్వామీ మతప్రకాశ్ (పరమగురు హుజూర్ మహారాజ్ వారు రచించినది) | బెంగాలీ | 100 | 1-25 |
| 45. రాధాస్వామీ మతప్రకాశ్ | తెలుగు | | 1-00 |

### ఆంగ్లానువాదములు

#### పరమగురు స్వామీజీ మహారాజ్ వారు రచించినవి

| | | |
|---|---|---|
| 46. సారబచన్ (వచనము) | 175 | 3-00 |

#### పరమగురు హుజూర్ మహారాజ్ వారు రచించినవి

| | | |
|---|---|---|
| 47. ప్రేమ్ పత్ర (1వ భాగము) | 377 | 5-50 |
| 48. ప్రేమ్ పత్ర (2వ ,, ) | 381 | 5-50 |
| 49. ప్రేమ్ పత్ర (3వ ,, ) | 370 | 5-50 |
| 50. ప్రేమ్ పత్ర (4వ ,, ) | 326 | 5-50 |
| 51. ప్రేమ్ పత్ర (5వ ,, ) | 336 | 5-50 |
| 52. ప్రేమ్ పత్ర (6వ ,, ) | 104 | 1-50 |
| 53. రాధాస్వామీ మత ఉపదేశ్ | 60 | 1-00 |
| 54. రాధాస్వామీ మతసందేశ్ | 73 | 1-00 |
| 55. ప్రేమ్ ఉపదేశ్ | 88 | 1-00 |

#### పరమగురు సాహబ్జీ మహారాజ్ వారు రచించినవి

| | | |
|---|---|---|
| 56. యథార్థ ప్రకాశ్ మేలుప్రతి 1వ భాగము | 186 | 4-00 |
| 57. యథార్థ ప్రకాశ్ సాదాప్రతి ,, | 186 | 3-00 |
| 58 యథార్థ ప్రకాశ్ 2వ భాగము | 315 | 5-00 |
| 59. యథార్థ ప్రకాశ్ (ప్రథమ సంపుటము) 3వ భాగము | 341 | 5-00 |
| 60. యథార్థ ప్రకాశ్ (ద్వితీయ సంపుటము) 3వ భాగము | 273 | 3-50 |
| 61. జిజ్ఞాస | 42 | 1-00 |
| 62. రాధాస్వామీ మతదర్శన్ | 62 | 1-00 |
| 63. ప్రేమ్ సందేశ్ | 64 | 1-00 |

| | | పుటలు | వెల |
|---|---|---|---|
| 64. సత్సంగ్‌కే ఉపదేశ్ | 1వ భాగము | 182 | 3-50 |
| 65. సత్సంగ్‌కే ఉపదేశ్ | 2వ భాగము | 242 | 3-50 |
| 66. సత్సంగ్‌కే ఉపదేశ్ | 3వ భాగము | 152 | 3-00 |
| 67. జతన్ ప్రకాశ్ | | 45 | 1-00 |
| 68. సెలెక్షన్స్ ఫ్రమ్ ప్రేమ్‌సందేశ్ | | 65 | 1-00 |

రాధాస్వామీ సత్సంగసభ వారి ఆధ్వర్యమున రచింపబడినట్టియు,
సంకలనము గావింపబడినట్టియు గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 69. ఫోర్ లెటర్స్ (పరమగురు సర్కార్ సాహబ్ వారు రచించినది) | ఆంగ్లము | 42 | 0-50 |
| 70. శబ్ద సంగ్రహ్ 1వ భాగము | హిందీ | 301 | 3-50 |
| 71. శబ్ద సంగ్రహ్ 2వ ,, | ,, | 460 | (అచ్చులోనున్నది) |
| 72. సంత్‌బాణీ సంగ్రహ్ 1వ భాగము | ,, | 82 | ,, |
| 73. సంత్‌బాణీ సంగ్రహ్ 2వ ,, | ,, | 116 | ,, |
| 74. రత్నావళి | ,, | 86 | 0-50 |
| 75. దయాల్బాగ్ పామ్‌ఫ్లెట్ (క్రొత్తది) | ఆంగ్లము | 40 | 0-50 |
| 76. సోవెనీర్ | ,, | 343 | 5-50 |
| 77. సోవెనీర్ | తెలుగు | 382 | 5-00 |
| 78. జడ్జిమెంటు (దయాల్బాగ్, స్వామీబాగ్‌ల మధ్య నడచిన దావాలో తీర్పు) | ఆంగ్లము | 200 | 1-50 |
| 79. Huzur Sahabji Maharaj As Others Saw Him | ఆంగ్లము | | 3-50 |
| 80. మహరాజ్ సాహబ్, సర్కార్ సాహబ్. సాహబ్జీ మహరాజ్‌వార్ల వచనములు 1వ భాగము | హిందీ | | 4-50 |
| 81. ,, ,, 2వ ,, | ,, | | (అచ్చులోనున్నది.) |

---

శ్రీ కృష్ణా ప్రింటింగ్ ప్రెస్, కాకినాడ. ఫోన్ : 384